## విజ్ఞాన సరోవర ప్రచురణలు

విజ్ఞాన సరోవర ప్రచురణల సంస్థ నిరుపేద విద్యార్థులకు సహకరించడమేగాకుండా ఎన్నో ప్రచురణల ద్వారా ప్రజల్లోకి ఉత్తమ భావజాలం తీసుకొని వెళ్ళే ప్రయత్నంలో ఈ క్రింది పుస్తకాలను అందిస్తున్నది.

1. రెడ్డిరాజ్య సర్వస్వం - శ్రీ బి.ఎన్.శాస్త్రి
2. బి.ఎస్.ఎన్.రెడ్డి జీవిత చరిత్ర - డా॥ కసిరెడ్డి
3. వేమన త్రిశతి - తాత్పర్య సహితం కూర్పు : డా॥ కసిరెడ్డి
4. వేమన నిత్యసత్యాలు - క్యాసెట్, వ్యాఖ్యాన సహితం - శ్రీ జి.వి.ప్రభాకర్.
5. కృషీవలుడు - తాత్పర్య సహితం - మూలం : శ్రీ దువ్వూరి రామిరెడ్డి వ్యాఖ్యానం : ప్రొ. పి. యశోదారెడ్డి
6. కాపుబిడ్డ - తాత్పర్య సహితం - మూలం : శ్రీ గంగుల శాయిరెడ్డి. వ్యాఖ్యానం : డా॥ కసిరెడ్డి
7. గోలకొండ కవుల సంచిక - శ్రీ సురవరం ప్రతాపరెడ్డి
8. కె.వి.రంగారెడ్డి గారి జీవిత చరిత్ర
9. రెడ్డికుల నిర్ణయ చంద్రిక
10. డా॥ సి.ఆర్.రెడ్డి గారి పీఠికలు - సంపాదకులు : శ్రీ భాస్కర చౌదరి
11. ముసలమ్మ మరణము - నవయామిని మూలం : శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి భావార్థ వివరణ: ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
12. శివభారతి - సాహిత్య వ్యాససంపుటి
13. పుల్లా అనంతరెడ్డి జీవిత చరిత్ర- డా॥ కసిరెడ్డి
14. నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు : శ్రీ జితేంద్ర బాబు
15. వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం



**ముద్రణలో ఉన్న గ్రంథాలు :**

16. కట్టమంచి రామలింగారెడ్డి జీవిత చరిత్ర: శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య
17. వేదార్థ ప్రక్రియలు : డా॥ వేదాలంకారో గోపాల రెడ్డి :
18. కళాతపస్వి పి.టి.రెడ్డి - డా॥ కసిరెడ్డి



విజ్ఞాన సరోవర ప్రచురణలు

**కొండా లక్ష్మీ కాంతరెడ్డి**
ప్లాటె నెం. 103, 2వ అంతస్తు
2-2-18/31/సి, సాయికృష్ణ నిలయం,
దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ,
హైద్రాబాద్ - 500 013.
ఆంధ్రప్రదేశ్ - ఇండియా, ఫోన్ : 27427920.

వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం - ఆచార్య ఎం. జయదేవ్

# వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం



ఆచార్య ఎం. జయదేవ్
తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.

ప్రచురణ కర్త : శ్రీ కొండా లక్ష్మీకాంత రెడ్డి
విజ్ఞాన సరోవర ప్రచురణలు, హైదరాబాదు

# వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం

ఆచార్య ఎం. జయదేవ్
ఎం.ఏ, పి.హెచ్.డి
తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్నం, ఆంధ్రప్రదేశ్

ప్రచురణ
కొండా లక్ష్మీకాంత రెడ్డి
విజ్ఞాన సరోవర ప్రచురణలు
దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ కాలనీ
హైదరాబాదు

వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం
ఆచార్య ఎం. జయదేవ్

మొదటి ముద్రణ: మే, 2006
విజ్ఞాన సరోవర ప్రచురణలు, సంఖ్య - 15
ప్రతులు : 1000

**వెల : రూ 100**

**ప్రతులకు:**
కొండా లక్ష్మీకాంతరెడ్డి
విజ్ఞాన సరోవర ప్రచురణలు
ఫ్లాట్ నెం. 102, రెండవ అంతస్తు
2-2-18/31/సి, సాయి కృష్ణనిలయం
దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ
హైదరాబాదు - 500013 (ఆంధ్ర ప్రదేశ్)
ఫోన్:27427920

**ముద్రణ:**
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
ఎ.పి.హెచ్.బి, విద్యానగర్, హైదరాబాదు - 44
ఫోన్, 27618261,27653348



## ముందుమాట



వేమన ప్రజాకవి, మహాకవి, సంఘసంస్కరణ కవి, వేమన పద్యాలు సార్వకాలికమైనవి, సార్వజనీనమైనవి. మన సంఘంలోని కులవ్యవస్థను, హిందూమతంలో ఉన్న అనేక మూఢ విశ్వాసాలను, మూఢాచారాలను వేమన తీవ్రంగా ఖండించాడు. వేమన ఖండించిన అప్పటి కులవ్యవస్థ, మూఢనమ్మకాలు మొదలైనవి ఇప్పటికీ మన సంఘంలో ఉన్నాయి. అందువల్ల వేమన పద్యాలు ఇప్పటికీ మనకు అవసరమే. అంతేగాకుండా వేమన సార్వకాలికమైన, సార్వజనీనమైన ఎన్నో సుభాషితాలను తన పద్యాల్లో అత్యంత సహజంగా చెప్పాడు. వేమన నాస్తికుడు కాదు. ఆస్తికుడే, అందువల్ల అతను మతాన్ని నిందించలేదు. మతం పేరుతో స్వార్థపరులు చేస్తున్న అరాచకాలను, అవినీతిని, దుర్మార్గాన్ని, నీచమైన పనులను ఎలాంటి మొగమాటం లేకుండా ఖండించాడు. కులాల కుళ్ళుతో దుర్గంధ భూయిష్టమైన హిందూమతాన్ని సంస్కరించాలన్నది ఆయన ప్రయత్నం. ప్రాచీన కాలంలో వేమన లాంటి కవులు మరికొందరు పుట్టివుంటే హిందూమతం కులవ్యవస్థ లాంటి మూఢాచారాలనుంచి కొంతైనా బైటపడి ఉండేది. మధ్యయుగాలనాడు ఎంతో హేతుబద్ధంగా ఆలోచించి ఎలాంటి జంకూ గొంకూ లేకుండా సంఘంలో ఉన్న మూఢాచారాలను, మూఢవిశ్వాసాలను గొప్పధైర్యంగా తిట్టిపోసిన సాహసకవి వేమన. అందువల్లనే ఆయనంటే నాకు అమితమైన ఇష్టం. ఆ ఇష్టంతోనే వేమన మీద ఒక పుస్తకం రాయాలని ఆలోచించాను. అయితే ఇప్పటికే వేమనను అనేక కోణాల్లో విశ్లేషిస్తూ చాల గ్రంథాలు వచ్చాయి. మళ్ళీ అదే కోణంలో రాస్తే అందులో కొత్తదనం ఏమీ ఉండదు. అందువల్ల వేమనలో ఇతరులు చెప్పని అంశాన్ని గురించి చెప్పాలని ఆలోచిస్తే వేమన స్త్రీ దృక్పథం కనిపించింది. ఈ అంశం మీద ఎవరూ పుస్తకం రాయలేదు. కానీ ఈ విషయంలో వేమన గురించి గొప్పగా చెప్పడానికి ఏమీ లేకపోగా ఆయనను విమర్శించ వలసి వచ్చింది. ఎందుకంటే వేమన స్త్రీల విషయంలో సంప్రదాయబద్ధమైన, పురుషపక్షపాతంతో కూడిన భావాలనే ప్రకటించాడు. అయినప్పటికీ పరిశోధనలో వాస్తవాలను చెప్పడం ధర్మం కాబట్టి నేను అదే విషయాన్ని చెప్పాను. అయితే నాకు అత్యంత ఇష్టమైన వేమన గురించి అతనిలోని లోపాన్ని చెప్పవలసి వచ్చినందుకు బాధ పడ్డాను. అందువల్లనే మొదటి ప్రకరణమైన

విశిష్టకవి వేమనలో వేమన గొప్పతనాన్ని వివరించాను.

వేమన గురించి పుస్తకం రాయడం చాల కష్టం. ఎందుకంటే వేమన గురించి తెలియనివారు ఆంధ్రదేశంలో ఎవరూ ఉండరు. అందరికీ తెలిసిన వ్యక్తిని గురించి అందరికీ నచ్చేలాగా గ్రంథాన్ని రాయడం ఎంత కష్టమో విజ్ఞులకు చెప్పవలసిన పనిలేదు. వేమన గురించి నాకు తెలిసిన విషయాన్ని నాదైన కోణంలో ఆలోచించి విశ్లేషించాను. ఈ గ్రంథం విజ్ఞుల ఆదరణను పొందుతుందని ఆశిస్తూ

భవదీయుడు

మద్రెబోయిన జయదేవ్



## ధన్యవాదాలు

పుస్తక రచన పెద్ద కష్టమైన పనికాదు. కానీ రాసిన పుస్తకాన్ని ముద్రించడం, ముద్రించిన పుస్తకాలను అమ్ముకోవడం మాత్రం కష్టమైన పనులే. ఈ పుస్తకానికి సంబంధించి ఈ రెండు కష్టాల నుంచి నన్ను రక్షించిన వారు హైదరాబాదు వాస్తవ్యులైన కొండా లక్ష్మీకాంత రెడ్డి గారు. వీరు " విజ్ఞాన సరోవర ప్రచురణలు" అనే పేరుతో ప్రచురణ సంస్థను స్థాపించి రెడ్డిరాజ్య సర్వస్వం, వేమన త్రిశతి, గోలకొండ కవుల సంచిక, డాక్టర్ సి.ఆర్.రెడ్డి గారి పీఠికలు మొదలైన చాల గ్రాంథాలను ప్రచురించి ఆంధ్రుల చరిత్రకు, తెలుగు సాహిత్యానికి ఎంతో సేవ చేస్తున్నారు. వీరికి వేమన పట్ల మంచి భక్తిగౌరవాలున్నాయి. వేమన జయంతి అయిన జనవరి 19 వ తేదీ నాడు టాంక్‌బండ్ మీద ఉన్న వేమన విగ్రహం దగ్గర బీదలకు అన్నదానం చేయడం, వేమన మీద ప్రసంగాలను ఏర్పాటు చేయడం మొదలైన వేమనకు సంబంధించిన కార్యక్రమాలను చేపడుతూ ఉంటారు. నేను రాసిన "వేమన వైశిష్ట్యం – స్త్రీ దృక్పథం" అనే ఈ పుస్తకాన్ని ప్రచురించవలసిందిగా లక్ష్మీకాంత రెడ్డి గారిని కోరిన వెంటనే వారు అంగీకరించి పుస్తకాన్ని అందంగా ప్రచురించారు. అందుకు వారికి నామనస్పూర్వక ధన్యవాదాలు.

జయదేవ్

# ప్రచురణ కర్త విజ్ఞప్తి



చిన్నప్పటినుంచి నాకు వేమన పద్యాల మీద మక్కువ ఎక్కువ. వేమన చిన్నచిన్న పదాల్లో గొప్ప సుభాషితాలను, సూక్తులను చెప్పడమే గాకుండా సార్వజనీనమైన, సార్వకాలికమైన విషయాలను ఎన్నింటినో తన పద్యాల్లో చెప్పాడు. వేమన మీద నాకున్న ఈ అభిమానం నాతో పాటు పెరుగుతూ వచ్చింది. రెడ్డిరాణి మొదలైన పాత పత్రికల ద్వారా వేమన జయంతి జనవరి 19 వ తేదీ అని తెలుసుకొని ఆరోజున వేమన మీద గోష్ఠులను ఏర్పాటు చేయడం, టాంక్‌బండ్ మీద ఉన్న వేమన విగ్రహానికి పూలమాలవేసి వారి హితవులను మననం చేసుకోవడమే కాకుండా ఎన్నియో కార్యక్రమాలు జరపడం బీదలకు అన్నదానం చేయడం మొదలైన కార్యక్రమాలను ఏర్పాటు చేస్తూ ఉంటాను. వీటితో పాటు వేమన మీద ఎవరు ఏ పుస్తకం రాసి ముద్రించమని కోరినా ఆ పుస్తకాన్ని ముద్రిస్తూ ఉన్నాను. అందువల్లనే జయదేవ్ గారు వచ్చి "వేమనవైశిష్ట్యం – స్త్రీ దృక్పథం" అనే ఈ పుస్తకాన్ని ముద్రించమని కోరగా ప్రచురణకు అంగీకరించాను.

ఈ పుస్తకంలో జయదేవ్ గారు వేమన విశిష్టతను మొదటి భాగంగా, అతని స్త్రీ దృక్పథాన్ని రెండవ భాగంగా చెప్పారు. మొదటి భాగమైన వేమన విశిష్టతలో జయదేవ్ గారు వేమన గొప్పతనాన్ని గురించి చక్కగా వివరించారు. కవిత్వపరంగా వేమనలో ఉన్న ప్రత్యేక లక్షణాలైన మూఢాచారాలను హాస్య యుక్తంగా ఖండించడం, సులభమైన తెలుగు పదాలను ఉపయోగించడం, అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన, ధారణకు వీలుగా ఉండడం, మంచి సుభాషితాలను చెప్పడం, లోకసామాన్య విషయాలను ఉపమలుగా చెప్పడం, వేదాంత విషయాలను సులభమైన పదాల్లో చెప్పడం, ఉల్లేఖాలంకారానికి ఉజ్వలమైన ఉదాహరణగా ఉండడం అనే వాటిని గురించి, కవిగా ఆయనలో ఉన్న ప్రజాకవి, యోగకవి, భావవిప్లవకవి, విశ్వకవి అనే విశిష్ట లక్షణాలను గురించి చక్కగా చివరించారు. రెండవ బాగంలో మొదట మన దేశంలోని స్త్రీల స్థితిగతులను గురించి వివరించిన తర్వాత వేమన స్త్రీలను గురించి చెప్పిన పద్యాలను, వేమన తల్లిని గురించి చెప్పిన పద్యాలు, పతివ్రతలను గురించి చెప్పినపద్యాలు, గయ్యాళి భార్యలను గురించి చెప్పిన పద్యాలు, విధవలను గురించి చెప్పిన పద్యాలు, వేశ్యలను గురించి చెప్పిన పద్యాలు అనే ఆరు రకాలుగా విభజించి ఒక్కొక్క విభాగాన్ని గురించి కూలంకషంగా వివరించారు. ఈ



విభాగాల్లో వేమన స్త్రీల గురించి సంప్రదాయపరమైన, పురుషపక్షపాతంతో కూడుకున్న భావాలను, నిందాపూర్వకమైన భావాలను ప్రకటించాడని జయదేవ్ గారు వేమన పద్యాలను ఉదహరిస్తూ చెప్పారు. వేమనగారి దృష్టిలో స్త్రీదృక్పథం అనే భావన ఎంతవరకు సమంజసం అనే విషయానికి వచ్చినట్లైతే వారి పద్యాలు ఏవి వారి స్వంతము అనే విషయం చాలా ముఖ్యమైనది. పోగా ఎందరో కవులు, పరిశోధకులు వారిది స్త్రీవ్యతిరేక దృక్పథమని ఇందులో తెలిపిన విధముగా ఎవరు విమర్శి చెప్పలేదు. శ్రీ గోపి గారు కూడా వేమన స్త్రీ పట్ల చూపిన దృక్పథం గౌరవపదంగానే తెలియజేసారు. ఐతే వారు తెలియపరచిన పద్యాలు అన్ని వేమన వ్రాసినవేయంటూ కూడా చెప్పడం జరిగింది. ఏదిఎట్లున్న ప్రొ॥ జయదేవ్‌గారు జరిపిన పరిశోధన ఎంతవరకు పాఠకుల సరి ఎదురుభావాలకు నిలుస్తుందో వేచి చూడాలి. రచయిత భావాలతో ఏకీభవించనప్పటికీ ఈ పరిశీలన పాఠకులకు అందజేయాలనే సదుద్దేశంతో ప్రచురణ చేయుటకు అంగీకరించనైనది. చివరి ప్రకరణంలో వేమన స్త్రీనింద చేయడానికి గల కారణాన్ని గురించి యోగులైన వారు స్త్రీనింద చేయడం సిద్ధాంతపరమైనదని, యోగి కావడం వల్లనే వేమన స్త్రీనింద చేశాడని వివరించారు. వేమన పద్యాలను బట్టి ఆయనను అనేక కోణాల్లో అనేకులు విశ్లేషించారు. అయితే ఆయన స్త్రీ దృక్పథాన్ని గురించి వివరించిన గ్రంథం ఇంతవరకూ రాలేదు. ఆలోటును తీర్చిన ఈ పుస్తకం సహృదయుల మన్ననలను పొందుతుందని ఆశిస్తూ...

కొండా లక్ష్మీకాంత రెడ్డి
విజ్ఞానసరోవర ప్రచురణలు



సేవాతత్పరులు డా॥ కొండా లక్ష్మారెడ్డి

డా॥ కొండా లక్ష్మారెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పూర్వఉపముఖ్యమంత్రి శ్రీ కె.వి. రంగారెడ్డి, తుంగభద్రమ్మల పుత్రులు. వారు 1937 మే, 19వ తేదీన నల్లగొండ జిల్లా ఆలేరు మండలంలోని శారాజిపేటలో జన్మించారు. శ్రీరెడ్డిగారు శ్రమయే దైవంగా నమ్మి పరిశ్రమించేవారు. వారు కాకినాడ రంగనాయక మెడికల్ కళాశాలలో ఎం.బి.బి.ఎస్. పూర్తి చేశారు. మెడిసిన్ పూర్తి చేసిన తర్వాత కొన్నాళ్లు కాకతీయ మెడికల్ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేశారు. 1978 లో ఫ్యామిలీ ప్రాక్టీసు అంశంపై యుఎస్ఎ లో ఎం.డి చేశారు. ఆ తరువాత యు.కె.లోనూ, కెనడాలోనూ వైద్య సేవలందించారు. తరువాత అమెరికాలో కొంతకాలం గ్రామీణ ప్రాంతంలోని ప్రజలకు మినసోటా గ్రామ సమీపంలో ప్రాక్టీసు ప్రారంభించి ఉత్తమ సేవలందించారు. భారతదేశానికి వచ్చినప్పుడు ఇక్కడి ప్రజలకి వైద్య సేవలందిస్తున్నారు.

కీ.శే. డా॥ సుభాషిణి వీరి ధర్మపత్ని. విజ్ఞానసరోవర ప్రచురణల మాధ్యంగా ప్రతి సం॥ శ్రీమతి సుభాషిణిగారి సంస్మరణార్థం నిరుపేద విద్యార్థినీ విద్యార్థులకు ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. విజ్ఞానసరోవర ప్రచురణలకు వారి ఉదారసహాయం అందుతూనే ఉంది. ఈ ప్రచురణల ద్వారా ప్రజల్లోకి వినూత్న విషయాలు వెళ్లాలనే వారి ఆలోచనకు క్రియాశీలరూపంగా ఈ గ్రంథాలు వస్తున్నాయి. రెడ్డిరాజ్య సర్వస్వం నుండి గోలకొండ కవుల సంచిక వరకు, కె.వి. రంగారెడ్డి స్వీయచరిత్ర, ఈ ప్రచురణ వరకు కూడా వారి సహకారం అందుతూనే ఉంది.

వైద్య సేవలందిస్తూనే వారు అరవిందుల తాత్త్విక దర్శనాన్ని లోతుగా గ్రహించిన మేధావులు. భౌతిక చికిత్సతోపాటు మానవుని ఆధ్యాత్మికాంశాల ద్వారా మానసిక చికిత్స అవసరం అని భావించే సంస్కారవేత్త శ్రీ కొండా లక్ష్మారెడ్డిగారు.







డా॥ ఎ. మహేందర్‌రెడ్డి

అమెరికాలో ఉన్నా, ఆంధ్రాలోఉన్నా తమ జీవితం సేవకు, సాహిత్య, ధార్మిక సంస్కార భావాల వికాసానికి దోహదం చేసే వారెందరో ఉన్నారు. అటువంటి వారిలో డా॥ ఎ. మహేందర్‌రెడ్డి గారొకరు.

వారు వరంగల్లు జిల్లాలోని రేగొండ గ్రామంలో జన్మించారు. వరంగల్లులోని కాకతీయ మెడికల్ కళాశాలలో ఎం.బి.బి.ఎస్ పూర్తిచేశారు. 1967లో అమెరికా వెళ్లారు. అక్కడ వైద్యులుగా నిలదొక్కుకున్నారు. హృద్రోగ నిపుణులుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. పిల్లల వైద్య నిపుణులుగా కూడా ఉత్తమ సేవలందించి పేరు గడించారు.

అమెరికన్ అకాడమీ వీరిని పీడియాట్రిక్స్ స్పెషలిస్టుగా గుర్తించింది. అంతేగాక ఇంటర్నేషనల్ కార్డియాలజిస్టుగా గుర్తింపు పొందారు. అంతేగాక డా॥ రెడ్డి అమెరికన్ అకాడమీ ఆఫ్ పీడియాట్రిక్ సభ్యులు; రాయల్ కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్ ఫ్రం కెనడా, అమెరికన్ కాలేజ్ ఆఫ్ కార్డియాలజీ, కాలేజ్ ఆఫ్ బెస్ట్ ఫిజీషియన్స్‌లోనూ వారు సభ్యులు, వారి అపూర్వ సేవ కారణంగా ఇటువంటి గుర్తింపులెన్నో వారికి లభించాయి.

బర్మింగ్‌హామ్‌లోని హిందూ దేవాలయ సాంస్కృతిక కేంద్ర నిర్మాణంలో వారు చురుకుగా పనిచేశారు. దానికి అధ్యక్షులయ్యారు. 1999 నుండి ట్రస్టు బోర్డులో సభ్యులుగా ఉన్నారు. భారతీయ సాంస్కృతిక వారసత్వ ప్రచారానికిగాను ఏబదివేల డాలర్లను (దాదాపు రూ. 20లక్షలను) విరాళంగా ఇచ్చారు. అమెరికాలోని రెడ్డి జనసంఘంలో వారు శాశ్వత సభ్యులు. నిరుపేద విద్యార్థులకు ఉపకార వేతనాలకుగాను వారు విజ్ఞానసరోవర ప్రచురణలకు విరాళాలందిస్తున్నారు. ఇంకా ఎన్నో సంస్థలు వారి సహాయ సహకారాలందుకున్నాయి. ఆ సంస్థలు సమాజానికి ఉత్తమ సేవలందిస్తున్నాయి.

విజ్ఞానసరోవర ప్రచురణలను ఈ విధంగా ప్రోత్సహిస్తున్న, ఆదరిస్తున్న డా॥ఎ. మహేందర్‌రెడ్డిగారికి అభినందన పూర్వక ధన్యవాదాలు. విద్యార్థుల వికాసానికి, ప్రచురణల ద్వారా విజ్ఞాన ప్రచారానికి దోహదం చేస్తున్న అందరికీ అభినందనలు.

# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



డా॥ బూసా అమరేందర్‌రెడ్డి
(శ్రీ కె.వి.రంగారెడ్డిగారి దౌహిత్రులు)

అమర్ హాస్పిటల్స్ వ్యవస్థాపకులు డా॥ బి.వెంకటరెడ్డి, డా॥ బి.సుమిత్రగార్ల సుపుత్రులు డా॥ బి.అమరేందర్‌రెడ్డిగారు. ప్రస్తుతం వారు అమెరికాలో హృద్రోగ నిపుణులుగా ప్రజలకు అపూర్వ సేవలందిస్తున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం గాంధీ మెడికల్ కళాశాలలో వారు ఎం.బి.బి.ఎస్. పూర్తిచేశారు. ఆ కళాశాలలో ఎం.డి. చేసిన వారిలో ప్రప్రథములు. అమెరికాలో కూడా వారు జనరల్ మెడిసన్ పూర్తిచేశారు. ఆ తరవాత హృద్రోగ సంబంధి అధ్యయనం చేసి అపూర్వ విజ్ఞానాన్ని ఆర్జించారు. అమెరికాలో ఉత్తర కెరలినలో హృద్రోగ సంబంధి ఆసుపత్రి ప్రారంభించి ఎందరికో సేవలందించి డాక్టరు రెడ్డి కీర్తి ప్రతిష్ఠలార్జించారు. వారు అమెరికన్ కాలేజ్ ఆఫ్ కార్డియాలజీ సభ్యులు. అంతేకాక ఆ విభాగంలోనే ఒక శాఖకు వారు అధ్యక్షులుగా ఉన్నారు. నార్త్ కెరలిన మెడికల్ కేంద్రంలో వారు ప్రొఫెసర్‌గా కూడా సేవలందిస్తున్నారు.

వీరి వైద్యసేవలందుకున్న వారిలో డా॥అక్కినేని నాగేశ్వరరావుగారు, మాన్యశ్రీ రాజా రామేశ్వరరావుగారున్నారు. అనూచానంగా వస్తోన్న వైద్య కుటుంబానికి చెందిన వారైనందువల్ల ఈ వృత్తి విషయంలో వారు పరమ పవిత్రంగా వ్యవహరిస్తోన్న కీర్తి ఉంది. ప్రతి సంవత్సరం ఉపకార వేతనాలు పేద విద్యార్థులకు ఇవ్వడంలో విజ్ఞాన సరోవర ప్రచురణలకు డా॥రెడ్డి ఆర్థిక సహాయం అందిస్తున్నారు. **డాక్టర్ రెడ్డి, వారి తల్లిదండ్రుల పేరిట కె.వి. రంగారెడ్డి స్వీయచరిత్ర గ్రంథ ప్రచురణకు సహకరించారు.** వారి సహకారం కారణంగానే ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహించే అవకాశం విజ్ఞాన సరోవర ప్రచురణ సంస్థ చేయగలుగుతున్నది. అమెరికాలో ఉన్నా తమ కన్నతల్లి నేలలో ఈ సేవాకార్యక్రమాలు కొనసాగాలని ఆశించే వారికి మా ప్రచురణ సంస్థ ధన్యవాదాలు తెలుపుకొంటున్నది.



# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



కీ.శే. డా॥ సి. మల్లికార్జున్

డా॥ మల్లికార్జున్‌గారు సుబుద్ధి కిషన్‌గారి కుమారులు. విద్యార్థి దశనుండే విద్యార్థి సంఘాల పట్ల చాలా మక్కువ చూపించెడి వారు. వీరు ఉస్మానియా మెడికల్ కాలేజీలో చదువుతుండగా స్టూడెంట్స్ యూనియన్ నాయకునిగా ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ప్రారంభించారు. నాటి ప్రజానీకంలో వీరి గురించి తెలియని వారు ఉండరు.

వీరు మొట్టమొదటిసారిగా 1971లో, ఆ తదుపరి 1977లో పార్లమెంటు నియోజక వర్గము నుండి పార్లమెంటు సభ్యులుగా ఎన్నికైనారు. 1980లో స్వచ్ఛందంగా రాజీనామా చేసి శ్రీమతి ఇందిరాగాంధీ గారిని అక్కడి నుండి గెలిపించడమే కాకుండా వారు అప్పుడు మహబూబ్‌నగర్ పార్లమెంటరీ నియోజక వర్గము నుండి పోటీ చేసి అతిపెద్ద మెజారిటీతో గెలిచారు. ఆ తదుపరి వారు మొదటిసారిగా ఇందిరాగాంధీ మంత్రివర్గంలో డిప్యూటీ రైల్వే మంత్రిగానూ, 1991లో స్టేట్ రైల్వే మంత్రిగానూ, సమాచార ప్రసారాల శాఖ మంత్రిగానూ, పార్లమెంటరీ వ్యవహారాల మంత్రిగాను, పలు ఇతర శాఖల మంత్రిగానూ బాధ్యతలు నిర్వహించారు. ఆ తదుపరి 1993లో రక్షారాజ్య మంత్రిగా పనిచేశారు. వీరు మంత్రిగా ఎన్నో దేశాలు పర్యటించారు. పలు అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొన్నారు. కాగా అంతర్జాతీయ రక్షణ సదస్సుల్లో కూడా పాల్గొన్నారు. వీరు ఇందిరాగాంధీ, పి.వి.నరసింహారావు గార్ల మంత్రివర్గంలో కూడా పనిచేశారు.

వీరు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులుగా పదవీ బాధ్యతలను నిర్వహించారు. వీరు ఎన్నో సేవాకార్యక్రమాలు గావించి ఇటు తన నియోజకవర్గమైన మెదక్, మహబూబ్‌నగర్ ప్రజల అభివృద్ధికే గాక కేంద్రమంత్రిగా దేశ ప్రజలకు కూడా వారి సేవలను అందించారు.

మేం పూర్వం ప్రచురించిన గోలకొండ కవుల సంచికకు మరియు ప్రతి సంవత్సరం మా సంస్థ నిరుపేద విద్యార్థులకు ఉపకారవేతనములకు ఇచ్చే డబ్బు వచ్చే విధముగా సహకరించినందులకు మా విజ్ఞాన సరోవర ప్రచురణల సంస్థ ధన్యవాదాలు తెలుపుతున్నది. భగవంతుడు వారి ఆత్మకు శాంతి కలిగించాలని ప్రార్థిస్తున్నాం.

## వదాన్యురాలు - దాన సేవాధర్మపరాయణురాలు
## డా॥ పి. మహాలక్ష్మి గారు



2006 వ సం॥ నుండి ఆంధ్రప్రదేశ్ రెడ్డి జన సంఘం అధ్యక్షురాలుగా ఉండి విశేష సేవలందిస్తున్న డా॥ పి. మహాలక్ష్మిగారు బహుముఖ ప్రజ్ఞాశీల.

కర్నూలు జిల్లా నంద్యాల వాస్తవ్యులు శ్రీమతి పోలా రామ సుబ్బమ్మ, రామ కృష్ణారెడ్డి గారల పుత్రిక డా॥ పి. మహాలక్ష్మిగారు. బాల్యం నుండి అన్ని పరీక్షల్లో ఉత్తమోత్తమ స్థానంలో విజయాలు సాధించారు. ఆ కారణంగా అభిరుచితో వైద్య విద్యలో ప్రవేశించి సుప్రసిద్ధ గైనకాలజిస్టుగా పేరు ప్రఖ్యాతులార్జించారు. వైద్య విద్యలో ఎం.బి.బి.ఎస్; ఎం.డి; డి.జి.ఒ పూర్తి చేసి విశేష సేవలందించిన కారణంగా వారి వల్ల వైద్య పరంగా సేవలందుకొన్నవారు వారిని ప్రశంసిస్తుంటారు.

డా॥ పి. మహాలక్ష్మి గార్రు ఆంధ్ర ప్రదేశ్ వైద్య విధాన పరిషత్తుకు కమిషనర్ పదవీ బాధ్యతలు నిర్వహించి, పాలనా రంగానికి, ప్రజాసేవారంగానికి విశిష్ట సేవలందించి పదవీ విరమణ చేశారు. పూర్వం భారత ప్రధానమంత్రికి వారు వైద్యులుగా నియమింప బడి కీర్తి గడించారు. హైదరాబాదులో వారు వివిధ పదవులు నిర్వహించారు.

వైద్య విద్యకు అడిషనల్ డైరక్టర్‌గాను వివిధ ఆస్పత్రులకు సూపరింటెండెంటుగాను పనిచేసి పలువురి మన్ననలందుకొన్నారు. ఉస్మానియా మెడికల్ కళాశాలలో గైనకాలజీ తదితర అంశాలకు ప్రొఫెసర్‌గా, ఆంధ్రప్రదేశ్ వైద్య విధాన పరిషత్ గవర్నింగ్ కౌన్సిల్ సభ్యులుగా, తిరుపతిలోని సిమ్స్ సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి సలహా మండలిలో సభ్యులుగా, స్విమ్స్ గవర్నింగ్ కౌన్సిల్‌కు సభ్యులుగా, కేంద్రీయ ఫిలిం సెన్సారు బోర్డు సభ్యులుగా, జనాభా అధ్యయన కేంద్ర సమితికి సలహాదారులుగా, ఉస్మానియా విశ్వవిద్యాలయం జెనెటిక్స్ విభాగంలోని గవర్నింగ్ సలహా మండలి సభ్యులుగా, దాదాపు ఏడు సం॥లు రాజబహదురు వెంకట రామారెడ్డి మహిళా కళాశాల వసతి గృహానికి కార్యవర్గ సభ్యురాలిగా, ఆంధ్రప్రదేశ్ రెడ్డి జన సంఘానికి ఐదు సం॥లు ఉపాధ్యక్షులుగా, అంతేగాక ఎన్‌టిఆర్ ఆరోగ్య విశ్వ విద్యాలయ సలహా మండలి సభ్యులుగా డా॥ పి. మహాలక్ష్మి గారు వ్యవహరించారు.

ఈ విధంగా వివిధ రంగాలకు ఉదారంగా క్రియాశీల చైతన్యంగా తమ సేవలందించిన మహిళా శిరోమణి డా॥ పి. మహాలక్ష్మి గారి అధ్యక్ష నేతృత్వంలో రెడ్డి జన సంఘం అనేక సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. భారతదేశ మహిళల్లో, అందులోనూ తెలుగునాట అగ్రశ్రేణిలో నిలిచే మహిళా శిరోభూషణం డా॥ పి. మహాలక్ష్మిగారు ఎవరికైనా స్ఫూర్తినందించే స్థితిలో ఉన్నారు. తాము ముందుకు నడుస్తూ పదిమందికి మార్గదర్శకంగా నిలిచి నడిపిస్తున్నారు. అదేవిధంగా మా విజ్ఞాన సరోవర ప్రచురణల నిమిత్తం డా॥ పి. మహాలక్ష్మి గారు భూరి విరాళ మందించి, ఎన్నో సాహిత్య గ్రంథాల ప్రచురణకు దోహదం చేశారు. చారిత్రక - సాంస్కృతిక - ధార్మిక గ్రంథాలను ఇవాళ అందరికీ విజ్ఞాన సరోవర ప్రచురణల పేరిట అందించడానికి వారు మూలకందంగా నిలిచారు. ఇలా వారెన్నో గుప్తదానాలు చేశారు.



# రచయిత గురించి

పేరు - మర్రెబోయిన జయదేవ్

తల్లిదండ్రులు - వెంకటమ్మ, పుల్లన్న గార్లు

పుట్టిన తేదీ - తెలియదు, పదవ తరగతి సర్టిఫికెట్ ప్రకారం 14 - 6-1956

స్వంత ఊరు - చాకరాజు వేముల గ్రామం, దొర్నిపాడు మండలం, కర్నూలు జిల్లా

విద్యాభ్యాసం - 1 నుంచి 5వ తరగతి వరకు ఇటిక్యాల గ్రామం, 6వ తరగతి- కొలిమిగుండ్ల, 7వ తరగతి నుంచి 10వ తరగతి వరకు దొర్నిపాడు, ఇంటర్మీడియట్ - ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా, బి.ఎ - నరసారావు పేట, ఎస్.ఎస్.ఎన్. కళాశాల, గుంటూరు జిల్లా, ఎం.ఏ, పిహెచ్.డి. - ఆంధ్రవిశ్వవిద్యాలయం, విశాఖపట్నం

డిప్లొమాలు - డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్, డిప్లొమా ఇన్ ట్రాన్స్‌లేషన్, ఆంధ్రవిశ్వవిద్యాలయం

ఉద్యోగం - 1984 నుంచి 1990 వరకు గుడివాడ, ఏ.ఎన్.ఆర్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగా, 1990 నుంచి 1998 వరకు ఆంధ్రవిశ్వవిద్యాలయం, విశాఖపట్నంలో రీడరుగా, 1998 నుంచి ప్రొఫెసర్‌గా, 1996 నుంచి 1999 వరకు తెలుగు శాఖాధ్యక్షులుగా, 2004 నుంచి తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్ చైర్మన్‌గా,

ముద్రిత గ్రంథాలు - 1. దుర్భాక రాజశేఖర శతావధాని చారిత్రక కావ్యాలు, 2. సింహాచలం దేవళం కట్టుబడి కథాగేయం 3. వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం

ముద్రిత పరిశోధనా పత్రాలు - 30

అముద్రిత గ్రంథాలు - 1. దశావతార కథాగేయాలు - మూడు భాగాలు 2. యాదవుల జానపద కళలు

ఇష్టమైన అంశాలు - జానపద సాహిత్యం, వేమన పద్యాలు, సామాజిక స్పృహ ఉన్న రచనలు

# విషయసూచిక


| | పుటలు |
|---|---|
| 1. వేమన విశిష్టత | 1 - 57 |
| 2. స్త్రీల స్థితిగతులు | 58 - 60 |
| 3. తల్లిని గురించి వేమన చెప్పిన పద్యాలు | 61 - 65 |
| 4. పతివ్రతలను గురించి వేమన చెప్పిన పద్యాలు | 66 - 68 |
| 5. గయ్యాళి భార్యలను గురించి వేమన చెప్పిన పద్యాలు | 69 - 77 |
| 6. విధవలను గురించి వేమన చెప్పిన పద్యాలు | 78 - 80 |
| 7. వేశ్యలను గురించి వేమన చెప్పిన పద్యాలు | 81 - 91 |
| 8. స్త్రీజాతిమొత్తాన్ని గురించి వేమన చెప్పిన పద్యాలు | 92 - 111 |
| 9. వేమన చేసిన స్త్రీ నిందకు కారణం | 112 - 128 |




# వేమన విశిష్టత

వేమన మహాకవి. గొప్పప్రజాకవి. తెలుగు సాహిత్యంలో ఇతని లాగా సామాన్య ప్రజలకు చేరువైన కవి ఇంకొకరు లేరు. వేమన పద్యాలు వినని తెలుగు వారు ఉండరు అని చెప్పడం అతిశయోక్తి కాదు. ఆంధ్రదేశంలో చాల మందికి వేమన పద్యాలు కనీసం ఒకటి రెండైనా వస్తాయి. దీనికి కారణం వేమన పద్యాల్లోని భాష, భావంతో పాటు విషయం కూడా. వేమన పద్యాల్లోని భాష స్వచ్ఛమైనది, సహజమైనది, సులభమైనది, వాడి ఐనది. మంచి సామెతలను, చక్కని జాతీయాలను, సూక్తులను, నీతులను, సుభాషితాలను వేమన తన పద్యాల్లో అత్యంత సహజంగా చెప్పాడు. అతని పద్యాల్లో క్లిష్టమైన పదాలు, అర్థం కాని పదాలు దాదాపుగా ఉండవు. వేమన ఉపమానాలు, పోలికలు, సహజంగా, కొత్తగా, ఔచిత్యవంతంగా ఉంటాయి. అతని భావాలు పుష్టివంతంగా, సరికొత్తగా, గంభీరంగా ఉంటాయి. వేమన పద్యాల్లోని విషయం ఎక్కడో పైలోకాలనుంచి గానీ, పురాణాల నుంచి గానీ తెచ్చినది కాదు. అది ప్రజలకు సుపరిచితమైనది. పురాణాలు, ధర్మశాస్త్రాలు మొదలైన హిందూమత గ్రంథాల్లోని అనవసర కర్మకాండను, వర్ణవ్యవస్థను, కులవ్యవస్థను, బ్రాహ్మణకులాధిక్యాన్ని, ప్రజల్లో ఉన్న మూఢాచారాలను, మూఢ నమ్మకాలను, అన్ని మతాల్లోని మోసాలను, దంబాచారాలను, మత పెద్దల దుర్మార్గాలను, దొంగగురువులను, విగ్రహారాధనను, పురోహితుల ముహూర్తాలను, శైవ వైష్ణవుల మతకలహాలు మొదలైన వాటిని ఎన్నింటినో వేమన తన పద్యాల్లో తిట్టాడు. సామాన్య ప్రజల బాగు కోసం, వారి సంక్షేమం కోసం కవిత్వం చెప్పినవాడు వేమన. జానపదుల్లో జానపద సాహిత్యానికి ఎంత ప్రసిద్ధి ప్రచారం ఉన్నాయో వేమనకు గూడా అంత ప్రసిద్ధి ప్రచారం ఉన్నాయి. అంతే గాదు వేమనకు జానపద సాహిత్యానికి దగ్గరి పోలిక కూడా ఉంది. "వాఙ్మయం జాతి జీవన ప్రతిబింబం" అని శిష్టసాహిత్యాన్ని గురించి ఒక ఆర్యోక్తి ఉంది. ఈ ఆర్యోక్తి జానపద సాహిత్యానికి నూటికి నూరు పాళ్ళు వర్తిస్తుంది. శిష్టసాహిత్యంలో వేమనకు మాత్రమే ఇది వర్తిస్తుంది. వేమన బ్రాహ్మణులను, హిందూమతాచారాలను, కర్మకాండను, కులవ్యవస్థను విమర్శించాడన్న కోపంతో ఆయన

పద్యాలను చదవడం, వినడం మహాపచారంగా భావించి బ్రాహ్మణులు ఆయనను వెలివేశారు. పాశ్చాత్యులైన అబేదుదాయ్, సి.పి. బ్రౌన్, జి.యు.పోప్, ఆర్.యం. మాక్డోనాల్డ్ మొదలైన వారు వేమన పద్యాలను సేకరించి, వాటిని విశ్లేషిస్తూ గ్రంథాలను రాసిన తర్వాత మన వారు వేమన గొప్పతనాన్ని గుర్తించి వేమన మీద పరిశోధన చేయడం ప్రారంభించారు. మన పండితులు వేమనను వెలి వేసినట్లుగానే జానపద సాహిత్యాన్ని గూడా వెలి వేశారు. జానపదగేయాలు, కథాగేయాలు, పొడుపుకథలు, అనేక రకాల వచనకథలు మొదలైన జానపద ప్రక్రియలను మన పండితులు అవి అనాగరికుల సాహిత్యంగా, పిచ్చిసాహిత్యంగా భావించి వాటిని వెలి వేశారు. సి.పి.బ్రౌన్, జే.ఏ. బోయిల్ మొదలైన ఆంగ్లేయులు మన జానపద సాహిత్యం యొక్క గొప్పతనాన్ని, మాధుర్యాన్ని గుర్తించి దాన్ని సేకరించి, విశ్లేషిస్తూ వ్యాసాలు రాసిన తర్వాత మన పండితులు గూడా దాని మీద దృష్టి పెట్టారు. మన పండితులు జానపద సాహిత్యాన్ని, వేమనను వెలి వేసినప్పటికీ సామాన్య ప్రజలు మాత్రం జానపద సాహిత్యాన్ని, వేమనను ఎంతగానో ఆదరించారు.

తెలుగు సాహిత్యంలో వేమనది అనితరసాధ్యమైన మార్గం. అతనితో సాటి వచ్చే కవి తెలుగులో మరొకరు లేరు. అనేక విషయాల్లో వేమనకు వేమనే సాటి. తెలుగు సాహిత్యంలో వేమన గొప్ప విశిష్టమైన కవి. మిగిలిన కవుల లాగా ఆయన పురాణాల్లోని ఇతివృత్తాలను తీసుకొని గానీ , కల్పిత కథలను తీసుకొని గానీ కావ్యాలను రచింపలేదు. అంతేగాకుండా పెద్దన కోరినట్లుగా "రమణి ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెము" మొదలైన అనేక సౌకర్యాలు మధ్య కవిత్వం చెప్పిన వాడు కాదు. అసలు వేమన ఒక చోట తిన్నగా కూర్చొని కవిత్వం చెప్పలేదు. దేశాటన చేస్తూ లోకంలో తనకు కనిపించిన చెడ్డను ఎత్తి చూపిస్తూ, మంచిని ప్రశంసిస్తూ ఆశువుగా పద్యాలను చెబుతూ ప్రజలను చైతన్యవంతులను చేస్తూ వెళ్ళాడు. ఆయన వెనుక ఉన్న ఆయన శిష్యులు ఆయన చెప్పిన పద్యాలను వెంటనే గానీ లేక ఆతర్వాత గానీ వాటిని లిఖించారు. ఆవిధంగా ఆయన చెప్పిన పద్యాలు ఒక్కొక్కటి మహాకావ్యం లాగా ప్రజల్లో గౌరవింప బడుతూ ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో ఇలాగా కవిత్వం చెప్పిన వాడు, ప్రజల మన్నన పొందిన వాడు



మరొకరు లేరు. అతడు గొప్ప విశిష్టమైన కవి. వేమన కొన్ని ప్రత్యేకమైన లక్షణాలతో విశిష్టమైన కవిగా వెలుగొందుతున్నాడు. వాటిలో వేమన కవిత్వానికి సంబంధించినవి కొన్ని, కవిగా వేమనకు సంబంధించినవి కొన్ని ఉన్నాయి. కవిత్వ పరంగా ఆయనలో మూఢాచారాలను హాస్య యుక్తంగా ఖండించడం, సులభమైన తెలుగు పదాలను ఉపయోగించడం, అల్పాక్ష రాల్లో అనల్పార్థ రచన, ధారణకు వీలుగా ఉండడం, మంచి సుభాషితాలను చెప్పడం, లోకసామాన్య విషయాలను ఉపమలుగా చెప్పడం, వేదాంత విషయాలను సులభమైన పదాల్లో చెప్పడం, ఉల్లేఖాలంకారానికి ఉజ్వలమైన ఉదాహరణగా ఉండడం – అనే విశిష్ట లక్షణాలున్నాయి. కవిగా ఆయనలో ప్రజాకవి, ధీరకవి, యోగకవి, భావవిప్లవకవి, విశ్వకవి అనే ప్రత్యేక లక్షణాలున్నాయి.

మూఢాచారాలను హాస్య యుక్తంగా ఖండించడం :-

వేమన తన పద్యాల్లో తన కాలంలో ఉన్న మూఢాచారాలను, మూఢనమ్మకాలను తీవ్రంగా ఖండించాడు. వీటిని ఖండించేటప్పుడు వేమన ఎలాంటి జంకూగొంకూ లేకుండా నిర్భయంగా తీవ్రమైన పదాలతో, ఆమూఢాచారాలను పాటించే వారి హృదయాల్లో తన మాటలు గుచ్చుకునే లాగా తిట్టాడు. అంతేగాకుండా ఈతిట్టుల్లో చక్కటి హేళనతో కూడిన హాస్యం కూడా ఉంటుంది. హేళనకు గురి అయిన వాడు గూడా అతడు సహృదయుడైతే మనసారా నవ్వుకుంటాడు. ఈవిధంగా హేళనకు గురి అయిన వాడు గూడా నవ్వుకునేలాగా కవిత్వం చెప్పడం వేమనకు మాత్రమే సాధ్యం. ఇది వేమనలో ఉన్న ఒక విశిష్ట లక్షణం.

హిందువుల్లో దాదాపు నూటికి తొంబై శాతానికి పైగా బ్రాహ్మణులతో సుముహూర్తం ఏర్పాటు చేసుకొని ఆముహూర్త సమయంలోనే పెళ్ళిళ్ళు చేయడం అనాదిగా వస్తున్న ఆచారం. సుముహూర్తంలో వివాహం జరిగితే దంపతులిద్దరి వైవాహిక జీవితం బాగుంటుందనే నమ్మకంతో ఇలా ముహూర్తాలను ఏర్పాటు చేస్తారు. సుముహూర్తానికి బలమే ఉంటే ఆ సుముహూర్తంలో దంపతులైన భార్యాభర్తలిద్దరూ పది కాలాల పాటు పిల్లాపాపలతో చల్లగా వర్ధిల్లాలి. కాని అందరి విషయంలో అలా జరగడం లేదు.

సుముహూర్తంలో పెళ్ళి చేసుకున్న భార్యాభర్తల్లో కొంత మంది భర్తలకు భార్యలు చనిపోవడం, కొంత మంది భార్యలకు భర్తలు చనిపోవడం జరుగుతూ వుంది. మరికొందరు భార్యాభర్తలు విడిపోయి వేరే పెళ్ళి చేసుకుంటున్నారు. మరి అలాంటప్పుడు ముహూర్తానికి బలం లేనట్లే కదా. ముహూర్తాలు నిర్ణయించడం వ్యర్థమే కదా. మూఢ నమ్మకమే కదా. ఈమూఢ నమ్మకాన్నే వేమన చిన్నచిన్న మాటలతో ఎంతో చక్కగా, అందంగా

విప్రులెల్ల జేరి వెర్రి కూతలు కూసి
సతిపతులను గూర్చ సమ్మతమున
ముసు ముహూర్త ముంచ ముండెట్లు మోసెరా
విశ్వదాభిరామ వినురవేమ

అని గేలి చేశాడు. ఈహేళనలో చక్కటి హాస్యం ఉంది. ఈహేళన ముహూర్తాల మీద నమ్మకమున్న అందరికీ వర్తిస్తుంది. ఐతే సహృదయులైన వారు ఎంత బాగా గేలి చేశాడురా అని వేమనను మెచ్చుకుంటారు. ఐతే ఇలాంటి వారు వేమన గేలి చేశాడు కదా అని ముహూర్తాల మీద తమకు ఉన్న నమ్మకాన్ని వదలుకోక పోవచ్చు. అది వేరే విషయం. మూఢనమ్మకాలు మన రక్తంలోని ప్రతి అణువులో జీర్ణించుకొనిపోయి హేతువుకు తావు లేకుండా చేస్తున్నాయి. అంతేగాకుండా మనలో చాల మంది ఈ ఆచారాల్లో వాస్తవం ఎంతవరకు ఉన్నది అని ఆలోచించకుండా పురాతన కాలం నుంచి పరంపరగా వస్తున్న ఆచారాలను కాదనడం ఎందుకులే అనే భావంతో కూడా వాటిని పాటిస్తున్నారు. అందువల్ల మనం అంత తొందరగా ఈమూఢాచారాల నుంచి బైట పడలేం.

చనిపోయిన పితరులకు పిండాలను పెట్టే ఆచారం కూడా ఇలాంటి మూఢనమ్మకమే. హిందువుల్లో కొన్ని కులాలవారు చనిపోయిన పితృపితామహులకు పిండాలు పెట్టే ఆచారాన్ని పాటిస్తారు. ఈ ఆచారాన్ని పాటించే వారు తండ్రి చనిపోయిన రోజున అన్నపు ముద్దలను కాకులకు ఆహారంగా పెడుతూ వుంటారు. ఆ అన్నపు ముద్దలను కాకులు తింటే చనిపోయిన తండ్రి ఆత్మ శాంతిస్తుంది అని వీరి నమ్మకం.



అంటే కాకులను చనిపోయిన పితరులుగా భావించడం జరుగుతూవుంది. కాకి పెంట తింటుంది. మరి పెంట తినే కాకి పితరుడు ఎట్లా అవుతాడు అని వేమన ప్రశ్నించడమే గాకుండా అలా పిండాలు పెట్టే వారిని గాడిదలు అని కింది పద్యంలో తిట్టాడు.

పిండములను జేసి పితరుల తలపోసి
కాకులకు పెట్టు గాడ్దెలారా
పెంట దినెడి కాకి పితరుడెట్లాయరా , విశ్వ

ఈతిట్టును గూడా సహృదయులైన వారు మెచ్చుకుంటారు. ఈపద్యంలో చక్కటి హేళనతో కూడిన హాస్యం ఉంది.

కొంత మంది ప్రజలు ముక్తి మార్గాన్ని ఉపదేశించే గురువుల కోసం కొండ గుహల్లో వెదుకుతూ ఉంటారు. అలాంటి వారిని వేమన ఎంతో చక్కగా కింది పద్యంలో హేళన చేశాడు.

గుహలలోన జొచ్చి గురువుల వెదకంగ
గ్రూర ముకండు తారసిలిన
ముక్తి మార్గమదియె ముందుగా జూపురా , విశ్వ

గురువుల కోసం కొండ గుహల్లో వెదికే సమయంలో అక్కడ నివసిస్తున్న క్రూరమృగం ఎదురైతే ముక్తి కోసం వెళ్ళిన వారిని అది చంపి తింటుంది. ఎంతో శ్రమించి గురువులను వెదికి పట్టుకొని, వారి ఉపదేశాన్ని పొంది, ఆఉపదేశాన్ని జీర్ణం చేసుకొని, దాని ప్రకారం ప్రవర్తించి ఆతర్వాత ఎప్పుడో చనిపోయి ముక్తిని పొంద గోరిన అలాంటి వారికి అంత శ్రమ, అంత కాలం నిరీక్షణ అవసరం లేకుండా క్రూరమృగం వారిని చంపి తిని, సులభంగా, వెంటనే వారికి ముక్తిని కలిగిస్తుందని వేమన హేళనగా చెప్పాడు. ఇలాంటి పద్యాలను విన్న వెంటనే నవ్వు వస్తుంది.

పుణ్యం కోసం, మోక్షం కోసం కొంత మంది పుణ్యక్షేత్రాలను దర్శించి అక్కడ గుండు చేయించుకుంటూ ఉంటారు. వేమన దీన్ని ఇలా గేలి చేస్తున్నాడు.

సకల తీర్థములను సకల యజ్ఞంబుల
తలలు గొరగకున్న ఫలము గలదె
మంత్రజలము కంటె మంగలి జలమెచ్చు , విశ్వ

పుణ్యక్షేత్రాలను దర్శించేవారు మొదట మంగలి వారి దగ్గరకు వెళ్ళి గుండు చేయించుకొని, ఆతర్వాత దేవుణ్ణి దర్శించి పూజారి ఇచ్చే మంత్రజలాన్ని స్వీకరిస్తారు. మంగలివారు గుండు చేసే ముందు తల మీద నీళ్ళు పోసి తలను బాగా తడిపి ఆతర్వాత గుండు గీస్తారు. సులభంగా వెంట్రుకలు తెగడానికి మంగలివారు ఇలా చేస్తారు. పూజారి ఇచ్చే మంత్రజలం కంటె మంగలి వారు తలను తడిపే సందర్భంలో ఇచ్చే జలమే గొప్పదని వేమన చెప్పాడు. ఎందుకంటె మంగలి వ్యక్తి ఇచ్చే జలం సులభంగా గుండు గీయడానికి పనికి వస్తూ వుంది. కానీ గుళ్ళో పూజారి ఇచ్చే జలం వల్ల ఎలాంటి ప్రయోజనం లేదనే ఉద్దేశ్యంతో వేమన మంత్ర జలం కంటె మంగలి జలమే గొప్పదని హేళనగా చెప్పాడు. ఈవిధంగా వేమన హిందూ సంఘంలో ఉన్న అనేక మూఢాచారాలను హాస్యయుక్తంగా గేలి చేశాడు.

వేమనలోని ఈ గేలి లక్షణాన్ని గురించి కట్టమంచి రామలింగారెడ్డి గారు, 'వేమన భాషాశైలి నిష్ఠురము, మర్మభేదకము, ఆవ్రాత మృదులనిందోక్తి, మెత్తటివ్యాజ్యము, మధుర హాస్యముల మధ్య నడయాడుచుండును. చతుర హాస్యము ఆయన ప్రత్యేక లక్షణము. వేదాంత పరముగా ఆయన వాదించడు గానీ పుండు పడునట్లుగా గట్టిగా మోదును. ప్రతిపక్షి కీర్తిహీన బాహ్య టోపములను బట్టబయలు చేసి వెక్కిరింతలకు ఎగతాళులకు బాల్పడజేయును''[1] అని కీర్తించారు. రాళ్ళపల్లి వారు దీన్ని, ''గాయపు మందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్య కుశలత''[2] అని వేమనను ప్రశసించారు.

<u>సులభమైన తెనుగు పదాలను ఉపయోగించడం:-</u>

వేమన తన పద్యాల్లో కఠినమైన సమాస పదాలను ఉపయోగించడు. ఇతను

1. వేమన - పాశ్చాత్యులు, తెనుగు సేత - మరుపూరు కోదండ రామ రెడ్డి, పుట - 38
2. వేమన, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, పుట - 1



సాధారణంగా సంస్కృత పదాల జోలికి పోడు. పుష్టివంతమైన, నిత్యవ్యవహారంలో ఉన్న, చేవ గలిగిన సులభమైన తెనుగు పదాలను మాత్రమే ఉపయోగించాడు. సులభమైన చిన్నచ్నిన్న తెనుగు పదాల గొప్పతనం తెలుసుకోవాలంటే వేమన పద్యాలను చదవవలసిందే. అందుకు మరొక మార్గం లేదు. చిన్నచిన్న తెలుగు పదాలను ఉపయోగించి నూతనమైన, పుష్టివంతమైన భావాలను చెప్పడం వేమనకు మాత్రమే సాధ్యం. ఇది వేమనలో ఉన్న మరొక విశిష్టత.

అల్పబుద్ధి వాని కధికార మిచ్చిన
దొడ్డవారి నెల్ల తొలగ గొట్టు
చెప్పు దినెడు కుక్క చెరకు తీపెరుగునా , విశ్వ

నీచునికి అధికారమిస్తే వాడు తన లాంటి నీచులనే చేరదీసి మంచివారిని వెళ్ళగొడతాడు. ఎందుకంటే నీచునికి మంచివారి గొప్పతనం తెలియదు. అది వానికి మంచివారి గొప్పతనం చేతగానితనంగా కనిపిస్తుంది. చెప్పు తినే కుక్కకు చెరకులో ఉన్న మాధుర్యపు రుచి తెలియదు గదా. ఇందులో నీచుని గుణాన్ని వేమన మూడవ పాదం ద్వారా చక్కగా స్పష్టం చేశాడు. ఈపద్యంలో అన్నీ సులభమైన పదాలే ఉన్నాయి. అర్థం కానీ పదం ఏదీ లేదు.

తప్పులెన్ను వారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్ను వారు తమ తప్పు లెరుగరు , విశ్వ

లోకంలో తప్పులు చేయనివారు ఎవరూ ఉండరు. కాకపోతే కొందరు ఎక్కువ తప్పులు చేస్తే మరి కొందరు తక్కువ తప్పులు చేస్తారు. ''లోకులు పలు కాకులు'' అన్నట్లుగా లోకులు తమలో ఉన్న తప్పులను గురించి పట్టించుకోకుండా ఇతరుల్లో ఉన్న తప్పులను గురించి మాట్లాడుతూ ఉంటారు. ఈపద్యంలో వేమన లోకుల మనస్తత్వాన్ని చక్కగా వివరించాడు. ఇందులో గూడా వేమన అన్నీ సులభమైన పదాలనే ఉపయోగించాడు. అర్థం కానీ పదం ఏదీ లేదు.

చిత్తశుద్ధి కల్గి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు గొదవ గాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత , విశ్వ

ఎంత గొప్ప కార్యానికైనా కావలసింది చిత్తశుద్ధి. చిత్తశుద్ధితో మనం కొంచెం పని చేసినా అది గొప్పదే అవుతుంది. చిత్తశుద్ధితో కొంచెం కొంచెం చేస్తూ పోతే ఎంత కష్టసాధ్యమైన పనినైనా పూర్తి చేయవచ్చు. అందువల్ల ఏపనికైనా కావలసింది చిత్తశుద్ధి. మఱ్ఱిచెట్టు మహా వృక్షం. కానీ దాని విత్తనం చాల చిన్నదిగా ఉంటుంది. అంత చిన్న విత్తనం నుంచి మహావృక్షం ఒక్కసారిగా రాదు. మఱ్ఱిచెట్టు మహావృక్షంగా పెరగడానికి కొన్ని సంవత్సరాల కాలం పడుతుంది. ఈపద్యంలో వేమన చిత్తశుద్ధి యొక్క అవసరాన్ని మూడవ పాదం ద్వారా ఎంతో స్పష్టంగా, గొప్పగా చెప్పాడు. ఇందులో అన్నీ సులభమైన పదాలే ఉన్నాయి. అర్థం కాని పదం ఏదీ లేదు.

తిరిపె గాడయినను తిరిపె మెత్తినయట్టి
తిరిపె మందు తాను తిరిపె మిడిన
తిరిపెము తిరిపెమున దిగబడి పోవురా , విశ్వ

వేమన దాన గుణాన్ని బాగా ప్రశంసించాడు. అడిగిన వానికి లేదనకుండా తనకు చేతనైనంత దానం చేయాలనేది వేమన సిద్ధాంతం. చివరికి భిక్షగాడు కూడా తాను భిక్షమెత్తిన దాంట్లో కొంత భాగాన్ని తన కంటె లేని వానికి దానం చేస్తే వాడు భిక్షమెత్తడం వల్ల వచ్చిన పాపం పోతుందని వేమన చెప్పాడు. తిరిపెం అంటె భిక్షం. ఇది అచ్చమైన తెలుగు పదం. తిరిపెం, తిరిపెగాడు మొదలైన పదాలను రాయలసీమ ప్రజలు ఎక్కువగా ఉపయోగిస్తారు. దీని నుంచి వచ్చినవే తిరిపాలు, తిరిపెమయ్య, తిరిపెంరెడ్డి మొదలైన పేర్లు. ఇలాంటి పేర్లను రాయలసీమ ప్రజలు పెట్టు కుంటారు.

తల్లి బిడ్డలకును తగవు పుట్టించెడు
ధనము సుఖము గూర్పదని వచింత్రు
కాని గడన లేక గడచుట ఎట్లురా , విశ్వ



లోకం ధనం చుట్టూ తిరుగుతూ ఉంది. ధనం లేకుండా ఏపనీ జరగదు. ధనముంటే కొండ మీద కోతినైనా తీసుకొని రావచ్చు. ధనవంతుడు ఎంత వెధవైనా లోకం అతణ్ణి గౌరవిస్తుంది. అందువల్లనే లోకులు ధనం కోసం అనేక దుర్మార్గాలు చేస్తూ ఉంటారు. ఈకారణంగానే ధనం పాపిష్టిదని, అది తల్లిదండ్రులు బిడ్డల మధ్య, భార్యాభర్తల మధ్య గూడా కొట్లాటను కలిగిస్తుందని, ధనవంతునికి సుఖముండదని, తన వద్ద ఉన్న ధనాన్ని కాపాడు కోవడానికి అతడు అనేక రకాల కష్టాలు పడాలని పెద్దలు చెబుతూ ఉంటారు. అలా అని ధనం సంపాదించకపోతే మనిషి జీవించలేడు. కాబట్టి మనిషి బతకడానికి ధనాన్ని తప్పనిసరిగా సంపాదించాలి. ఇందులో వేమన ధనప్రాధాన్యాన్ని స్పష్టంగా చెప్పాడు. మనిషి తాను బతకడం కోసం ధర్మమార్గంలో ధనసంపాదన చేయాలి గానీ ధన సంపాదన కోసమే మనిషి బతక గూడ దనేది వేమన సిద్ధాంతం. ఈపద్యంలో అన్నీ సులభంగా అర్థమయ్యే పదాలే ఉన్నాయి.

మగని కలిమి బలిమి మగువకును బలంబు
కలిమి లేని మగడు కాసు గాడు
పనికి రాని మగని పాటించి చూడదు , విశ్వ

లోకంలో సాధారణంగా భర్తను బట్టే భార్యకు గౌరవం ఉంటుంది. భర్త ధనవంతుడు, బలవంతుడు అయితే లోకం అతనితో పాటు అతని భార్యను గూడా గౌరవిస్తుంది. ధనం లేని మగవానికి ఎలాంటి గౌరవం లేకపోగా లోకం అతణ్ణి హీనంగా చూస్తుంది. లోకాన్ని బట్టే అతని భార్య కూడా అతణ్ణి గౌరవంగా చూడదని వేమన లోకం పోకడను చక్కగా చెప్పాడు. ఈపద్యంలో గూడా అన్నీ సులభమైన పదాలే ఉన్నాయి.

<u>అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన</u>:-

వేమన తన కవిత్వానికి స్వీకరించిన పద్యం ఆటవెలది. ఇది చాల చిన్న ఛందం. ఇందులోని నాలుగు పాదాల్లో చివరి పాదం మకుటం. మిగిలిన మూడు పాదాల్లోనే వేమన తాను చెప్పదలచు కున్న భావాన్ని చెప్పవలసి ఉంటుంది. ఇంత చిన్న ఛందంలోని మూడు పాదాల్లో గొప్ప గొప్ప భావాలను చెప్పడం అసాధ్యం. అయితే ఆఅసాధ్యాన్ని సుసాధ్యం

చేసిన వాడు వేమన. వేమన ఆటవెలదిలోని మూడు పాదాల్లోనే సులభమైన చిన్న చిన్న తెనుగు పదాలతో ఎంతో ఉదాత్తమైన, విప్లవాత్మకమైన, పుష్టి వంతమైన భావాలను ప్రకటించాడు. అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన అనేది వేమన పద్యాల్లో సర్వత్రా కనిపించే గొప్ప లక్షణం. ఇది గూడా వేమనలో ఉన్న మరొక విశిష్టత.

ఆత్మశుద్ధి లేని యాచారమది యేల
భాండ శుద్ధి లేని పాక మేల
చిత్త శుద్ధి లేని శివ పూజ లేలరా , విశ్వ

ఈపద్యంలోని మూడు పాదాల్లో వేమన మూడు విషయాలను చెప్పాడు. ఆచారానికి ఆత్మశుద్ధి, పాకానికి భాండశుద్ధి, శివపూజకు చిత్తశుద్ధి ఉండాలని చెప్పాడు. కొంత మంది అస్పృశ్యుడు ఎదురయ్యాడని, శూద్రుడు తాకాడని సచేల స్నానాలు చేస్తూ తాము నిప్పు లాంటి ఆచారవంతులమని గొప్పలు పోతూ ఉంటారు. ఇవన్నీ మూఢాచారాలు. ఇలాంటి వారికి ఆత్మశుద్ధి ఏమాత్రం ఉండదు. దైవభక్తికి మొదట కావలసినది ఆత్మశుద్ధి. పనికి మాలిన మూఢాచారాలు కాదు. ఆచారాలు మనుషుల మధ్య ఐక్యతను పెంపొందించేవిగా ఉండాలి. మనుషులను వేరు చేసేవిగా ఉండగూడదు. అలా ఉంటే ఆమతానికి పురోభివృద్ధి ఉండదు. వండిన వంటకం రుచికరంగా శుభ్రంగా తొందరగా చెడిపోకుండా ఉండాలంటే పాత్ర శుభ్రంగా ఉండాలి. పాత్ర శుభ్రంగా లేకపోతే వంటకం త్వరగా పాడవుతుంది. అలాగే దైవపూజకు చిత్తశుద్ధి చాల అవసరం. మనస్సును దేవుని మీదనే ఏకాగ్రతగా నిలిపి పూజ చేస్తే ఆపూజకు ఫలితం ఉంటుంది. అలా కాకుండా ‘‘చిత్తం శివుని మీదా భక్తి చెప్పుల మీదా’’ అన్నట్లుగా ఉంటే అలాంటి పూజల వల్ల ఎలాంటి ఫలితం ఊండదు.

భూమిలోన బుట్టు భూభార మెల్లను
తనువులోన బుట్టు తత్వమెల్ల
శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను , విశ్వ

ఈపద్యంలో వేమన మూడు విషయాలను చెప్పాడు. ఆరు ఖండాలు, వాటిలో ఉన్న కొన్ని వందల కోట్ల మానవులు, మహాసముద్రాలు, పర్వతాలు, కొండలు, కోనలు,



నదులు, గొప్పగొప్ప కట్టడాలు, కొన్ని కోట్ల టన్నుల వాతావరణ కాలుశ్యం మొదలైనదంతా భూమిలో పుట్టి భూమికి భారమవుతూ ఉంది. దేవుడు, దైవం, ఆత్మ, పరమాత్మ, మోక్షం మొదలైన ఆముష్మిక జీవితానికి సంబందించిన తత్వమంతా మానవ శరీరంలోనే పుడుతుంది. మానవ పురోభివృద్ధికి సంబంధించిన సర్వస్వం శ్రమలోనే పుట్టి సర్వమూ శ్రమమయం అవుతూ ఉంది.

చంపదగియట్టి శత్రువు తన చేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలు జేసి పొమ్మనుటే చావు , విశ్వ

వేమన గొప్ప అహింసా పరుడు. ఏకారణం చేతా ఏజీవినీ గూడా చంపగూడదనేది అతని సిద్ధాంతం. తనకు ఘోరమైన అపకారం చేసి చంపడానికి అన్ని విధాలా తగిన శత్రువు దొరికితే, అలాంటి వాణ్ణి చంపకుండా వదలివేయడమే గాకుండా తిరిగి మేలు చేయమని వేమన చెబుతున్నాడు. అంతేగాకుండా అలా మేలు చేయడం వాణ్ణి చంపినట్లే అవుతుందని కూడా చెబుతున్నాడు. అలా వదలివేయబడిన శత్రువు అభిమానవంతుడైతే తనకు ప్రాణదానం చేయడమే గాకుండా తిరిగి మేలు చేసిన తన శత్రువు యొక్క ఔదార్యాన్ని, మంచితనాన్ని తలచుకొని అనుక్షణం బాధపడుతూ ఉంటాడు. అది ఒక రకంగా నరకమే, దాని కంటె చావే మేలు అనిపిస్తుంది. ఈవిధంగా వేమన చిన్న పద్యంలోని చిన్న చిన్న పదాల్లో గొప్ప అర్థాన్ని తెలియ జేశాడు.

ఈపద్యం సంస్కృతంలో శూద్రకుడు రాసిన మృచ్ఛకటికంలోనిది. చారుదత్తుడు చెప్పిన ఈకింది శ్లోకాన్ని వేమన పైపద్యంగా అనువదించాడు.

శత్రు: కృతాపరాధ: శరణు ముపేత్య పాదయో:
పతిత: శస్త్రేణ హంతవ్య: ఉపకార హతస్తు కర్తవ్య:

“ వేమన చేసిన ఈఅనువాదాన్ని మొదట కనుగొన్న వాడు బ్రౌన్ ”[3].

దాన మడుగు వాడు ధరలోన నధముండు

3. విశ్వదాభిరామ వినుర వేమ, త్రిపురనేని వెంకటేశ్వరరావు , పుట - XXXV

దాన మడుగడేని దైవతముడు
దాన మీనివాడు ధన్యుండు గాడయా , విశ్వ

వేమన ఈపద్యంలో దానం అడిగే వాణ్ణి గురించి, దానం అడగని వాణ్ణి గురించి, దానం ఇవ్వని వాణ్ణి గురించి చెప్పాడు. వేమన దానగుణాన్ని ప్రశంసిస్తూ చాల పద్యాలు చెప్పాడు. అంత మాత్రం చేత వేమన యాచనను ప్రోత్సహించలేదు. యాచన వల్ల సులభంగా ధనం లభిస్తే పని చేసేవాళ్ళు కూడా పని చేయడం మానివేసి యాచించడం మొదలు పెడతారు. దీనవల్ల దేశ ఆర్థిక వ్యవస్థ దెబ్బ తింటుంది. అందువల్లనే వేమన యాచన చాల నీచమైనదని చెబుతూ దానం అడిగేవాడు ధరలో అధముడు అని చెప్పి యాచనను వ్యతిరేకించాడు. అభిమానవంతునికి చెయిచాచి అడగడం తల తీసివేసినట్లుగా ఉంటుంది. అభిమానవంతుడు ప్రాణం పోయినా సరే చెయిచాచి మరొకర్ని యాచించడు. అందువల్లనే వేమన రెండవ పాదంలో దానం అడగనివాడు దైవతముడు అని ఎంత కష్టం వచ్చినా సరే యాచించని అభిమానవంతుణ్ణి దేవతల్లో శ్రేష్ఠునిగా చెప్పాడు. యాచించడం నీచమైన లక్షణం కావడం వల్లనే సిక్కు మతం యాచించడాన్ని నిషేధించింది. యాచించడం నీచమైన విషయం అని తెలిసి కూడా ఎవరైనా యాచిస్తే అలాంటివానికి దానం చేయాలని వేమన చెబుతూ దాణం ఇవ్వనివాడు ధన్యుడు కాడని మూడవ పాదంలో చెప్పాడు. ఈవిధంగా వేమన చిన్న మూడు పాదాల్లో ఇంత గొప్ప భావాన్ని వ్యక్తం చేశాడు.

కావవలయు ధనము కాంత నెల్లప్పుడు
కావలేనివాడు చావవలయు
కాపు లేని దాని కాపురమడుగనా , విశ్వ

పురుషుడు తన కుటుంబంలో ఉన్న స్త్రీలను, థన అధీనంలో ఉన్న ధనాన్ని రక్షించగలిగి ఉండాలి. అలా రక్షింపలేని అసమర్థుడు బ్రతికి దండగ. అలాంటి వాడు చావాలని వేమన చెబుతున్నాడు. పురుషాధిక్య సమాజంలో ఒంటరిగా ఉన్న స్త్రీకి ఎలాంటి రక్షణ లేదు. మగవాని రక్షణ లేని స్త్రీని పురుషులు నయాన భయాన తమ వశం చేసుకోవడానికి శతవిధాల



ప్రయత్నిస్తారు. "పెర్రివాని పెళ్ళాం వాడవారి కందరికీ వదిన" అన్న చందంగా ఆమె పరిస్థితి తయారౌతుంది. అందువల్లనే వేమన కాపు లేని దాని కాపురమడుగనా? అని ప్రశ్నిస్తున్నాడు. దీనికి రక్షణ లేని స్త్రీ కాపురం గురించి చెప్పేదేముంది అని ఒక అర్థం. మగవాని అండ లేని స్త్రీని తనతో కాపురం చేయమని మరొక మగవాడు అడగడం మరొక అర్థం. ఈపద్యంలో వేమన ఎలాంటి పరిస్థితిలోనూ మగవాడు తప్పనిసరిగా తన స్త్రీలను, తన ధనాన్ని కాపాడుకోగల శక్తిసామర్థ్యాలను కలిగి ఉండాలని చెప్పాడు. మూడవ పాదంలో మగతోడు లేని స్త్రీ పరిస్థితిని చక్కగా తెలియ జేశాడు.

అంతరంగ మందు నపరాధములు చేసి
మంచివాని వలెను మనుజుడుండు
నితరు లెరుగకున్న నీశ్వరుడెరుగడా , విశ్వ

ఈపద్యంలో వేమన మానవ మనస్తత్వాన్ని చక్కగా తెలుయజేశాడు. మనషితన మనస్సులో అనేక రకాలుగా చెడ్డ ఆలోచనలు చేస్తూ ఉంటాడు. అయితే వాటినన్నింటనీ కార్య రూపంలో పెట్టక పోవచ్చు. కానీ చెడ్డ ఆలోచనలు మాత్రం వస్తూనే ఉంటాయి. అతని ఆలోచనలు ఇతర మానవులకు తెలియవు. కాబట్టి అతను బైటికి మంచి వానిలాగా కనిపిస్తూ ఉంటాడు. అయితే అతనిలోని ఆలోచనలు తోటి మానవులు గ్రహించలేక పోవచ్చు గానీ భగవంతుడు గ్రహించకుండా ఉంటాడా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

ఎవ్వరెరుగకుండ నెప్పుడు పోవునో
పోవు జీవ మట్ల బొంది విడిచి
యంత మాత్రమునకు నపకీర్తి నెరుగక
విరగ బడును నరుడు పెర్రివేమ

సృష్టిలో అతి విచిత్రమైనది జీవుల్లో ఉన్న ప్రాణం. జీవి శరీరంలో ప్రాణం ఏభాగంలో ఉంటుందో చెప్పడం కష్టం. జీవి శరీరంలో ప్రాణమున్నంత సేపు అజీవి చైతన్యవంతమై తిరుగుతూ తన పనులు చేసుకుంటూ ఉంటుంది. ప్రాణం పోగానే శవంగా మారిపోయి ఎలాంటి కదలిక లేకుండా ఉండిపోతుంది. ప్రాణం చాల అశాశ్వతమైనది. ఇప్పటి దాకా

ప్రాణంతో ఉండి తుళ్ళుతూ ఉన్నవాడు మరుక్షణంలో ప్రాణం పోయి నిర్జీవుడుగా మారిపోతాడు. మనిషి శరీరం నుంచి ప్రాణం ఎప్పుడు పోతుందో ఎవరూ చెప్పలేరు. అందువల్లనే వేదాంతులు మానవజన్మ బుద్బుద ప్రాయమైనదని చెబుతారు. అయితే మనిషి ఈవిషయాన్ని గ్రహించకుండా అహంకారంతో విర్రవీగి అనేక దుర్మార్గాలు చేస్తూ అపకీర్తిని మూట కట్టుకుంటున్నాడని వేమన విమర్శిస్తున్నాడు. చాల ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే దేవుణ్ణి నమ్మేవాళ్ళు, గంటల తరబడి పూజలు చేసేవాళ్ళే పాపాలు ఎక్కువ చేస్తూ ఉంటారు. నిజంగా వారికి దేవుని మీద నమ్మకముంటే అన్ని పాపాలు చేస్తారా? తాము చేసిన పాపాలను పోగొట్టుకోవడానికే అలా పూజలు చేస్తున్నారేమో ననిపిస్తుంది.

<u>ధారణకు వీలుగా ఉండడం</u>:-

వేమన పద్యాలు సులభంగా కంఠోపాఠం చేయడానికి, కంఠోపాఠం చేసిన దాన్ని చాల కాలం పాటు గుర్తు ఉంచుకోవడానికి వీలుగా ఉంటాయి. వేమన పద్యాలు ఎంత మందమతులైనా సులభంగా బట్టీ పట్టవచ్చు. రెండు మూడు సార్లు చదవాగానే అవి నోటికి వస్తాయి. ఒక సారి నోటికి వచ్చిన తర్వాత వాటిని దాదాపుగా మరచిపోలేం. దీనికి కారణం వేమన పద్యాలు సాధారణంగా ఏపాదానికి ఆపాదం వేరువేరుగా విడిపోయి స్పష్టంగా ఉండడం. మొదటి పాదంలోని విషయం రెండవ పాదంలోకి, అలాగే రెండవ పాదంలోని విషయం మూడవ పాదంలోకి రాదు. ఇలా వేమన పద్యాలు వేరువేరుగా స్పష్టంగా ఉండడం మరొక విశిష్టత.

కులము గల్గువారు గోత్రము గలవారు
విద్యచేత విర్రవీగు వారు
పసిడి గల్గువాని బానిస కొడుకులు , విశ్వ

ఈపద్యంలో వేమన లోకం పోకడను, ధనం ప్రాధాన్యతను చక్కగా తెలియ జేశాడు. పసిడి గల్గువాడు అంటే ధనవంతుడు. బానిస కొడుకులు అంటే పనివాడి కొడుకులు. పనివాడు, అతని పిల్లలు యజమానికి ఎంతో వినయంగా ఉంటారు. అలాగే గొప్ప కులంలో



జన్మించానని, గొప్ప గోత్రంలో జన్మించానని, వేదాలు, వేదాంగాలు, సర్వశాస్త్రాలు చదివానని గర్వంతో విర్రవీగే వారందరూ ధనవంతుని దగ్గరికి వెళ్ళి వాడు చెప్పేది విని వానికి వొంగి నమస్కారాలు చేస్తూ ఉంటారు. పై పద్యంలో వేమన కులం గలవారిని గోత్రం గలవారిని మొదటి పాదంలో, విద్యచేత విర్రవీగే వారిని రెండవ పాదంలో, ఈముగ్గురి దైన్యాన్ని మూడవ పాదంలో వేరు వేరుగా చెప్పాడు. ఇలా వేమన పద్యాలు వేరువేరుగా స్పష్టంగా ఉంటాయి.

ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా , విశ్వ

ఉప్పు, కర్పూరం రెండూ చూడడానికి తెల్లగా ఉండి ఒకటిగా కనిపిస్తాయి. రుచి చూస్తే అవి వేరువేరని స్పష్టమౌతుంది. అలాగే మానవులందరూ పైకి ఒకే లాగా కనిపించినప్పటికీ వారిలో దుర్జనులు, సజ్జనులు వేరువేరుగా ఉంటారు. అది తెలుసుకోవాలంటే మనుషులను జాగ్రత్తగా గమనించాలి. ఈపద్యలో వేమన ఉప్పు కర్పూరం ఒకే లాగా ఉంటాయని మొదటి పాదంలోనూ, వాటి రుచులు వేరువేరుగా ఉంటాయని రెండవ పాదంలోనూ, పురుషుల్లో పుణ్యపురుషులు వేరుగా ఉంటారని మూడవ పాదంలోనూ వేరువేరుగా చెప్పాడు.

మాటలాడు టొకటి మనసులో నొక్కటి
యొడలి గుణ మదొకటి నడత యొకటి
ఎట్లు కలుగు ముక్తి యిట్టులుండగ తాను , విశ్వ

మంచివారు త్రికరణశుద్ధి కలిగి ఉంటారు. వారు మనసా వాచా కర్మణా ఒకే విధంగా ప్రవర్తిస్తారు. దుర్మార్గులు దీనికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తారు. వీరు మనసులో అనుకునేది ఒకటి, బైటికి చెప్పేది మరొకటి, ఆచరించేది ఇంకొకటి. ఇలా ప్రవర్తించే వారికి మోక్షం రాదని వేమన చెబుతున్నాడు. ఈ పద్యంలో దుష్టుడు మనసులో ఒకటి పెట్టుకొని బైటికి ఇంకొకటి మాట్లాడతాడని మొదటి పాదంలో, శరీరగుణం ఒకలాగా ఉంటే అతని ప్రవర్తన

మరొక లాగా ఉంటుందని రెండవ పాదంలో, అలాంటి వానికి మోక్షం ఎలా కలుగుతుందనీ మూడవ పాదంలోనూ వేరువేరుగా చెప్పాడు.

భూమి నాదియన్న భూమి పక్కున నవ్వు
ధనము నాది యన్న ధనము నవ్వు
కదనభీతు జూచి కాలుండు నవ్వురా , విశ్వ

ఈపద్యంలో భూమి నాది అనే వాణ్ణి చూచి భూమి, ధనం నాది అనే వాణ్ణి చూచి ధనం, యుద్ధంలో పారిపోయే వాణ్ణి చూచి యముడు నవ్వుతాడని వరుసగా మూడు పాదాల్లో వేమన వేరువేరుగా చెప్పాడు. మానవ జీవితం అశాశ్వతమైనది. అయితే మనిషి అది తెలుసుకోకుండా తాను సంపాదించిన భూమిని, ధనాన్ని నాది నాది అని అజ్ఞానంతో పలుకుతూ అహంకార మమకారాలకు లోనవుతూ ఉంటాడు. అయితే ఇవి ఏవి చనిపోయేటప్పుడు అతని వెంట రావు. అందువల్లనే నాది నాది అనే వాణ్ణి చూచి భూమి, ధనం నవ్వుతాయని వేమన చెప్పాడు. పుట్టినవాడు గిట్టక తప్పదు. ఈవిషయం తెలిసి కూడా పిరికిపందలు యుద్ధంలో ప్రాణభయంతో పారిపోతుంటారు. అంతమాత్రం చేత వాడు చావు నుంచి తప్పించుకోలేడు. ఎప్పటికైనా వాడు యముని బారిన పడవలసిందే. అందువల్లనే పారిపోయేవాణ్ణి చూచి యముడు నవ్వుతాడని వేమన చెప్పాడు.

గంగ పారుచుండు కదలని గతి తోడ
మురికి పారుచుండు మోత తోడ
దాత యోర్చి నట్లధము డోర్వగ లేడు , విశ్వ

ఈపద్యంలో వేమన దాత గంగ లాంటి వాడని, నీచుడు మురుకి నీటి కాలువ లాంటివాడని దాతకు నీచునికి మధ్య గల తారతమ్యాన్ని చక్కగా చెప్పాడు. గంగ ఎలాంటి శబ్దం లేకుండా ప్రశాంతంగా పారుతుందని మొదటి పాదంలో, మురికి కాలువ పెద్ద శబ్దం చేస్తూ పారుతుందని రెండవ పాదంలో, దాత సహించినట్లుగా నీచుడు సహించలేడని మూడవ పాదంలో వేర్వేరుగా స్పష్టంగా చెప్పాడు.

ఆకటికి తొలగు ఆచార విధులెల్ల
చీకటికి తొలగు చిత్తశుద్ధి
వేకటికి తొలగు వెనకటి బిగువెల్ల , విశ్వ

నిప్పులాంటి ఆచారవంతులమని గొప్పలు పోతూ అస్పృశ్యతను పాటించేవారు ఆకలి వేసినపుడు తమ ఆచారాన్ని మరచిపోయి చివరకు తాము ఏవగించుకునే చండాలుని చేతి వంటకాన్ని గూడా తింటారు. అదేమంటే ప్రాణం పోయే సందర్భంలో అలా చేయడం తప్పు కాదని కథలు చెబుతారు. అలాగే పగటి పూట శ్రీరంగనీతులు చెప్పేవాళ్ళు చీకటి పడగానే వేశ్యల ఇళ్ళకు వెళ్తూ ఉంటారు. వేకటి అంటే గర్భాన్ని ధరించడం. స్త్రీల యవ్వనం పిల్లలను కనడం వల్ల తొలగిపోతుంది. ఈపద్యంలో వేమన ఆచార విధులన్నీ ఆకలికి, చిత్తశుద్ధి ఇకటికి, స్త్రీలలో ఉన్న శరీర పటుత్వం వేకటికి తొలగి పోతాయని వేరువేరు పాదాల్లో స్పష్టంగా చెప్పాడు.

పూడ్చి పెట్టిన సొమ్మెల్ల భూమి పాలు
బైల నుంచిన సొమ్మెల్ల పరుల పాలు
తిండి కొచ్చిన సొమ్మెల్ల తినుకు పాలు
దానమిచ్చిన సొమ్మెల్ల తనకు వేమ

ఈపద్యంలో వేమన నాలుగు విషయాలను వేరువేరు పాదాల్లో స్పష్టంగా చెప్పాడు. పిసినారులు తాము సంపాదించిన ధనాన్ని భూమిలో రహస్యంగా దాచి పెడతారు. అది భూమి పాలే అవుతుంది. కొంత మంది ధనాన్ని, ధనంతో కొన్న వస్తువులను లెక్క లేకుండా ఇంటిబైట పెడుతూ ఉంటారు. అలాంటివి పరుల పాలు అవుతూ ఉంటాయి. ఇక తాను తినే సొమ్మంతా తినుకు పాలు అవుతుంది. తినుకు అంటే ముక్కిముక్కి మల విసర్జన చేయడం. అంటే మనిషి తాను సంపాదించిన ధనంతో షడ్రసోపేతమైన బోజన పదార్థాలను అమితంగా తింటే మలవిసర్జన సమయంలో కష్టపడవలసి ఉంటుంది. అందువల్ల మితంగానే తినాలని వేమన చెబుతున్నాడు. అంటే తాను తినే సొమ్ము మలం పాలు అవుతుందని వేమన చెప్పాడు. చివరికి దానం చేసిన సొమ్ము మాత్రమే చనిపోయిన తర్వాత పుణ్యం రూపంలో తన వెంట వస్తుంది కాబట్టే మానవుడు తాను సంపాదించిన

ధనంలో కొంత పరులకు దానం చేయాలి. వేమన ఈపద్యంలో ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క విషయాన్ని వేరువేరుగా చెప్పాడు.

ఈవిధంగా వేమన పద్యాలు ఏపాదానికి ఆపాదం వేరువేరుగా, స్పష్టంగా, ధారణకు యోగ్యంగా ఉన్నాయి.

**మంచి సుభాషితాలను చెప్పడం :-**

వేమన గొప్ప సుభాషితాలను, సూక్తులను తన పద్యాల్లో చెప్పాడు. అవన్నీ ప్రజల్లో గొప్ప ప్రసిద్ధిని, ప్రచారాన్ని పొంది వేమనకు గొప్ప పేరు ప్రఖ్యాతులను సంపాదించి పెట్టాయి. ఇలాంటి పద్యాల్లో వేమన మొదటి రెండు పాదాల్లో ఒక విషయాన్ని చెప్పి వాటి లక్షణాన్ని మరింత స్పష్టంగా చెప్పడానికి మూడవ పాదంగా ఒక సుభాషితాన్ని చెప్పాడు. ఇలాంటివన్నీ ప్రజల్లో సామెతలుగా చలామణి అవుతున్నాయి. ఇది గూడా వేమన విశిష్టతల్లో ఒకటి. కింది పద్యాల్లోని మూడవ పాదం మంచి సుభాషితంగా పరిగణింప బడుతూ ఉంది.

ఎంత చదువు జదివి నెన్ని విన్నను గాని
హీనుడవ గుణంబు మానలేడు
బొగ్గు పాల గడుగ బోవునా మలినంబు , విశ్వ

అపవిత్రమైన వస్తువును పవిత్రం చేయడానికి పాలతో అభిషేకం చేస్తారు. బొగ్గు నల్లగా మలినంగా ఉంటుంది. దాన్ని ఎంతగా పాలతో కడిగినా దాని మాలిన్యం పోదు. దానికి కారణం స్వతస్సిద్ధంగా అది మలినమైనది కావడమే. అలాగే నీచుడు ఎన్ని గొప్ప గ్రంథాలను చదివినా, ధార్మిక ఉపన్యాసాలు ఎన్ని విన్నా స్వతస్సిద్ధమైన తన నీచగుణాన్ని మానలేడు.

ఎరుగువాని దెలుప నెవ్వడైనను జాలు
నొరుల వశము గాదు వోగు దెల్ప
యేటి వంక దీర్ప నెవ్వరి తరమయా , విశ్వ

ఎరుగు వాడు అంటే జ్ఞాని. జ్ఞానికి చిన్నపిల్లవాడు చెప్పినా అందులో మంచి ఉంటే దాన్ని స్వీకరిస్తాడు. ఓగు అంటే మూర్ఖుడు. మూర్ఖుడు ఏరు లాంటి వాడు. ఏరు పల్లం వైపు ప్రవహించడం వల్ల అది వంకరటింకరగా పారుతుంది. దాని వంకరను తీర్చి తిన్నగా



ప్రవహింప చేయడం ఎవరి వల్లా కాదు. అలాగే మూర్ఖుడు గూడా ఎవరు చెప్పినా వినడు. వాని వంకర బుద్ధి మారదు.

అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు బలుకు చల్లగాను
కంచు మోగినట్లు కనకంబు మోగునా , విశ్వ

కంచు పెద్ద శబ్దంతో మోగుతుంది. కానీ దాని విలువ చాల తక్కువ. నీచుడు కంచు లాంటి వాడు. వానిలో ఏగొప్పతనం లేకపోయినా వాడు తన గురించి డంబాలు పలుకుతూ ఉంటాడు. బంగారం ఎలాంటి శబ్దం చేయదు. కానీ దాని విలువ చాల ఎక్కువ. సజ్జనుడు బంగారం లాంటివాడు. అతడు తాను ఎంత గొప్పవాడైనప్పటికీ వినయంగా తనలో ఏగొప్పతనం లేనట్లుగా మాట్లాడుతాడు.

నీళ్ళలోన మొసలి నిగిడి ఏనుగు బట్టు
బైట కుక్క చేత భంగ పడును
స్థాన బలిమి గాని తన బల్మి గాదయా , విశ్వ

మొసలి పెద్ద శరీరమున్న జంతువు కాదు. కానీ అది నీటిలో ఉన్నప్పుడు భూమి మీద ఉన్న అతి పెద్దజంతువైన ఏనుగును పట్టుకొని దాన్ని చంపగలుగుతుంది. అదే మొసలి నీటిలో నుంచి బైటకు వస్తే కుక్క చేత భంగ పడుతుంది. దానికి కారణం స్థానబలిమి. ఎవరికైనా తమ స్వస్థలంలో గొప్ప బలముంటుంది. స్వస్థలంలో ఎంత బలహీనుడైనా గొప్ప బలంతో ఆత్మవిశ్వాసంతో ఎంత గొప్ప బలవంతుణ్ణైనా ఎదిరించగలడు.

అనువు గాని చోట అధికుల మనరాదు
కొంచెముండుటెల్ల కొదువ గాదు
కొండ అద్ద మందు కొంచెమై యుండదా , విశ్వ

ఎంత గొప్ప వాడైనా పరిస్థితులు తనకు అనుకూలంగా లేనప్పుడు తన గొప్పతనాన్ని ప్రదర్శించ గూడదు. అలా తన గొప్పతనాన్ని ప్రదర్శించడం వల్ల అతనికి ప్రమాదం కలగవచ్చు. అందువల్ల అలాంటి సమయంలో గొప్పవాడు తగ్గి ఉండడం మంచిది. అలా

తగ్గి ఉండడం వల్ల అతని గొప్పతనానికి ఎలాంటి లోపం రాదు. కొండ అద్దంలో కొంచెంగా కనిపించినప్పటికీ దాని గొప్పతనానికి ఎలాంటి లోపం రాదు కదా.

తల్లి దండ్రి మీద దయ లేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
<u>పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా</u> , విశ్వ

మనిషి తన జన్మకు కారకులైన తన తల్లిదండ్రుల పట్ల దయను ప్రేమను భక్తిని కలిగి ఉండాలి. పురాణాల్లో ప్రతినాయకులుగా చెప్పబడిన రావణుడు, దుర్యోధనుడు మొదలైన వారు కూడా తమ తల్లిదండ్రుల పట్ల ఎంతో భక్తినీ వినయాన్ని కలిగి ఉన్నారు. కానీ మనుషుల్లో కొందరు తమను కని పెంచి పెద్ద చేసిన తమ తల్లిదండ్రుల పట్ల ఎలాంటి జాలి లేకుండా, ముసలితనంలో వారిని పట్టించు కోకుండా వదలి వేస్తారు. అలాంటివారు భూమికి చేటు. వాడు పుట్టినా పుట్టక పోయినా ఒకటే. పుట్టలో చెదలు పుడుతూ గిడుతూ ఉంటుంది. కానీ దాని వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. అలాగే తల్లిదండ్రుల మీద దయ లేనివారు కూడా.

పాల సంద్రమందు పవ్వలించిన స్వామి
గొల్ల ఇండ్ల పాలు కోరనేల
<u>యెదుటి వారి సొమ్ము లెల్ల వారికి తీపి</u> , విశ్వ

విష్ణువు పాలసముద్రంలో పపలించినట్లుగా మన పురాణాలు చెబుతున్నాయి. అలాంటి విష్ణువు కృష్ణుడుగా జన్మించినపుడు రేపల్లెలో గోపాలకుల ఇళ్ళలో దూరి పాలను దొంగిలించినట్లుగా భాగవతం మొదలైన గ్రంథాలు చెబుతున్నాయి. ఇలా దొంగిలించడానికి కారణం తనకు పాలు లేకపోవడం వల్ల కాదు. తన సొమ్ము కంటే ఎదుటి వారు సొమ్ము తీపిగా ఉండడమే.

<u>సామాన్య విషయాలను ఉపమలుగా చెప్పడం :-</u>

అలంకారాల్లో ఉపమాలంకారం శ్రేష్టమైనది. అలాంటి ఉపమాలంకారాలను ఔచిత్య వంతంగా ప్రయోగించడంలో కవికుల గురువైన కాళిదాసు గొప్ప నిష్ణాతుడు.



అందువల్లనే "ఉపమా కాళిదాసస్య" అనే నానుడి ఏర్పడింది. ఉదాహరణకు రఘువంశంలోని ఇందుమతీ స్వయంవరం సందర్భంలో కాళిదాసు ప్రయోగించిన కింది ఉపమానం అతనికి "దీపశిఖ కాళిదాసు"గా గొప్ప పేరు ప్రఖ్యాతులను సంపాదించి పెట్టింది.

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతిం పరాసా
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణ భావం సస భూమిపాలః

రాజకుమారి ఇందుమతి పతిని వరింపదలచి స్వయంవర మండపంలో ఆసీనులై ఉన్న రాజకుమారులను చూస్తూ ఒక్కొక్కరినీ దాటి వెళ్ళిపోతూ ఉంది. అప్పుడు వెనుక బడిన ఒక్కొక్క రాజు రాత్రిపూట రాజమార్గంలో ఒక దీపం ముందుకు పోతూ ఉంటే వెలవెల పోతూ వెనుక బడిన భవనం లాగా వివర్ణవదనుడైనట్లుగా కవికులగురువు చెప్పాడు. అపూర్వలావణ్యంతో మెరిసిపోతూ వున్న రాజకుమారి నడుస్తున్న దీపశిఖలాంటిదని, ఆమె చేత తిరస్కరింప బడిన రాజపుత్రులు చీకటి కమ్మిన భవనాల్లాంటి వారని చెప్పిన ఈ ఉపమానం ఆస్వయంవరం దృశ్యాన్ని మన కళ్ళ ముందుకు తెచ్చి పెట్టింది. కాళిదాసు రాజకుమారిని దీపశిఖతోనూ, రాజకుమారులను భవనాల తోనూ ఉపమించి రాజకుమారుల మనోభావాలను చక్కగా తెలియజేశాడు. రాజకుమారి తమ వద్దకు వస్తున్నప్పుడు ఆమె తమను వరిస్తుందనే ఆశతో వారి ముఖాలు వెలిగిపోవడం, ఆమె దాటి వెళ్ళిపోవడంతో వారు వెలవెల పోవడాన్ని కాళిదాసు అత్యంత సహజసుందరంగా లోకసామాన్య మైన ఉపమానం ద్వారా తెలియ జేశాడు.

ప్రజాకవి వేమన లోకసామాన్యమైన ఉపమానాలను ఉపయోగించడంలో కాళిదాసుకు ఇంచుమించు సరితూగ గలడని అతడుపయోగించిన కింది ఉపమలను బట్టి స్పష్టమౌతుంది. వేమన ప్రయోగించిన ఉపమానాలు సరికొత్తగా ఔచిత్యవంతంగా వైవిద్యభరితంగా ఉంటాయి. వాటిని వేమన కృత్రిమంగా ఊహించి చెప్పడు.

అంతేగాకుండా వేమన వాటిని ఎక్కడి నుంచో తీసుకొని రాడు. మన చుట్టుపక్కల అవి మనకు రోజూ కనిపించేవిగా ఉంటాయి. అయితే వాటిని గురించి వేమన చెప్పిన తర్వాతనే మనం వాటి గొప్పతనం తెలుసుకోగలం. ప్రతి దినం కనిపించే వస్తువులను అంత సుందరంగా చెప్పవచ్చునని వేమన పద్యం చదివిన తర్వాతనే మనకు తెలుస్తుంది. ఇలా సామాన్యమైన విషయాలను ఉపమానాలుగా ఉపయోగించడం వేమనకు మాత్రమే సాధ్యం. ఇది గూడా వేమన విశిష్టతల్లో ఒకటి. మొదటి రెండు పాదాల్లో ఒక విషయాన్ని చెప్పి, ఆవిషయాన్ని మరింత స్పష్టం చేయడానికి వేమన మూడవ పాదంలో లోకంలో సాధారణంగా కనిపించే విషయాలను ఉపమలుగా చెప్పాడు.

'మర్మ మెరుగలేక మతములు గల్పించి
యుర్వి దుఃఖులగుదు రొకరి కొకరు
గాజుయింట కుక్క కళవళ పడురీతి , విశ్వ

మానవులు దేవుడు ఒక్కడే అనే రహస్యాన్ని తెలుసుకోకుండా తమకు తోచిన రీతిలో అనేక మతాలను కల్పించుకున్నారు. అంతటితో ఊరుకోకుండా మామతమే గొప్పదని, మాదేవుడే గొప్పవాడని అనేక రకాలుగా మత గ్రంథాలను రాసి మూర్ఖులైన ప్రజలను రెచ్చగొట్టి మతం పేరుతో ప్రజలను చంపి రక్తపు టేరులను ప్రవహింప జేశారు. రోజువారి జీవితంలో గూడా మనుషులు మతం పేరుతో కలహించు కుంటూ దుఃఖాన్ని పొందుతున్నారు. ఇది గాజు ఇంట్లో లేక అద్దాలు అమర్చిన ఇంట్లో కుక్కను ఉంచితే అది అద్దంలో తన ప్రతిబింబం చూసుకొని ఆప్రతిబింబాన్ని వేరే కుక్కగా భావించి కరవడానికి ప్రయత్నించడం లాంటిది. కుక్క తాను ఉంటున్న ప్రాంతంలోకి కొత్త కుక్క వస్తే దాన్ని తరిమి కొడ్తుంది. కుక్క జంతువు. దానికి వివేకం లేదు. అందువల్లనే అది కొత్త కుక్కను చూస్తే కరుస్తుంది. కానీ మనుషులు వివేకం ఉండి మతం విషయంలో హేతుబద్ధంగా ఆలోచించకుండా కుక్కల లాగానే కాట్లాడుకుంటూ ప్రశాంతంగా జీవించకుండా జీవితాన్ని నరకం చేసుకుంటున్నారని వేమన ప్రజలను నిందిస్తున్నాడు. ఈపద్యంలో గాజుటింట కుక్క కళవళ పడురీతి అని వేమన చెప్పిన ఉపమానం సహజంగానూ కొత్తగానూ ఉంది.



ఇలాంటి ఉపమానాలను వేమన మాత్రమే చెప్పగలడు.

దేహమందు నున్న దేవుని దెలియక
తీర్థవాసులగుచు తిరుగు వారు
గంధ తరువు మోయు గాడిద చందంబు , విశ్వ

ప్రతి జీవి దేహంలోనూ దేవుడున్నాడనేది వేమన సిద్ధాంతం. అలా చూసినప్పుడు మనిషిలోనూ దేవుడున్నాడు. మూఢప్రజలు తమలో ఉన్న దేవుణ్ణి గ్రహించకుండా కాశీ, గయ, రామేశ్వరం, మక్కా మొదలైన పుణ్యక్షేత్రాల్లో దేవుడున్నాడని భావించి ఎంతో కష్టపడి డబ్బు ఖర్చు పెట్టుకొని ఎన్నో శ్రమలకోర్చి పుణ్యక్షేత్రాలను దర్శించడానికి వెళ్తూ ఉంటారు. వేమన దృష్టిలో ఇది గాడిద మంచిగంధపు చెక్కలను మోయడం లాంటిది. గాడిదకు వివేకం లేదు. దానికి గంధపు చెక్కల వాసన తెలియదు. అందువల్లనే "గాడిదకేమి తెలుసు గంధపు చెక్కల వాసన" అనే సామెత వచ్చింది. గాడిదకు తాను గొప్ప సువాసన కలిగిన గంధపు చెక్కలను మోస్తున్నానన్న సంగతి తెలియక మిగిలిన వస్తువుల లాగానే గంధపు చెక్కలను గూడా మోస్తూ ఉంటుంది. మానవులు గూడా గాడిదలాగా వివేకం లేకుండా తమలోనే దేవుడున్నాడనే విషయం గ్రహించకుండా ఎక్కడో దేవుడున్నాడని పుణ్యక్షేత్రాలను దర్శించడానికి వెళ్తున్నారని వేమన హేళన చేశాడు. ఇందులో వేమన ప్రయోగించిన గంధతరువు మోయు గాడిద చందంబు అనే ఉపమానం లోకంలో సామాన్యంగా కనిపించేదే. ఇది ఎంతో సహజంగా కొత్తగా ఉంది.

ఇంచుకంత యోని కీగెడు జనులు
కంచము కడ పిల్లి గాచునట్లు
పంచబాణునింట బానిస కొడుకులు , విశ్వ

కంచం దగ్గర పిల్లి కాచుకొని ఉన్నట్లుగా పురుషులు మన్మథునికి లొంగిపోయి కొంచెపు యోని కోసం స్త్రీల దగ్గర పడిగాపులు పడుతున్నారని వేమన పురుషులను గురించి చెప్పాడు. రాయలసీమలో ఊరపిల్లులు ఇళ్ళల్లో తిరుగుతూ ఉంటాయి. వీటిని ప్రత్యేకంగా ఎవరూ పెంచరు. వాటికి ప్రత్యేకంగా ఆహారం వేయరు. మనుషులు అన్నం తినేటప్పుడు పెరుగన్నం

గానీ మజ్జిగన్నం గానీ కంచానికి కొంచెం దూరంలో వాటికి వేస్తారు. మాంసాహారం, చేపలు మొదలైనవి తినేటప్పుడు వాటి ఎముకలను వేస్తూ ఉంటారు. అందువల్ల పిల్లులు ఇంట్లో మనుషులు బోజనానికి కూర్చున్న వెంటనే మ్యావ్‌మ్యావ్ అని అరుస్తూ కంచం దగ్గర అటూఇటూ తిరుగుతూ అన్నం ఎప్పుడు వేస్తారా కంచం వైపు చూస్తూ ఉంటాయి. పురుషులు కూడా మన్మధతాపంతో స్త్రీల యోనిని ఆశించి కంచం దగ్గర పిల్లుల లాగా స్త్రీల దగ్గర కాచుకొని ఉంటారని వేమన మంచి ఉపమానం చెప్పాడు. ఈఉపమానం లోకసామాన్యమైనది. ఇది వేమన లోకపరిశీలనాశక్తిని తెలియ జేస్తూ ఉంది.

దాన మరసి చేయు దాత దగ్గర జేరి
పక్రభాషణములు పలుకు మొరకు
చందన తరువందు సర్పమున్నట్లయా , విశ్వ

సువాసన కలిగిన చందనం చెట్టు దగ్గర పాము ఉన్నట్లుగా మూర్ఖుడు దాత దగ్గర చేరి అతనికి చెడ్డమాటలను చెప్పి దానం చేయకుండా చేస్తాడు. సువాసన కలిగిన చందనం చెట్టు దగ్గర పాము ఉంటే పాముకు భయపడి చెట్టు దగ్గరకు ఎవరూ రారు. అలాగే దాత దగ్గర మూర్ఖుడు ఉంటే ఆమూర్ఖునికి భయపడి యాచకులు దాత దగ్గరికి రారు. ఇది గూడా లోకసామాన్యమైన ఉపమానమే.

తాను గుడువలేడు తగవేది యాప్పుల
జేరనీయడట్టి చెనటి పశువు
చేనిలోన బొమ్మ చేసి కట్టినయట్లు , విశ్వ

లోకంలో రైతులు తమ పంటలను పక్షులు మొదలైనవి తినకుండా ఉండడానికి దిష్టిబొమ్మలను కడుతూ ఉంటారు. ఆదిష్టిబొమ్మ బొమ్మ కాబట్టి అది తినదు, పక్షులు మొదలైనవి చేను దరిదాపులకు రాకుండా భయపెడుతూ ఉంటుంది. అలాగే పిసినారి వాడు తాను సంపాదించిన ధనాన్ని తాను తినడు. తనవారు వస్తే, వారు తన సొమ్ము ఎక్కడ తిని పోతారోనని వారిని తన ఇంటి దరిదాపులకు గూడా రానివ్వడు. ఇక్కడ వేమన పిసినారి వాణ్ణి దిష్టిబొమ్మతో ఉపమించడం చాల సహజంగా ఔచిత్యవంతంగా



ఉంది. ఇది గూడా లోకసామాన్యమైన ఉపమానమే.

ఎరుక మాలు వాడు ఏమేమి చదివినా
చదివినంత సేపె సద్గుణియగు
కదిసి తామరందు కప్ప కూర్చున్నట్లు , విశ్వ

ఎరుకమాలు వాడు అంటే మూర్ఖుడు. మూర్ఖుడు ఎంత గొప్ప గ్రంధాలు చదివినా చదివినంత సేపు మాత్రమే మంచివాడుగా ఉంటాడు. ఆతర్వాత మళ్ళీ మామూలుగా మూర్ఖుడు అవుతాడు. ఇది కొలనులో ఉన్న కప్ప తామర మీద కూర్చోవడం లాంటిది. కొలనులో ఉన్న కప్ప అప్పుడప్పుడు తామర మీద కూర్చుంటూ ఉంటుంది. అలా కప్ప తామర మీద కూర్చున్నంత సేపు తామర సువాసన దానికి అబ్బి అది కూడా సువాసనా భరితంగా ఉంటుంది. తామర మీద నుంచి కప్ప వెళ్ళిపోగానే మళ్ళీ మామూలుగా దాని దుర్వాసన దానికి వస్తుంది. అలాగే మూర్ఖుడు కూడా మంచి గ్రంథాలను చదివినంత సేపు మంచివాడుగా ఉంటాడు. ఆతర్వాత మళ్ళీ మామూలే. ఈఉపమానం గూడా లోకంలో సాధారణంగా కనిపించేదే.

చదువులన్ని చదివి చాల వివేకియై
కలుషచిత్తుడైన ఖలుని గుణము
దాలిగుంట కుక్క తలచిన చందమౌ , విశ్వ

గ్రామాల్లో ఇంటి బైట చిన్నగుంత తీసి దాన్ని పొయ్యిగా ఉపయోగించి నీళ్ళు కాచుకుంటూ ఉంటారు. ఇలాంటి గుంటను దాలిగుంట అంటారు. చలికాలంలో ఈదాలిగుంటలో ఉన్న బూడిదలో ఊరకుక్కలు వెచ్చగా పడుకుంటూ ఉంటాయి. ఊరకుక్కలు ఆహారం కోసం ఇళ్ళలో దూరి ఇంటి వారి చేత దెబ్బలు తింటూ ఉంటాయి. ఊరకుక్క దాలిగుంటలో పడుకొని ఇక ఇప్పటి నుంచి దొంగతనంగా ఎవరి ఇళ్ళలోకి వెళ్ళడం గానీ, దెబ్బలు తినడం గానీ చేయగూడదని అనుకుంటూ ఉంటుందట. అయితే లేచిన వెంటనే దాని కుక్కబుద్ధి ప్రకారం మళ్ళీ మామూలుగా ఇళ్ళలోకి దూరి దెబ్బలు తింటూ ఉంటుంది. అలాగే దుర్మార్గుడు కూడా గొప్ప పుస్తకాలు చదివి చాల జ్ఞానాన్ని సంపాదించినప్పటికీ

ఆపుస్తకాలు చదివినంత సేపు తాను మంచివానిగా ఉండాలను కుంటాడు. పుస్తకం వదలివేయగానే మళ్ళీ తన సహజగుణం ప్రకారం దుర్మార్గాలు చేస్తూ ఉంటాడు.

పైన చెప్పిన పద్యాల్లోని మూడవ పాదంలో వేమన చెప్పిన ఉపమలన్నీ లోకంలో మనం చూసేవే. వాటిని వేమన ఎంతో ఔచిత్యంగా, వినూత్నంగా తన కవిత్వంలో చెప్పాడు. వేమన ఉపమలను గురించి విలియం హోవర్డ్ క్యాంబెల్, "వేమన ఉపమానములు ఎప్పుడూ అపూర్వ రమ్య ఫణితిలో అతికినట్లు సరిపోయి మానసిక ఫలకపై అచ్చుబడి పోవుచున్నవి. ఇంకను ఇవి ఎంత బాగున్నవంటే - చెప్పదలచుకొనిన అంశమును విపులీకరించుటే గాక ప్రమాణీకరించుచూ సర్వసామాన్యముగా అవి ఆమోదింపబడుచున్నవి"[4]. అని చెప్పాడు.

<u>వేదాంత విషయాలను సులభమైన పదాల్లో చెప్పడం :-</u>

సాధారణంగా శిష్టకవులు వేదాంతానికి సంబంధించిన గంభీరమైన విషయాలను చెప్పడానికి సంస్కృత సమాసాలను ఉపయోగిస్తారు. చిన్న చిన్న తెలుగు పదాల్లో గంభీరమైన భావాలను చెప్పడం పండిత కవులకు చేత కాదు. కానీ వేమన ఎంత గంభీరమైన విషయాన్నైనా చాల సులభమైన చిన్నచిన్న తెనుగు పదాలతో ఎంతో స్పష్టంగా చెప్పగలడు. ఇది శిష్టకవుల్లో వేమనకు తప్ప ఇతరులకు అలవడని గొప్పగుణం. ఇది వేమన మరొక విశిష్టత. జానపద కవులకు గూడా ఈలక్షణం బాగా అలవడింది.

తరవ తరవ బుట్టు తరువున ననలంబు
తరవ తరవ బుట్టు దధిని ఘృతము
తలప తలప పుట్టు తనువున తత్వంబు , విశ్వ

చెట్టును రాపిడి పెడుతూ పెడుతూ ఉంటే అందులో నుంచి అగ్గి పుడుతుంది. పెరుగును చిలుకుతూ చిలుకుతూ ఉంటే అందులో నుంచి వెన్న పుడుతుంది. అలాగే మానవుడు ఏకాగ్రతగా భగవంతుని గురించి మననం చేస్తూ ఉంటే అతనికి జ్ఞానోదయం కలిగి తత్వం పుడుతుంది.

4. వేమన - పాశ్చాత్యులు, తెనుగు సేత - మరుపూరు కోదండరామరెడ్డి - పుట - 84



తనువనేటి యింట తన శత్రు మిత్రుల
దెలియ లేని వాని తెలివదేమి
తెలిసిన మనుజునకు దివ్యామృతంబురా , విశ్వ

ప్రతి వారిలోనూ కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు అనే ఆరు అరిషడ్వర్గాలు ఉంటాయి. ఇవి మనిషిలో ఉన్న శత్రువులు. ఇవి శత్రువులనే విషయం గ్రహించి సాధన ద్వారా వాటిని తొలగించు కోవాలి. దానధర్మాలు, పరోపకారం చేయడం, అహింసను పాటించడం, మొదలైన సద్గుణాలు మానవుని మిత్రులు. వీటిని మానవులు అలవరచు కోవాలి. ఈవిధంగా మానవుడు తన శత్రుమిత్రులను తెలుసుకొని ఆచరించినప్పుడే అతడు తెలివైనవాడు, జ్ఞాని అవుతాడు. జ్ఞాని అయినవాడు దివ్యామృతాన్ని గ్రోలినవాడు అవుతాడు.

పసుల వన్నె వేరు పాలేక వర్ణమౌ
పుష్ప జాతి వేరు పూజ యొకటి
దర్శనములు వేరు దైవంబ దొక్కటే , విశ్వ

పశువులు నలుపు, ఎరుపు, తెలుపు మొదలైన అనేక రంగుల్లో ఉన్నప్పటికీ అవి ఇచ్చే పాలు మాత్రం ఒకే రంగులో తెల్లగా మాత్రమే ఉంటాయి. పూజకు ఉపయోగించే పూలు మల్లె, కనకాంబరం, చెండుమల్లె మొదలైన చాల రకాలు ఉన్నప్పటికీ పూజించే విధానం మాత్రం ఒకటే. అలాగే దేవుణ్ణి దర్శించడానికి చెప్పిన మార్గాలు చాల ఉన్నప్పటికీ దేవుడు మాత్రం ఒక్కడే.

మతము లెన్నియైన సతముగా నుండవు
సతముగాను యుండు జగతి నొకటి
యంత మతము విడిచి నా బ్రహ్మ మరయరో , విశ్వ

భూమి మీద మతాలు చాల ఉన్నాయి. అయితే అవన్నీ శాశ్వతమైనవి కావు. శాశ్వతంగా ఉండేది పరబ్రహ్మం ఒకటే. కాబట్టి అశాశ్వతమైన మతాలను వదలివేసి శాశ్వతమైన ఆపరబ్రహ్మాన్ని తెలుసుకోమని వేమన ప్రజలకు బోధించాడు.

శైవ వైష్ణవాది షణ్మతముల కెల్ల
దేవుడొక్కడగుట తెలియలేరె
తమకు భేదమైన దత్వంబు భేదమా , విశ్వ

వేమన ఈపద్యంలో శైవం వైష్ణవం మొదలైన మతాలు ఆరు అనిచెప్పాడు. ఆరు గానీ అరవై గానీ, భూమి మీద ఎన్ని మతాలున్నా దేవుడు మాత్రం ఒక్కడే అనేది వేమన నమ్మకం. అయితే మతపెద్దలు ఇది గ్రహించకుండా స్వార్థంతో తాము కల్పించిన మత భేదాలను దేవుళ్ళకు అంటగట్టి ప్రజలను మోసం చేస్తున్నారు. అందువల్లనే వేమన మతాధిపతులను ఉద్దేశించి తమకు భేదమైతే తత్వానికి భేదమా అని ప్రశ్నిస్తున్నాడు.

ఈవిధంగా వేమన సులభమైన పదాల్లో వేదాంత సంబంధమైన విషయాలను అందరికీ అర్థమయ్యే లాగా చెప్పాడు.

ఉల్లేఖాలంకారానికి ఉజ్వలమైన ఉదాహరణ -:

వేమన, నన్నయ చెప్పిన మహాభారతం లాంటి వాడు. నన్నయ మహాభారతాన్ని గురించి

ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిధులు వేదాంతమనియు ,
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసికులితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహి గొనియాడుచుండ

(మహాభారతం, ఆదిపర్వం,ప్రథమాశ్వాసం, 31వ పద్యం)

అని ప్రశంసించాడు. అలాగే వేమన గూడా తాను రాసిన పద్యాలను బట్టి అనేకులకు అనేక రకాలుగా దర్శనమిస్తున్నాడు. వేమన, కవిత్వం గురించి తెలిసిన వాళ్ళకు మహాకవిగా, ప్రజాకవిగా, సంఘసంస్కర్తలకు గొప్ప సంఘసంస్కర్తగా, మానవతా వాదులకు గొప్ప మానవతావాదిగా, కులనిర్మూలనా వాదులకు కులనిర్మూలకుడిగా, నాస్తికులకు నాస్తికుడుగా, ఆస్తికులకు ఆస్తికుడుగా, శైవులకు శైవునిగా, సమసమాజ స్థాపనాకాంక్షకులకు సమసమాజ స్థాపనాకాంక్షకుడుగా, వేదాంతులకు వేదాంతిగా,



జ్ఞానులకు జ్ఞానిగా, "మహమ్మదీయులకు సూఫీమత భావాలు కలిగిన వాడుగా"[5] - ఇలాగ అనేకులకు అనేక రకాలుగా కన్పిస్తున్నాడు. అందువల్లనే ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు[6] వేమనను ఉల్లేఖాలంకారానికి ఉజ్వలమైన ఉదాహరణగా పేర్కొన్నారు. ఈవిధంగా ఉల్లేఖాలంకారానికి ఉజ్వలమైన ఉదాహరణగా ఉండడం వేమన మరొక విశిష్ట లక్షణం.

ప్రజాకవి :-

వేమన ప్రజాకవి. ప్రజల భాషలో ప్రజల కోసం, వారి సంక్షేమం కోసం కవిత్వం చెప్పినవాడు వేమన. సామాన్య ప్రజల శ్రేయస్సును కాంక్షించి వారిలో ఉన్న మూఢాచారాలను, మూఢనమ్మకాలను తొలగించుకొని బాగుపడమని ఒక తండ్రిలాగా తిడుతూ వేమన కవిత్వం చెప్పాడు. మనకు తిట్టు కవులు చాల మంది ఉన్నారు. వారందరూ స్వార్థపరులు. తమకు పెట్టలేదని పెట్టని వాళ్ళను పడతిట్టారు. వేమన గొప్ప నిస్వార్థపరుడు. తనకు ఫలానాది కావాలని ఆయన ఏనాడూ ఎవ్వరినీ అడగలేదు. ప్రజాపీడకులను, ప్రజల అజ్ఞానాన్ని సొమ్ము చేసుకో చూస్తున్న స్వార్థశక్తులను ఆయన తిట్టాడు. ప్రజలను మూఢనమ్మకాల వైపు మరల్చుతున్న బ్రాహ్మణులను, వ్యాపారం చేస్తూ ప్రజలను అనేక రకాలుగా మోసం చేస్తున్న వైశ్యులను, ప్రజాకంటకులుగా పాలన చేస్తున్న రాజులను, పిసినారులను ఆయన నిర్మొహ మాటంగా, ధైర్యంగా తిట్టి ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ప్రయత్నించాడు. అంతే గాకుండా దానగుణాన్ని, కృతజ్ఞతా గుణాన్ని పెద్దచేసి ప్రశంసించాడు.

సోమయజ్ఞం చేసిన బ్రాహ్మణుణ్ణి సోమయాజి అని పిలుస్తారు. సోమయాజికి ఆనాటి సంఘంలో మంచి గౌరవం ఉండేది. వారికి ప్రత్యేకమైన వేషధారణ కూడా ఉండేది. ఈకారణాల వల్ల సోమయాజులకు గర్వం కూడా బాగా బలిసేది. దాన్ని వేమన ఇలా ఖండించాడు.

5. వేమన - పాశ్చాత్యులు, తెనుగు సేత - మరుపూరు కోదండరామరెడ్డి, పుట - 22
6. నాదయోగి మన వేమన, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి, పుట - 1

సోమయాజి ననుచు సొంపుతో వేషంబు
గట్టి మాంసమెల్ల కాల్చి తినును
ద్విజుడ నేననగ అధిక మేమి తన వల్ల , విశ్వ

నేనుసోమయాజిని, నేను ద్విజుణ్ణి అని గర్వంతో విర్రవీగడంలో అతని గొప్పతనం ఏమీ లేదు. కాకపోతే యజ్ఞం చేసే సమయంలో యజ్ఞపశువు యొక్క మాంసంలో మంచిమంచి ముక్కలను కాల్చి తినడం తప్ప అని వేమన బ్రాహ్మణుల ఆధిక్యాన్ని గేలి చేశాడు.

పాడి గాదు జగతి పంచాంగములు జెప్పి
కొంచెమ్మైన బుద్ధి నొంచలేక
బ్రహ్మమెరుగ కిట్లు పౌరోహితము చేయ , విశ్వ

పురోహితులు అంటే ముందు రాబోయే హితాన్ని చెప్పేవారు అని అర్థం. అంటే జరుగబోయే శభాశుభాలను చెప్పేవారు. పంచాంగాలు చెప్పడం, ముహూర్తాలు నిర్ణయించడం, ప్రాయశ్చిత్తాలు చేయించడం మొదలైనవన్నీ దీని కిందికి వస్తాయి. వేమన దృష్టిలో ఇవన్నీ మూఢ విశ్వాసాలు. ఎందుకంటే రాబోయే శుభాశుభాలను దేవుడు తప్ప ఎవ్వరూ చెప్పలేరు. అలా మానవులు ఎవరైనా మేము భవిషత్తు చెప్పగలము అని చెబితే అది తప్పని సరిగా మోసం చేస్తున్నట్లే. బ్రాహ్మణులు పరబ్రహ్మాన్ని గురించి తెలుసుకోకుండా మోసబుద్ధితో ఇలాంటి అనేక మూఢవిశ్వాసాలను ప్రజల మనసులకు బాగా ఎక్కించి వారిని అజ్ఞానులుగా చేసి వారి నుంచి ధనం గుంజుతూ వారికి కీడు చేస్తున్నారు. అలా చేయడం బ్రాహ్మణులకు తగదని వేమన వారికి బుద్ధి చెబుతున్నాడు.

వేమన కాలంలో శైవవైష్ణవుల మధ్య అనవసరమైన శత్రుత్వం ప్రబలంగా ఉండేది. దాన్ని వేమన ఇలా గేలి చేశాడు.

విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి
వాదమేల మత విభేద మేల
తెలియ లింగధరులు తిరుమంటి పాలైరి , విశ్వ

వైష్ణవులు తిరుమణిని నుదుటి మీద పెట్టుకుంటారు. శైవులు బూడిదను ఒంటికి



పూసుకుంటారు. జీవించి ఉన్నప్పుడు వైష్ణవులు బూడిదను చచ్చినా పూసుకోరు. అలాగే శైవులు తిరుమణి నా·ఏం పెట్టుకోరు. వైష్ణవులు చనిపోయిన తర్వాత వారిని దహనం చేస్తారు. అందువల్ల వారు బూడిద పాలు అవుతున్నారు. శైవులు చనిపోయిన తర్వాత వారిని మట్టిలో పూడ్చిపెడతారు. అందువల్ల వారు తిరుమణి పాలు అవుతున్నారు. జీవించి ఉన్నప్పుడు వారు దేన్నైతే తీవ్రంగా ద్వేషించారో, వ్యతిరేకించారో చనిపోయిన తర్వాత వారు దాని పాలు అవుతున్నారు. అందువల్ల మానవులు కలిసి మెలసి జీవించాలి గానీ అనవసరమైన మతవిబేధాలు కల్పించుకొని శత్రువులుగా ఉండగూడదని వేమన ప్రజలకు బోధించాడు

వేమన విగ్రహారాదనకు వ్యతిరేకి. విగ్రహారాధనను వేమన ఇలా ఖండించాడు.

శిలలు దేవతలని చెలరేగి చెలరేగి
మొనసి పూజసేయు మూర్ఖులారా
జీవులందె కాక శిలలందునేముండు , విశ్వ

వేమన దృష్టిలో విగ్రహాలను దేవుళ్ళుగా భావించి పూజ చేయడం మూఢనమ్మకం, మూర్ఖత్వం. దాదాపు సంఘసంస్కర్తలందరి అభిప్రాయం ఇదే. భూమి మీద ఉన్న ప్రతి జీవిలోనూ దేవుడున్నాడు అనేది వేమన సిద్ధాంతం. వేమన ఈపద్యంలో చెలరేగి చెలరేగి, మొనసి అనే మాటలను ఉపయోగించి విగ్రహారాధన చేసేవా·ు ఎంత ఆడంబరంగా విగ్రహాలకు పూజలు చేస్తారో చక్కగా తెలియజేశాడు. రాతితో చెక్కిన దేవతా ప్రతిమలను దేవుళ్ళుగా భావించేవారు వాటికి నైవేద్యాలు పెట్టడం, ఉపవాసాలుండడం , పాలు పెరుగు నెయ్యి తేనె చందనం మొదలైన పదార్థాలతో అభిషేకం చేయడం, పూలు, పళ్ళు, కొబ్బరికాయలు, తమల పాకులు మొదలైన వాటితో ఆడంబరంగా పూజలు చేయడం మొదలైనవి చేస్తూ, తామే గొప్ప భక్తులమని భావిస్తూ ఉంటారు. ఇలాంటి వారిని వేమన మూర్ఖులని తిట్టి, తోటి మానవుల్లోనూ, మిగిలిన అన్ని జీవుల్లోనూ దేవుణ్ణి చూడాలి గానీ శిలల్లో దేవుడ లేడని హితబోధ చేశాడు.

వేమన పిల్లికి బిచ్చం పెట్టని పిసినిగొట్టులను తీవ్రంగా విమర్శించాడు.

లోభివాని జంప లోకంబు లోపల

మందు వలదు వేరె మతము గలదు

పైక మడుగ నతడు భగ్గురు మని చచ్చు , విశ్వ

పిసినారి వాళ్ళు ధనం ఖర్చు కావడాన్ని ప్రాణం పోయినట్లుగా భావిస్తారు. అందువల్ల వారిని చంపడానికి వేరే మందూ మాకూ అవసరం లేదు. ధనం అడిగితే భగ్గుమని అగ్గిలాగా మండిపడి చచ్చిపోతారు.

పిసిని వాని యింట పీనుగు వెడలిన

గట్టె కోలలకును గాసులిచ్చి

వెచ్చమాయె నంచు వెక్కి వెక్కి మరేడ్చు , విశ్వ

ఇంట్లోని వ్యక్తి చనిపోతే కుటుంబ సభ్యులందరూ అతని మరణానికి ఎంతగానో దుఃఖిస్తారు. పిసినిగొట్టు కూడా దుఃఖిస్తాడు, కానీ అతడు ఏడ్చేది కుటుంబ సభ్యుడు చనిపోయి నందుకు కాదు, చనిపోయిన వ్యక్తిని కాల్చడానికి డబ్బు ఖర్చు అయిందని వెక్కివెక్కి మరీ ఏడుస్తాడట.

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక

తాను దినక లెస్స దాచు లోభి

తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా , విశ్వ

తేనెటీగ ఎంతో కష్టపడి ప్రతిపూవు దగ్గరికి వెళ్ళి మకరందాన్ని తెచ్చి తేనెను తయారు చేసి చివరకు దారిన పొయ్యేవాడికి ఆతేనెను ధారపోస్తుంది. అలాగే పిసినారి వాడు డబ్బు ఏమాత్రం ఖర్చు పెట్టకుండా పైసాపైసా కూడబెట్టి ధనాన్ని బాగా పోగుచేసి దాన్ని తాను తినకుండా ఇతరులకు ధర్మం చేయకుండా దాచిపెట్టి ఉంచుతాడు. వాడు చనిపోయిన తర్వాత చివరికి అది అతని దాయాదుల పాలు గానీ, దొంగలపాలు గానీ, రాజుల పాలు గానీ అవుతుంది.

వేమన అలా పిసినారులను విమర్శించి దానగుణాన్ని బాగా ప్రశంసించాడు. కులమత వివక్షణ లేకుండా బీదసాదలందరికీ దానం చేయాలనేది వేమన అభిప్రాయం.



దానగుణాన్ని గురించి ఆయన చాల పద్యాలు చెప్పాడు.

వెళ్ళి వచ్చునాడు మళ్ళీపొయ్యే నాడు

వెంట రాదు ధనము కొంచబోడు

తాను యేడ బోవునో ధనమేడ బోవునో , విశ్వ

మానవుడు పుట్టేటప్పుడు ధనాన్ని వెంట తీసుకొని రాడు. జీవించి ఉన్నప్పుడు అనేక కష్టాలు పడి సంపాదించిన ధనం అతడు చనిపోయి వెళ్ళిపోయేటప్పుడు అతని వెంట రాదు. అందువల్లనే వేమన మనిషి చనిపోయిన తర్వాత తాను ఎక్కడికి పోతాడో అతడు సంపాదించిన ధనం ఎక్కడికి పోతుందో అని చెబుతున్నాడు.

తాము గడన సేయు ధనము తమది యని

నమ్మియుండ్రు వెర్రి నరులు భువిని

తాము నొకరి కిచ్చు ధనమింతియే కాక

కడమది తమకేల కలుగు వేమ

మనుషులు భూమి మీద తాము సంపాదించే ధనమంతా తమకే చెందుతుందని భ్రమ పడుతూ ఉంటారు. ఇహలోకం దృష్ట్యా అది నిజం కావచ్చు. కానీ పరలోకం దృష్ట్యా అది నిజం కాదు. మానవుడు చనిపోయిన తర్వాత అతడు సంపాదించిన ధనం గానీ, ఆధనాన్ని అనుభవించే భార్యాపుత్రులు గానీ అతని వెంట రారు. జీవించి ఉన్నప్పుడు అతడు సంపాదించిన ధనంతో చేసిన దానధర్మాలు, మంచిపనుల వల్ల వచ్చిన పుణ్యఫలం మాత్రమే అతని వెంట వచ్చి అతడు మోక్షాన్ని పొందడానికి గానీ మరుసటి జన్మలో గొప్పవాడుగా పుట్టడానికి గానీ పనికి వస్తుంది.

పూర్వజన్మ మందు పుణ్యంబు సేయని

పాపి ధనము కాశపడుట యెల్ల

విత్తమరచి కోయ వెదకిన చందంబు , విశ్వ

గతజన్మలో దానం చేయని పాపి ఈజన్మలో ధనాన్ని ఆశించడం విత్తనం వేయడం మరచి పోయి పంట కోయడానికి ప్రయత్నించడం లాంటిది. విత్తనం వేసి దానికి తెగుళ్ళు

తగలకుండా అనేక జాగ్రత్తలు తీసుకొని నీళ్ళుపెట్టి దాన్ని పెంచి ఆతర్వాత పంట కోయడానికి ప్రయత్నించాలి. అసలు విత్తనమే వేయకపోతే పంట వచ్చే అవకాశమే లేదు. ఈపద్యంలో వేమన చెప్పిన ఉపమానం సరి కొత్తది. ఇలాంటి ఉపమానాలు చెప్పడం వేమనకు మాత్రమే సాధ్యం.

గుణయుతునకు మేలు గోరంత చేసిన
కొండ యగును వాని గుణము చేత
కొండయంత మేలు గుణహీనుడెరుగునా , విశ్వ

మంచివానికి గోరంత మేలు చేసినా అతడు దాన్ని కొండంతగా భావించి, దాన్ని గుర్తుంచుకొని దానికి ప్రత్యుపకారం చేయడానికి ప్రయత్నిస్తాడు. దుర్మార్గునికి కొండంత మేలు చేసినా అతడు దాన్ని గుర్తు ఉంచుకోడు. వేమన ఈపద్యంలో సన్మార్గునికి దుర్మార్గునికి చేసిన మేలులోని తారతమ్యాన్ని చక్కగా వివరించాడు.

ఇలాంటి పద్యాలను చెప్పడం వల్లనే సామాన్య ప్రజలు వేమనను ఎంతగానో అభిమానించారు. తమకు చదువు రాకపోయినా అతను చెప్పిన పద్యాలను నోరారా పాడుకున్నారు, చెప్పుకున్నారు. ప్రజల్లో ఇంతగా కలిసిపోయిన కవి, ప్రజల సుఖం కోసం తపించిన కవి, ప్రజల చేత కీర్తింప బడిన కవి తెలుగు సాహిత్యంలో వేమన తప్ప మరొకరు లేరు. అందువల్లనే ప్రజాకవి అనే మాట తెలుగు దేశంలో వేమనకు తప్ప మరొకరికి వర్తించదు.

ఎంతో మంది సాహిత్యకారులు వేమనను ప్రజాకవిగా కీర్తించారు. విలియమ్ హోవర్డ్ క్యాంబెల్ వేమనను గురించి, "వేమన ఖచ్చితమైన ప్రజాకవి. ఆయన పండితులకుగా వ్రాయలేదు. పల్లెసీమలందలి నిరక్షరాస్యులైన అకృత్రిమ పామరజనము కొరకే వ్రాసినాడు. ఆయన పొందిన లోకప్రియత, ఆయన కవితా శక్తివల్లను, దీనితో బాటు ఆయన ఉపదేశగుణోత్కర్ష వల్ల గూడా కలిగినదనియే చెప్పవలెను"[7] అని చెప్పాడు.

7. వేమన - పాశ్చాత్యులు, తెనుగుసేత - మరుపూరి కోదండరామరెడ్డి, పుట-80



ప్రముఖ పత్రికా సంపాదకులు, హేతువాద సాహిత్య కారులు అయిన నార్ల వెంకటేశ్వర రావు గారు, "ఏప్రమాణాలతో పరిశీలించినా వేమన మహాకవి అన్నది పరమ సత్యం. ప్రజాభిమానాన్ని, ప్రసిద్ధిని బట్టి చూచినప్పుడు ప్రాచీనాంధ్ర కవులందరిలో వేమనను మించిన మేటి కవి లేడు. వేమనకున్న ప్రసిద్ధి ప్రచారాలలో సగం కూడా మధుర కవి అయిన పోతనకు లేవు. ప్రజల్లో పట్టం లేని ప్రభువు ఆయన. అసంఖ్యాక ప్రజానీకంతో , ప్రజల భాషలో మాట్లాడిన ప్రజాకవి వేమన"[8] అని చెప్పారు.

ధీరకవి :-

ధీరుడు అనే మాటకు విద్వాంసుడు, ధైర్యం గలవాడు, స్వాతంత్ర్యం గలవాడు అనే అర్థాలను శబ్దరత్నాకరం చెబుతూ ఉంది. ఈమూడు అర్థాలు వేమనకు వర్తిస్తాయి. వేమన గొప్ప సంఘసంస్కర్త. అతడు సంఘంలో ఉండే దురాచారాలను తీవ్రంగా ఖండించాడు. అలా ఖండించడానికి చాల ధైర్యం కావాలి. ఎందుకంటె నేటి కాలం లాగా వేమన కాలంలో వాక్స్వాతంత్ర్యం లేదు. నేడు కూడా పూర్తిగా ఉందని చెప్పలేం. వేమన కాలంలో అది అసలే లేదు. రాచరిక వ్యవస్థలో రాజు సర్వాధికారి. సాధారణంగా రాజులు బ్రాహ్మణభక్తులు, దాసులు కూడా. ఆనాటి సంఘంలోని మత సంబంధమైన అనేక మూఢాచారాలను, దురాచారాలను నిందించినందుకు వేమనను సంప్రదాయవాదులు తమ రాజుకు చెప్పి అతనికి ఎలాంటి దండనైనా విధింపచేయ గలరు. అది వారికి పెద్ద కష్టం కాదు. ఇదంతా తెలిసి కూడా వేమన ఎలాంటి భయం లేకుండా ధైర్యంతో సాహసంతో హిందూసంఘంలో ఉన్న కులవ్యవస్థను, అంటరానితనాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. మాల మాదిగలను తక్కువగా చూడడాన్ని ఆయన ఖండించాడు. అగ్రజన్ములమని చెప్పుకుంటూ విర్రవీగే వారి దుర్మార్గాలను తన పద్యాల్లో ఎండ గట్టాడు. అంతేగాకుండా యజ్ఞ యాగాల్లో జరిగే హింసను ఖండించి అహింస గొప్పతనాన్ని వివరించాడు. ఈవిధంగా వేమన సంస్కరణ పూర్వకమైన అభిప్రాయాలను తన పద్యాల్లో వ్యక్తం చేయడం ఆనాడు గొప్ప సాహసంగా పరిగణించాలి. ఇది ఏటికి ఎదురీదడం లాంటిది. ఎదురీదడం అందరూ

8. వేమన, వి. ఆర్. నార్ల, పుట- 12

చేయలేరు. సాహసవంతులు ధైర్యవంతులు మాత్రమే చేయగలరు. ఈవిషయంలో వేమన నిస్సందేహంగా గొప్ప ధీరుడు, గొప్ప సాహసవంతుడు అయిన కవి. ఇది అతని విశిష్టతల్లో ఒకటి.

వేమన కులవ్యవస్థకు బద్ధ వ్యతిరేకి. ప్రజలు మాదిగలను అంటరానివారుగా భావించి వారిని దూరంగా ఉంచడాన్ని వేమన సకారణంగా ఇలా ఖండిస్తున్నాడు.

మాదిగ యనగనె మరి తక్కువందురు
మాదిగ యిలసురల మామ గాదె
మాదిగకును బిడ్డ మన యరుంధతి గదా , విశ్వ

మాదిగ కన్య అయిన అరుంధతిని బ్రాహ్మణుడు ఋషిశ్రేష్ఠుడు అయిన వశిష్టుడు వెదకి వెదకి మరీ పెళ్ళి చేసుకున్నాడు. కాబట్టి మాదిగవాడైన అరుంధతి తండ్రి వశిష్ఠునికి మామ అవుతాడు. వశిష్ఠునికి మామ అయితే వశిష్ఠుణ్ణి గొప్పవాడుగా భావిస్తున్న బ్రాహ్మణులందరికీ గూడా అరుంధతి తండ్రి మామ అవుతాడు. అందుకే వేమన మాదిగ ఇలసురల మామ అంటే భూసురుల మామ అని అంటున్నాడు. అందువల్ల మాదిగ వారిని అంటరాని వారిగానూ తక్కువగానూ చూడవద్దని వేమన ప్రజలకు హితబోధ చేశాడు.

మాలవానినేల మహి మీద నిందింప?
నొడల రక్తమాంస మొకటి కాదే?
వానిలోన మెలగు వాని కులంబేది? , విశ్వ

వేమన కాలంలో మాల మాదిగలను ఊర్లోకి రానిచ్చేవారు కాదు. పొరబాటున వారు ఎదురు పడితే సవర్ణహిందువులు వారిని తిట్టేవారు. వేమన దీన్ని తప్పుపడుతూ మాలవారిలోనూ, అగ్రకులస్థులుగా చెప్పబడుతున్న బ్రాహ్మణుల్లోనూ, మిగిలిన కులాల వారిలోనూ ఉన్నది ఒకే రక్తమాంసమనీ, ప్రతిమనిషిలోనూ పరమాత్ముడు ఉంటాడు కాబట్టి మాలవ్యక్తిలో ఉన్న పరమాత్మునిది ఏకులమని నిగ్గదీసి, మాలవారిని అస్పృశ్యులని నిందించ కూడదని ప్రజలకు హితబోధ చేశాడు.

తల్లి యూర్వసి లంజ తనయాలు మాదిగ



తాను విప్రుడనగ తగునె జగతి
తపము చేత ద్విజుడు తర్కింప కులమేది , విశ్వ

బ్రాహ్మణ శ్రేష్ఠుడుగా, ఋషిపుంగవుడుగా ప్రజలందరి చేత పూజింప బడుతున్న వశిష్ఠుని తల్లి దేవవేశ్య అయిన ఊర్వసి. అతని భార్య అరుంధతి మాదిగ కన్య. పుట్టుకను బట్టి గానీ వివాహాన్ని బట్టి గానీ వశిష్ఠుడు బ్రాహ్మణుడు కావడానికి వీలు లేదు. అయితే వశిష్ఠుడు తన పుట్టుక ఎలాంటిదైనా తపస్సు చేసి గొప్ప ఋషి అయి బ్రాహ్మణశ్రేష్ఠుడుగా పూజింప బడుతున్నాడు. దీనికి కారణం తపమే. అందువల్ల కులం ప్రధానం కాదు, గుణమే ప్రధానమని వేమన ప్రజలకు హితబోధ చేశాడు. అందువల్లనే కులవ్యవస్థను సమూలంగా నిర్మూలించాలని వేమన కింది పద్యంలో ఇలా చెప్పాడు.

ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యి బెట్టి తగనమ్మ జెప్పరా , విశ్వ

భూమి మీద ఉన్న ప్రజలందరికీ ఒకే కంచంలో అన్నం పెట్టి కులాన్ని నామరూపాలు లేకుండా నిర్మూలించడమే గాకుండా ప్రతి వ్యక్తి ఇక నుంచి తాను కులాన్ని పాటించను అని తన తల మీద చెయిపెట్టి ప్రమాణం చేయాలని వేమన ప్రజలకు ఉద్బోధించాడు. ఈపద్యంలోని మొదటి పాదంలో "ఉర్వివారి కెల్ల" అని గాకుండా "ఊరివారి కెల్ల" అని వేమనచెప్పి ఉండవచ్చు. ఎందుకంటె ఉర్వివారికెల్ల అంటె భూమి మీద ఉన్న వారికందరికీ అని అర్థం చెప్పవలసి ఉంటుంది. భూమి మీద ఉన్న వారి కందరికీ ఒక్క కంచంలో (ఒక్క బంతిలో) అన్నం పెట్టడం సాధ్యం గాదు. అంతేగాకుండా కులవ్యవస్థ ఉన్నది మన దేశంలోనే. ఇంక ఏదేశంలోనూ కుల వ్యవస్థ లేదు. కులవ్యవస్థ లేని మిగిలిన దేశాల వారితో కులాన్ని పాటించను అని ప్రమాణం చేయించనక్కర లేదు. ఉర్వి అంటే భారత దేశం అని అర్థం చెప్పుకున్నా భారత దేశంలోని ప్రజలందరికీ బంతి భోజనం పెట్టడం, భారతప్రజలందరి చేత కులాన్ని పాటించను అని ప్రమాణం చేయించడం కూడా కష్టసాధ్యమే. ఊర్లో అన్ని కులాల వారు ఉంటారు. వారందరికి ఒకే బంతి భోజనం పెట్టడం,

వారందరి చేత కులం పాటించను అని ప్రమాణం చేయించడం సాధ్యమే. అందువల్ల అది ఊరివారి కెల్ల అని వేమన రాసి ఉంటాడు.

హింస జేయకుంటయే యిల ముఖ్య ధర్మంబు
యనక హింస జేతురవని సురలు ( జనులు )
చావు పసిని దినెడు చండాలుడె మేలు , విశ్వ

భూమి మీద అన్ని ముఖ్య ధర్మాల్లో గొప్పది, ముఖ్యమైంది అహింస. బ్రాహ్మణులు యజ్ఞయాగాల సందర్భంలోనూ, క్షత్రియ వైశ్య శూద్రులు తినడం కోసమూ జంతువులను చంపుతూ గొప్ప హింస చేస్తూ ఉన్నారు. బ్రతికిన జంతువును చంపి తినడం హింస అవుతుంది. చనిపోయిన జంతువును తినడం హింస కాదు. ఈవిధంగా చూస్తే చనిపోయిన జంతువును తినే మాల మాదిగలే మిగిలిన కులాల వారి కంటె గొప్ప అహింసా పరులు అని వేమన చెబుతున్నాడు. దీన్ని బట్టి వేమన గొప్ప అహింసా వాది అని అర్థమౌతుంది.

జీవి జీవి జంప శివుని జంపుటె యగు
జీవుడరసి తెలియ శివుడు కాడె
భావమందు వేగ బరికించి చూడుము , విశ్వ

వేమన సిద్ధాంతం ప్రకారం అన్ని జీవుల్లోనూ శివుడు (దేవుడు ) ఉన్నాడు. కాబట్టి ఒక జీవి ఏకారణం చేతనైనా మరొక జీవిని చంపితే అది దేవుణ్ణి చంపినట్లే అవుతుంది. దేవుణ్ణి చంపడం మహా పాపం కాబట్టి ఏజీవిని చంపగూడదని వేమన ప్రజలకు హితబోధ చేశాడు.

జీవి జీవి జంపి జీవికి పెట్టంగ
జీవి తాన బలిసి తిరుగుచుండు
జీవహింసలకును జిక్కునా మోక్షంబు , విశ్వ

ఒక జీవిని చంపి దాని మాంసాన్ని మరొక జీవికి పెట్టడం వల్ల మాంసం తిన్న జీవి బలిసి తిరుగుతూ ఉంటుంది. అయితే అలా జీవిని చంపే వారు , తినే వారు గొప్ప పాపం మూట కట్టు కుంటున్నారు. అలాంటి పాపులకు మోక్షం లభించదు.



వేమన బ్రాహ్మణులను, రాజులను, వైశ్యులను నిందించాడు. దీనికి కారణం వారు ఆనాటి ప్రజలను మోసం చేయడమే. బ్రాహ్మణులు యజ్ఞయాగాలు, పౌరోహిత్యం మొదలైన వాటితో ప్రజలను మోసం చేస్తుంటే, రాజులు ప్రజల కష్టాలను పట్టించుకోకుండా తమ సుఖాలను మాత్రమే పరమార్థంగా భావించి దుర్మార్గంగా ప్రజాకంటకులుగా పాలించారు. వైశ్యులు వ్యాపారం పేరుతో ప్రజలను అనేక రకాలుగా మోసం చేసేవారు. అందువల్లనే వేమన ఆవర్గాల వారిని విమర్శించాడు.

వేమన బ్రాహ్మణులు చేసే యజ్ఞయాగాలను, ఆసందర్భంగా వారు చేసే జీవహింసను, వారి ఆధిక్యాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు.

పేరు సోమయాజి పెను సింహ బలుడాయె
మేకపోతును బట్టి మెడను విరవ
గాక క్రతువు వలన గలుగునా మోక్షంబు , విశ్వ

వేమన కాలంలో యజ్ఞం చేసే సందర్భంలో యజ్ఞం చేసే బ్రాహ్మణుడు మేకపోతును పట్టుకొని చేతితో దాని మెడను విరిచి చంపేవాడని పై పద్యాన్ని బట్టి తెలుస్తూ ఉంది. ఈపని చేయడానికి చాల బలం కావాలి. అందువల్లనే వేమన పేరు సోమయాజి పెనుసింహబలుడు అని అంటున్నాడు. మోక్షం కలుగుతుందనే నమ్మకంతో బ్రాహ్మణులు యజ్ఞాలు చేసేవారు. వేమన ఈనమ్మకాన్ని ఖండిస్తూ యజ్ఞం చేయడం వల్ల ఎలాంటి ఫలితం ఉండదని, కాకపోతే మేకపోతును చేతితో విరిచి చంపడం వల్ల సోమయాజి సింహబలుడుగా తయారౌతాడని గేళి చేస్తున్నాడు. ఈనాడు గ్రామదేవతల పండుగ సందర్భంలో కొన్ని శూద్రకులాల వారు గ్రామదేవతకు బలి ఇచ్చే గొర్రె, మేక లాంటి జంతువుల మెడను నోటితో కొరికి చంపడం చేస్తారు. దీన్ని గావు పట్టడం అంటారు. ఈ ఆచారాన్ని శూద్రకులాల వారు వేమన చెప్పిన సోమయాజులను చూసి అలవరచుకొని ఉండవచ్చు.

మరణించిన తర్వాత స్వర్గానికి వెళ్ళి అక్కడ రంభ మొదలైన దేవవేశ్యలతో సుఖంచవచ్చు ననే నమ్మకంతో బ్రాహ్మణులు యజ్ఞాలు చేసేవారు. ఈనమ్మకాన్ని వేమన

ఇలా తిడుతున్నాడు.

తల్లితో రమించె తండ్రి యజ్ఞము జేసి
తనయుడట్లె రంభ దనర గూడె
తల్లిని రమియింత్రు దబ్బర విప్రులు , విశ్వ

తండ్రి యజ్ఞం చేసి చనిపోయిన తర్వాత స్వర్గానికి వెళ్ళి రంభను కూడతాడు. అతని కొడుకు కూడా యజ్ఞం చేసి చనిపోయిన తర్వాత స్వర్గానికి వెళ్ళి రంభను కూడితే అది తల్లిని సంభోగించినట్లు అవుతుంది గదా అని వేమన ప్రశ్నించి దబ్బర విప్రులు అంటే మోసగాండ్రైన విప్రులు తల్లిని రమిస్తారు అని బ్రాహ్మణులను తిట్టాడు.

ఆలి రంకు దెలుప నఖిల యజ్ఞంబులు
తల్లి రంకు దెలుప తద్దినములు
కాని తెరువు కర్మకాండ కల్పిత మాయె

పై పద్యంలో యజ్ఞాలు ఆలి రంకును, తద్దినాలు తల్లి రంకును తెల్పుతూ నీచమైన కర్మకాండను కల్పించాయని వేమన చెప్పాడు. "కొన్ని యజ్ఞాల్లో యజమానురాలు అంటే యజ్ఞం చేసే వాని భార్య పురోహితునితో సంభోగించ వలసి ఉంటుంది. మరికొన్ని యజ్ఞాల్లో యజమానురాలు తాను ఎంత మందితో శారీరక సంబంధాన్ని కలిగి ఉందో అన్ని దర్భపోచలను ఉంచి నిజాన్ని అంగీకరించి పరిశుద్ధురాలై యజ్ఞంలో పాల్గొనవలసి ఉంటుంది"[9]. అశ్వమేధయాగం చేసే విధానాన్ని గురించి శ్రీనాధుడు తన శృంగార నైషధంలో చెప్పిన విధానం ఎంత అసహ్యమైనదో చెప్పలేం.

యజమాన ప్రమదావికస్వర భగన్యస్తాశ్వ దీర్ఘ స్మర
ధ్వజదండంబగు నశ్వమేధ మఖతంత్రంబు న్నిరీక్షించి,
యిక్కుజనుండొత్తిలి నవ్వె వేదవిధులం

(శృంగారనైషధం, 7వ ఆ. 133 వ. పద్యం)

9.విశ్వదాభిరామ వినురవేమ, త్రిపురనేని వెంకటేశ్వరరావు, పుట - XXXVI



అశ్వమేధయాగాన్ని రాజులు చేస్తారు. అశ్వమేధయాగం చేసేటప్పుడు యజమానురాలు అంటే యజ్ఞం చేస్తున్న వాని భార్య తన యోనిలో యాగాశ్వం లింగాన్ని పెట్టుకోవాలని పై శ్రీనాధుని పద్యాన్ని బట్టి తెలుస్తుంది. "పౌండరీకం అనే యజ్ఞం చెప్పరానంత పచ్చిబూతు, హీనం"[10]. యజ్ఞకార్యాల్లో ఇంత అసహ్యమైన చర్య ఉండడం వల్లనే వేమన యజ్ఞాలను తీవ్రంగా వ్యతిరేకించాడు. ఈయజ్ఞాల్లో బాగా లాభాన్ని పొందేవాళ్ళు బ్రాహ్మణులు. అందువల్లనే వారు యజ్ఞాలను బాగా ప్రోత్సహించేవారు.

రెండవ పాదంలో తద్దినాలు తల్లి రంకును తెలియజేస్తాయన్నది. "తద్దిన మంత్రాల్లో చెప్పే కింది రెండు మంత్రాలు ఈవిషయాన్ని తెలియజేస్తాయి"[11].

1వ మంత్రమ్. యన్మే మాతా ప్రలులోభ చరతి అననుప్రతా
తన్మే రేత: పితా వృంక్తాం మా భూ రన్యోవపద్యతామ్.

నాతల్లి నాతండ్రి యందు అననుకూల, అనుప్రత కాకుండా ప్రలోభం చేత పొందిన అన్యపురుషుని రేతస్సును నాతల్లి భర్త అయిన నాతండ్రి తన రేతస్సుగా అంగీకరించుగాక. నేను ఇచ్చే తర్పణలను తనవిగా స్వీకరించడానికి వచ్చే ఆ అన్యపురుషునికి చెందకుండు గాక.

2వ మంత్రమ్. యా తిష్ఠన్తి యా ధావన్తి యా ఆర్ద్రోఘ్నీ: స్వధీ :
అద్భిర్విశ్వస్య భర్తీ భిరన్తస్య మ్ పితుర్దధే.

నిలకడ కలిగినవి, పరుగెత్తగలిగినవి, తడిసి తేమతో ఉండి అన్నింటినీ నశింపజేయ గలవి, సర్వవిశ్వాన్ని భరించేటటువంటి ఈ తర్పణజలం నాతల్లి భర్త కాని ఆఅన్యపురుషుని అడ్డగించి ఆవలకు పంపించుగాక.

మానవ జీవిత పరిణామంలో వివాహ వ్యవస్థ ఏర్పడని కాలంలో స్త్రీలకు లైంగిక విషయంలో సంపూర్ణమైన స్వేచ్ఛ ఉండేది. వివాహ వ్యవస్థ ఏర్పడిన మొదటి దశలో కూడా

10.విశ్వదాభిరామ వినురవేమ, త్రిపురనేని వెంకటేశ్వరరావు, పుట - XXXVI

11. లోకకవి వేమనయోగి, మరుపూరు కోదండరామ రెడ్డి, పుట - 103

స్త్రీలకు తమకు ఇష్టమైన మగవారితో సంభోగించే అవకాశం ఉండేది. ఇప్పటికీ తమిళనాడు రాష్ట్రంలోని నీలగిరి ప్రాంతాంలో నివసించే కురుంబ అనే ఆటవిక సమాజంలోని స్త్రీలకు పరపురుషులతో సంగమించే స్వేచ్ఛ ఉన్నట్లుగా తెలుస్తుంది. “Thurston says about marriage among the Kurumbas. I am informed that, among the kurumbas of the Neelgiris it is the custom for several brothers to take one wife in common (adelphogany) and that they do not object to their women being open to others also”[12] స్త్రీలకు సంభోగం విషయంలో స్వేచ్ఛ ఉన్న దశలో ఏర్పడిన మంత్రాలు పైరెండు. వేమన కాలం నాటికి స్త్రీలకు భర్తతో తప్ప ఇతర పురుషులతో సంభోగించే స్వేచ్ఛ లేదు. అయినప్పటికీ వేమన కాలంలోని తద్దిన మంత్రాల్లో పై రెండు మంత్రాలు చెప్పబడేవని "ఆలిరంకు దెలుప" అనే పై వేమన పద్యం వల్ల తెలుస్తుంది.

వడుగు ద్విజుల కెల్ల కడు ముఖ్యమందురు
వడుగు జేసెదమని వదరుచుంద్రు
కడుగు ద్రావి కాకి కర్రుకర్రన్నట్లు , విశ్వ

బ్రాహ్మణులను ద్విజులు అంటారు. అంటే రెండు జన్మలు కలవారు అని అర్థం. బ్రాహ్మణ బాలునికి నిర్ణీత వయసులో ఉపనయనం చేసి జందెం వేస్తారు. దీన్ని వడుగు అంటారు.ఈ ఉపనయనానికి ముందు ఒక జన్మ. అది అయిన తర్వాత ఇంకొక జన్మ. ఈద్విజన్మ పద్ధతిని వేమన గేలి చేస్తున్నాడు. బ్రాహ్మణుడుగా పుట్టినవాడికి వడుగు చేయడం చాల ముఖ్యమని చెప్పి బ్రాహ్మణ బాలునికి వడుగు చేసి, మేము వడుగు చేశామని చేసిన వారు, నేను వడుగు చేయించుకున్నాని చేయించుకున్న వారు గొప్పలు చెప్పుకుంటూ ఉంటారు. అలా చెప్పుకోవడాన్ని వేమన వదరుగా అంటే వాగుడుగా చెబుతున్నాడు. ఆవాగుడు ఎలా ఉందంటే కడుగు నీళ్ళు తాగిన కాకి కొంత జీర గొంతుతో కర్‌కర్ అని అరచినట్లుగా

12. Caste, Tribe&Culture of India, vol- 1, Bahadur. J.P. page – 66



ఉంటుందట. ద్విజుడు అంటే పక్షి అని కూడా అర్థం ఉంది. పక్షికి రెండు జన్మలు ఉన్నాయి. గుడ్డుగా ఉన్నప్పుడు ఒక జన్మ. గుడ్డు నుంచి బైటకు వచ్చిన తర్వాత ఇంకొక జన్మ. ఈలెక్కన ద్విజ అనే మాట పక్షికి బాగా వర్తిస్తుంది. ఎందుకంటె గుడ్డులో ఉన్న దానికి గుడ్డు నుంచి బైటకు వచ్చిన దానికి చాల తేడా ఉంది. కానీ వడుగు చేయించుకోవడానికి ముందు చేయించుకున్న తర్వాత బ్రాహ్మణునికి తేడా ఏమీ లేదు. అందువల్ల ద్విజుడు అనే మాట గొప్ప కోసం చెప్పుకున్నదే.

బ్రాహ్మణులే కాకుండా క్షత్రియులు, వైశ్యులు కూడా వివాహం సమయంలో వడుగు చేయించుకొని జందెం ధరిస్తారు. అయితే వీరికి ద్విజులు అనే మాట ప్రసిద్ధిలో లేదు.

బ్రాహ్మణులు తాము అగ్రజన్ములమని, తమకు దానం చేసిన వారికి గొప్ప పుణ్యం కలుగుతుందని తమను గురించి అనేక పురాణాల్లో రాసుకున్నారు. వేమన దీన్ని ఖండిస్తూ బ్రాహ్మణులు మిగిలిన అన్ని జీవుల వంటి వారే గానీ, వారిలో గొప్ప ఏమీ లేదని కింది పద్యంలో చెబుతున్నాడు.

బ్రాహ్మణులకు బెట్ట ఫలము గల్దని యంద్రు
కుక్కలకును బెట్ట కొదవ యేమి
ఇందు నందు జీవుడొక్కడె యందురు , విశ్వ

అగ్రజన్ములుగా చెప్పుకునే బ్రాహ్మణుల్లోనూ హీనంగా చూడబడే కుక్కల్లోనూ ఉన్నది ఒక్కటే జీవుడే. మరి ఆలాంటప్పుడు బ్రాహ్మణులకు భిక్షం పెడితే పుణ్యం వస్తుందని చెప్పినప్పుడు కుక్కలకు పెట్టినా పుణ్యం రావాలి కదా అని వేమన ప్రశ్నించి, భగవంతుడు సృష్టించిన జీవులందరూ సమానులేనని వేమన జీవసమాన ధర్మాన్ని చెబుతున్నాడు.

బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు
గౌరవింప వచ్చు కలయ వచ్చు
జ్ఞాన మొసగి జనుల గడతేర్చునటులైన , విశ్వ

బ్రాహ్మణులు పంచాంగం చెప్పడం, ముహూర్తాలు పెట్టడం, ప్రాయశ్చిత్తాలు చేయించడం,

యజ్ఞయాగాలు చేయించడం మొదలైన మోసపూరితమైన పనులు కాకుండా ప్రజలకు కుల వివక్షణ లేకుండా చదువు చెప్పి నిజమైన జ్ఞానాన్ని కలిగించి ప్రజలను చైతన్యవంతులను చేస్తే అలాంటి బ్రాహ్మణులకు సకల భాగ్యాలు ఇవ్వవచ్చునని, వారిని గౌరవించ వచ్చునని వేమన చెప్పాడు.

ఎంత సేవజేసి ఏపాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోడి పొందు పదివేల కైనను , విశ్వ

రాజులు పాముల వంటి వారు. పాముకు పాలు పోసి ఎంత ప్రేమగా పెంచినప్పటికీ దానికి కృతజ్ఞత ఉండదు. ఏమరుపాటుగా ఉన్నప్పుడు ఎప్పుడో ఒకసారి అది కాటు వేస్తుంది. రాజులకు మనం ఎంత సేవ జేసి విశ్వాసపాత్రులుగా ఉన్నప్పటికీ వారిని నమ్మగూడదు. అందువల్లనే వేమన మరొక పద్యంలో "చంపదలచు రాజు చనవిచ్చు చుండురా" అని చెప్పాడు.

వైశ్యజనుల మనెడి వార్త మాత్రమె గాని
దొంగలింత కంటె దొరక బోరు
నేలమీద వీరి నేర్పుల నేమందు , విశ్వ

ఇక్కడ వార్త అంటె వృత్తి అని అర్థం. గతంలో గ్రామాల్లోనూ పట్నాల్లోనూ వ్యాపారం మొత్తం వైశ్యులే చేసేవారు. వ్యాపారం అనగానే మోసం ఉంటుంది. అందువల్లనే వేమన వైశ్యులు భూమి మీద అందరి కంటె దొంగలని, వీరు ప్రజలను అనేక రకాలుగా మోసం చేస్తుంటారని చెప్పాడు.

చెడును విమర్శించడంలో వేమనకు ఎలాంటి పక్షపాతం లేదు. వేమన అన్ని మతాల్లో ఉన్న చెడును ఖండించాడు గానీ మతాన్ని ఖండించ లేదు. అతడు నాస్తికుడు కాదు. ఆస్తికుడే. అతను కొంతవరకు శైవం వైపు మొగ్గు చూపించినట్లుగా తెలుస్తుంది. దానికి కారణం శైవంలో కులవివక్షణ లేకపోవడం కావచ్చు. తాను శైవమతాభిమాని అని వేమన శైవంలోని చెడును నిరసించకుండా ఉండలేదు.



ఆర్మతములకన్న నధికమైన మతము
లింగమతము కన్న లేదు జగతి
లింగధారి కన్న దొంగలు లేరయా , విశ్వ

వేమన కాలం నాడు శైవం, వైష్ణవం, శాక్తేయం, గాణాపత్యం, సౌరం, కాపాలం అనే ఆరు మతాలు ప్రసిద్ధంగా ఉన్నాయి. ఆ ఆరింటిలో శైవం గొప్పదని చెబుతూనే ఆమతస్థులైన లింగదార్ల కంటె దొంగలు లేరని వేమన శైవులను విమర్శించాడు. మతం, భక్తి మొదలైన ఆధ్యాత్మికమైనవన్నీ మనసుకు సంబంధించినవే గానీ అవి బాహిరమైనవి కాదని, శైవులు శివలింగాలు ధరించడం. వైష్ణవులు నామాలు పెట్టుకోవడం, మహమ్మదీయులు గడ్డాలు పెంచుకోవడం మొదలైనవి చేయడం వట్టి వేషాలే కానీ మరొకటి కాదని అలాంటి వారిని నమ్మగూడదని వేమన ఉద్దేశ్యం.

రాతి బసవని గని రంగుగా మ్రొక్కుచు
గుసుకు బసవని గని గుద్దుచుంద్రు
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ , విశ్వ

శివభక్తులు శివుని వాహనమైన బసవని దేవుడుగా కొలుస్తారు. వీరు రాతి రూపంలో ఉన్న బసవదేవుణ్ణి పూజిస్తూ, బసవని అవతారమైన ఎద్దును బండికి, మిగిలిన వ్యవసాయ పనులకు కట్టి దాన్ని కొట్టి, గుద్ది హింసిస్తూ ఉంటారు. అందువల్లనే వేమన వారిని పాపులు అని తిడుతున్నాడు.

వేమన ఈవిధంగా హిందూ మతంలో ఉన్న దురాచారాలను, కులవ్యవస్థను, యజ్ఞయాగాల్లోని బండారాన్ని, బ్రాహ్మణుల స్వార్థ గుణాన్ని మొదలైన ఎన్నో చెడ్డ విషయాలను నిర్భయంగా, నిస్సంకోచంగా విమర్శించాడు. ఇంతగా తమ మతాన్ని విమర్శించిన వేమనను ఆనాటి సంప్రదాయవాదులు ఏమీ చేయకుండా వదలి వేయడం ఆశ్చర్యమే. వేమనకు ప్రజల్లో ఉన్న ఆదరణను చూచి గానీ, లేక పిచ్చివాడు ఏదో వాగుతున్నాడులే అనే నిర్లక్ష్యం వల్ల గానీ వారు ఆయనను ఏమీ చేయకుండా వదలివేసి ఉండవచ్చు.

యోగకవి :-

తెలుగు సాహిత్యంలో కవిరాజులు, రాజకవులు చాల మంది ఉన్నారు. కానీ యోగ కవి మాత్రం వేమన ఒక్కడే ఉన్నాడు. యోగకవి అంటే యోగి అయిన కవి. సాధారణంగా యోగులు మాట్లాడరు. వారు ప్రజలకు దూరంగా ఏహిమాలయాల్లోనో అడవుల్లోనో ముక్కు మూసుకొని ప్రశాంతంగా తపస్సు చేసుకుంటూ ఉంటారు. వీరు సామాన్య ప్రజల కష్టసుఖాలను గురించి పట్టించుకోరు. కానీ వేమన అలాంటి యోగి కాదు. ప్రజల మధ్య తిరుగుతూ ప్రజల కష్టసుఖాలను గమనిస్తూ ప్రజల సంక్షేమాన్ని కోరి ప్రజల భాషలో ప్రజలను బాగుపడుమని తిడుతూ కవిత్వం చెప్పినవాడు. వేమన మామూలు యోగాసనాలు వేసే యోగి కాదు. సిద్ధి పొందిన యోగి. బ్రహ్మజ్ఞానం తెలిసిన యోగి. భగవంతుడు ఎక్కడో పుణ్యక్షేత్రాల్లోనూ, గుళ్ళలో ఉన్న శిలల్లోనూ లేడని, ప్రతి జీవిలోనూ దేవుడున్నాడని భావించి జీవులన్నింటిలోనూ దేవుణ్ణి దర్శించిన మహాయోగి. మానవుడు అహంకారాన్ని వదలిపెట్టి కోరికలను జయించి మనసు మీద దృష్టి కేంద్రీకరించి తనలో ఉన్న భగవంతుని దర్శించాలనేది వేమన యోగసిద్ధాంతం.అనుభవంద్వారా తాను సంపాదించుకున్న ఈ యోగ సిద్ధాంతసారాన్ని తన పద్యాల ద్వారా ప్రజలందరికీ అర్థమయ్యేలాగా సులభమైన మాటల్లో చెప్పిన గొప్ప పుణ్యమూర్తి వేమన. ఈవిషయాన్ని అతను చెప్పిన కింది పద్యాలు స్పష్టం చేస్తున్నాయి.

మనసులోని వాని మానుగా దెలిసిన
నుర్విజనులు వాని యోగి యండ్రు
నీవు నిన్నెరుంగ నీవెపో శివుడవు , విశ్వ

ప్రతి జీవి హృదయంలోనూ దేవుడున్నాడు. అలా తనలో ఉన్న పరమాత్మని తెలుసుకుంటే అతడు దేవుడే. అలా తనలో ఉన్న పరమాత్మతత్వాన్ని బాగా గ్రహించిన వాణ్ణి ప్రజలు యోగి అని గౌరవిస్తారు.

పెక్కు చదువులేల పెక్కు వాదము లేల
నొక్క మనసుతోటి నుండెనేని



సర్వసిద్ధుడగుచు సర్వంబు తానగు , విశ్వ

యోగి కావడానికి, సిద్ధి పొందడానికి చాల చదువులు చదవ వలసినపని లేదు. అనేక రకాల వాదాలు చేయవలసిన అవసరం లేదు. మనసు కోతి లాంటిది. అది గొప్ప చంచలమైనది కావడం చేత పరిపరి విధాలుగా పరుగెడుతూ ఉంటుంది. అలా పరుగెత్తకుండా మనసును కట్టిపడేసి ఒకే విషయంలో కేంద్రీకరింప జేస్తే అతడు సర్వసిద్ధులను పొందగలడు. సర్వమూ తానైన భగవంతుడు కాగలడు.

ఆత్మలోన శివుని ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుడౌను సర్వంబు దానౌను , విశ్వ

మనస్సును కేంద్రీకరించి ఆత్మలో ఉన్న శివుని వెదకి పట్టుకొని అతని మీద నిశ్చలమైన భక్తి నిలిపితే మానవుడు ఈభవబంధాల నుంచి విముక్తుడై మోక్షాన్ని పొంది సర్వత్రా వ్యాపించినట్టి భగవంతునిలో ఐక్యమౌతాడు. వేమన ముక్తిని పొందే మార్గాన్ని ఇలా చాల సులభమైనదిగా చెప్పాడు. కానీ దాన్ని ఆచరించడం అంత సులభం కాదు. కానీ ప్రయత్నిస్తే అది అసాధ్యం కాదు. కాకపోతే కష్టసాధ్యం. దాని కోసం మనిషి ఏమి చేయాలో వేమన కింది పద్యంలో వివరిస్తున్నాడు.

ఆశ గోసివేసి యనలంబు చల్లార్చి
గోచి బిగియగట్టి కోపమడచి
యాశ విడిచెనేని యతడు దాయోగిరా , విశ్వ

మానవుని చెడ్డవానిగా చేసేవి ఆశ, ఆకలి, కోపం. అందువల్ల వేమన ఈమూడింటినీ అణచివేస్తే అతడు యోగి అయినట్లేనని చెప్పాడు. అన్ని అనర్థాలకు మూలం ఆశ. మనిషి అందంగా ఉన్న ప్రతి దాన్ని తనకు కావాలని కోరుకోవడం వల్లనే ఎన్నో సమస్యలు వస్తున్నాయి. ఎన్నో యుద్ధాలు జరిగాయి. అందువల్ల వేమన ముందు ఆశను కోసివేయాలని చెప్పాడు. తర్వాతది ఆకలి. కూటి కోసమే కోటి విద్యలన్నట్లుగా మానవుడు ఆకలి తీర్చుకోవడానికే అనేక రకాలైన దుర్మార్గాలు చేస్తున్నాడు. అందువల్ల ఆకలి అనే అగ్నిని

చల్లార్చాలి. దాన్ని చల్లబరిచితే మనిషి దుర్మార్గం చేయడు. మనిషి అహింసా మార్గంలో తనకు అందుబాటులో ఉన్న ఆహారాన్ని పరిమితంగా తీసుకుంటూ ఆకలిని మెల్లమెల్లగా తగ్గించు కోవాలి. మూడవది కోపం. ఇది కూడా ఒక రకమైన అగ్నే. అందువల్లనే మనవారు దీన్ని కోపానలం అన్నారు. మనిషి దీన్ని గూడా పూర్తిగా అణచి వేస్తే అతడు నిస్సందేహంగా యోగి అయినట్లే. అలా మూడింటినీ అణచి వేసిన వ్యక్తి ముక్తిని పొందుతాడు.

మననవృత్తిలోని మహిమ నెరుంగుచు
మనసు నందె పూజ మహిమ గనుచు
మానకుండు వాడె మర్మజ్ఞుడగు యోగి , విశ్వ

మననం అంటే భగవంతుని నామాన్ని ఏకాగ్రతగా ఎల్లప్పుడు చింతన చేయడం. ఈమననవృత్తికి చాల మహిమ ఉంది. ఈవిషయాన్ని గ్రహించి భగవంతుని, అతని నామాన్ని ఎల్లప్పుడూ తన మనస్సులో మననం చేసేవాడే నిగూఢమైన తత్వాన్ని తెలిసిన నిజమైన యోగి.

పగలు రేయి మరచి భావంబు మరచియు
తాను నేననియెడి తలపు మరచి
యుండువాడె యెంచ నుత్తమ యోగిరా , విశ్వ

పగలు రాత్రి అనే భేదాన్ని మరచిపోయి, తన్ను తాను మరచిపోయి ఎల్లప్పుడూ భగవంతుని తన మనస్సులో మననం చేసేవాడే ఉత్తముడైన యోగి.

ఇల్లు విడిచినట్లె ఇల్లాలు మది రోసి
తల్లడంబు మాని తలపు నిలిపి
ఒడలు మరచి యోగముల్లసిల్లెడు నట్టి
వాడె పరమ గురుడు వసుధ వేమ

ఇంటిని విడిచిపెట్టి, ఇల్లాలిని మీద రోత పెంచుకొని, చంచలమైన మనస్సును కట్టివేసి భగవంతుని మీదనే దృష్టి నిలిపి శరీరాన్ని మరచిపోయి, తదేకధ్యానం ద్వారా పరబ్రహ్మను తెలుసుకున్న వాడే పరమగురువు.



ఈవిధంగా వేమన యోగాన్ని గురించి, యోగి తత్వాన్ని గురించి సులభమైన మాటల్లో చెప్పాడు.

<u>భావవిప్లవ కవి</u> :-

తెలుగు సాహిత్యంలో వేమన మొట్టమొదటి భావవిప్లవ కవి. భావవిప్లవం అనేది ఆదునిక కాలంలో ప్రచారంలోకి వచ్చిన మాట. విప్లవం అనే పదాన్ని ఆంగ్లంలో Revolution అనే మాటకు సమానార్థంగా తెలుగులో ఉపయోగిస్తున్నాం. Revolution అనే మాటకు Oxford English Dictionary ఇచ్చిన కొన్ని అర్థాల్లో A dramatic and widereaching change అనే అర్థం సాహిత్య పరంగా కొంతవరకు తగినదిగా ఉంది. దీని కంటె American College Dictonary ఇచ్చిన A complete or marked change in something అనే అర్థం సాహిత్యపరంగా మరింత అర్థవంతంగా ఉంది. దీని ప్రకారం విప్లవం అంటే ఏదైనా ఒక విషయంలో అంతకు ముందు ఉన్న దానికంటే పరిపూర్ణమైన మార్పు ఉంటే దాన్ని విప్లవం అనవచ్చు. సాహిత్య పరంగా భావ విప్లవం అంటే ఏదైన ఒక విషయం మీద అప్పటి వరకూ ఉన్న సాంప్రదాయిక భావాలను తోసివేసి దానికి పూర్తిగా భిన్నమైన భావాలను చెప్పడం. వేమన హిందూ సంఘంలో సంప్రదాయంగా వస్తున్న చాల విషయాలను నిర్ద్వంద్వంగా ఖండించాడు. కొన్ని చోట్ల సంప్రదాయాన్ని ఖండించడంతో పాటు దానికి భిన్నమైన భావాలను కూడా చెప్పాడు. ఇదంతా భావవిప్లవం కిందికి వస్తుంది. అందువల్లనే వేమన తెలుగు సాహిత్యంలో మొదటి భావవిప్లవ కవి అవుతున్నాడు.

హిందూసంఘంలో కులవ్యవస్థ, అస్పృశ్యత, విగ్రహారాధన, యజ్ఞయాగాలు చేయడం, వివాహాది శుభకార్యాలకు సుముహూర్త నిర్ణయం, బ్రాహ్మణులను అగ్రజన్ములుగా పూజించడం, బ్రాహ్మణులు వడుగు చేయించుకోవడం, పంచాంగాలు చెప్పడం, పౌరోహిత్యం చేయడం మొదలైనవన్నీ సంప్రదాయంగా వస్తున్నాయి. వేమన వీటన్నింటినీ తీవ్రంగా ఖండించాడు. ఈఖండన గురించి ప్రజాకవి, ధీరకవి శీర్షికల కింద చెప్పడం జరిగింది.ఈఖండనంతా భావవిప్లవం కిందికే వస్తుంది.

బ్రాహ్మణులు తమను గురించి భూసురులు, ద్విజులు అని గొప్పగా చెప్పుకొని తాము మిగిలిన కులాల వారికంటె గొప్పవారమని, తమకు దానం చేసి తమ చేత ఆశీర్వదింప బడితే అలాంటి వారికి గొప్ప పుణ్యం వస్తుందని అనేక పురాణాల్లో చెప్పుకున్నారు. అది నమ్మి అజ్ఞానులైన ప్రజలు వారికి యధాశక్తి దానధర్మాలు చేయడం సంప్రదాయంగా వస్తూ ఉంది. దీన్ని వేమన ఇలా విమర్శించాడు.

మలము మూత్రము విడు మహిలోని ద్విజులకు
బిచ్చమిడెడు కటిక పీనుగులెల్ల
పరగ నేడ్చుచట్టె పాములై పుడుదురు , విశ్వ

సురులకు ఆకలిదప్పికలు, మలమూత్ర విసర్జనలు ఉండవు. భూసురులగా చెప్పుకునే బ్రాహ్మణులు మిగిలిన కులాల వారిలాగానే ఆహారాన్ని తినడం, మలమూత్ర విసర్గన చేయడం మొదలైనవి చేస్తూ ఉన్నారు. మిగిలిన కులాల వారికి బ్రాహ్మణులకు తేడా ఏమీ లేదు. అందువల్ల బ్రాహ్మణులు మిగిలిన వారి కంటె గొప్పవారు కాదు. ప్రత్యేకంగా వారికి దానం చేయవలసిన అవసరం లేదు. ఇది గ్రహించకుండా బ్రాహ్మణులకు దానం చేసేవారు మరుజన్మలో పాములై పుడతారు అని వేమన చెబుతున్నాడు. ఎందుకంటె దానం పాత్రులకే అంటే బీదవారకి, కష్టాల్లో ఉన్నవారికి మాత్రమే చేయాలి. అపాత్రతా దానం పాపం. బ్రాహ్మణులు బీదవారు కాదు. అందువల్ల దానం స్వీకరించడానికి పాత్రులు కాదు. సమాజంలో వారి కంటె గర్భదరిద్రులు ఎంతో మంది ఉన్నారు. వీరిని వదలి వేసి బ్రాహ్మణులకు దానం చేసే వారికి పాపం చుట్టుకొని మరుజన్మలో పాములుగా పుడతారని వేమన హేతుబద్ధంగా సంప్రదాయానికి భిన్నంగా చెప్పాడు.

హిందూమతంలో అడవులకు వెళ్ళి అక్కడ దొరికే ఆకులు అలుములు తింటూ తపస్సు చేయడం వల్ల మోక్షాన్ని పొందవచ్చుననే నమ్మకం సంప్రదాయంగా వస్తూ ఉంది. దీన్ని నమ్మి కొందరు మోక్షాన్ని ఆశించి అడవులకు వెళ్ళి ఆకులు అలుములు తింటూ తపస్సు చేస్తూ ఉంటారు. వేమన దీన్ని ఖండిస్తూ ఇలా చెప్పాడు.

ఆకులెల్ల దిన్న మేకపోతుల కెల్ల



కాకపోయెనయ్య కాయసిద్ధి
లోకులెల్ల వెర్రిపోకిళ్ళు పోదురు , విశ్వ

అడవుల్లో ఆకులు తింటే మోక్షం వస్తుందనుకుంటే మరి పుట్టినప్పటి నుంచి అడవుల్లో తిరుగుతూ ఆకులు అలుములూ తింటున్న మేకలకు కాయసిద్ధి ఎందుకు కాలేదు? అని ప్రశ్నించి లోకులు వెర్రివాళ్ళని, బ్రహ్మణులు ఏది చెబితే దాన్ని గుడ్డిగా నమ్మి మూర్ఖులై చెడిపోతున్నారని వేమన విమర్శించాడు.

రామాయణ, భారతాలు గొప్ప గ్రంథాలని, అవి గొప్ప ఇతిహాసాలని, హిందువులకు అవి పరమ పవిత్రమైనవనే నమ్మకం సంప్రదాయంగా వస్తూ ఉంది. అంతేగాకుండా విష్ణువు దశావతారాలు ఎత్తాడని అందులో రామావతారం ఒకటని, రాముడు చాల గొప్పదేవుడని భావించి ఊరూరా రామాలయాలు కట్టించి పూజలు చేయడం అనాదిగా వస్తున్న ఆచారం. వేమనకు రామాయణ, భారతాల మీద, విష్ణువు దశావతారాల మీద, మన పురాణాల మీద నమ్మకం లేదు. అవన్నీ కల్పించబడిన కథలని వేమన ఉద్దేశ్యం. ఆకథల్లో ఉన్న నిర్హేతుకత్వాన్ని వేమన కొన్ని పద్యాల్లో ప్రశ్నించాడు. రాముడు చేసిన తెలివి లేని పనిని ఇలా విమర్శిస్తున్నాడు.

కనక మృగము భువిని కలదు లేదనకయే
తరుణి విడిచి పోయె దాశరథియు
తెలివి లేని వాడు దేవుడెట్లాయెరా , విశ్వ

భూమి మీద బంగారు లేడి ఉండదు. ఉంటే దానికి ప్రాణం ఉండదు. ఆవిషయం అంటే బంగారు లేడి ఉంటుందా? ఉండదా? అనే విషయం ఆలోచించకుండా తన భార్య సీత అడిగింది కదా అని దాన్ని తీసుకొని రావడానికి రాముడు వెళ్ళాడు. అలా వెళ్ళడం తెలివి తక్కువ తనం. అలాంటి తెలివి లేనివాడు దేవుడు ఎలా అయ్యాడు? అని వేమన ప్రజలను ప్రశ్నిస్తున్నాడు.

భారతం హిందువుల కందరికీ చాల ఇష్టమైన మహాగ్రంథం. అయితే అందులో యుద్ధషట్కం అనే పేరుతో పిలువబడే ఆరు పర్వాల్లో యుద్ధమే చెప్పబడింది. మిగిలిన

పర్వాల్లో కూడా కొన్ని చోట్ల యుద్ధం చెప్పబడింది. వెరసి భారతంలో హింస ఎక్కువగా ఉంది. మరి అంత హింస ఉన్న గ్రంథం ఎలా గొప్ప గ్రంథంగా, ఇష్టమైన గ్రంథంగా పిలువబడుతూ ఉందని వేమన హేతుబద్ధంగా ప్రశ్నిస్తున్నాడు.

పంచమ నిగమంబు భారతంబగునని
పొగడిరేల జనులు బుద్ధిమాలి
హింస నెంచి చూడ నిష్ట మెట్లయ్యెనో , విశ్వ

జయం అనే పేరుతో వ్యాసుడు రాసిన మహాభారతానికి పంచమవేదం అనే పేరు ఉంది. ధార్తరాష్ట్రులు పాండవులు రాజ్యం కోసం యుద్ధం చేసిన కథ అందులో ప్రధానమైంది. చివరకు యుద్ధంలో,పాండవులు జయించినప్పటికీ ఆయుద్ధంలో 18 అక్షౌహిణుల సైన్యం నాశనమైంది. ఇంత హింస ఉన్న గ్రంథం ఇష్టమైన గ్రంథం ఎలా అయిందా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. భూభారాన్ని తగ్గించడానికి భగవానుడైన కృష్ణుడు ఆయుద్ధం కల్పించాడు కాబట్టి భారత యుద్ధంలో జరిగిన హింస, హింస కాదని కొందరు వాదిస్తారు. అలా అయితే మన దేశంలోనూ, చైనాలోనూ జనాభా విపరీతంగా పెరిగిపోయి భూభారం ఎక్కువ అయింది కాబట్టి దీన్ని తగ్గించడానికి అమెరికా వాడు గానీ రష్యావాడు గానీ మన మీద అణుబాంబు గానీ హైడ్రోజన్ బాంబు గానీ వేస్తే దాన్ని మనం సమర్థించ గలమా? ఇలాంటి బాంబులు వేస్తే ఆస్తి నష్టం జరుగుతుంది కాబట్టి జీవులను మాత్రమే చంపే రసాయన బాంబులను వేస్తే, మనం అది ధర్మ యుద్ధం అంటామా? ఆలోచించాలి. అందువల్ల ఏకారణం చేత యుద్ధం జరిగినా దాన్ని మానవులెవరూ సమర్థించ గూడదు. అలాంటి గ్రంథాలను సమర్థించ గూడదు అనేది వేమన సిద్ధాంతం.

భారతంలో నాయకుడు ధర్మరాజు. ధర్మరాజు ధర్మస్వరూపుడని, అబద్ధమాడడని ప్రతీతి. వేమన ఈఅభిప్రాయాన్ని ఖండిస్తూ ఇలా చెబుతున్నాడు.

కులము నీరు జేసి గురువుల వధియించి
పొసగ నేనుగంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెను వేప విత్తయా , విశ్వ



ధర్మరాజు రాజ్యం కోసం తన పెదతండ్రి కుమారులైన ధార్తరాష్ట్రులతో యుద్ధం చేసి కౌరవ వంశ నాశనానికి కారకుడయ్యాడు. ఆయుద్ధంలో గురువులను బంధువులను మిత్రులను ఎంతో మందిని చంపించాడు. ధర్మరాజు అంటే ధర్మానికి రాజు. పక్షపాతంగా వ్యవహరించడం, అబద్దాలు ఆడడం మొదలైన దుర్లక్షణాలు లేనివాడు. కానీ ధర్మరాజు కౌరవసైన్యాదిపతి అయిన ద్రోణుణ్ణి ధర్మయుద్ధంలో ఓడించలేక, కృష్ణుడు చేసిన సూచనను అనుసరించి అశ్వత్థామ హత: అని గట్టిగా పలికి కుంజర: అని చిన్నగా పలికి ద్రోణుని మరణానికి కారకుడవుతాడు. ధర్మరాజు ఏనుగును అడ్డం పెట్టుకొని బొంకినందు వల్లనే వేమన ఏనుగంత బొంకు బొంకాడు అని ధర్మరాజు గురించి చెప్పి అతడు పేరుకు మాత్రమే ధర్మరాజు గానీ నిజానికి వేపవిత్తు లాంటివాడు అని అతని స్వభావాన్ని చెప్పాడు. వేపవిత్తనం పైకి బాగా కనిపించినా అది పూర్తిగా చేదురుచి కలిగి ఉంటుంది. చేదును విషంగా చెబుతూ ఉంటారు. ధర్మరాజు పేరుకు మాత్రమే ధర్మరాజు కానీ అతని స్వభావమంతా విషపూరితం అని చెప్పడానికి వేమన అతణ్ణి వేపవిత్తు అని చెప్పడం జరిగింది. ఇది సంప్రదాయానికి భిన్నంగా చెప్పడమే.

మానవుడు తన దగ్గర ఉన్న ధనాన్ని దానం చేయాలనేది సంప్రదాయంగా చెప్పబడుతూ ఉంది. వేమన దీన్ని సమర్థిస్తూనే తన దగ్గర లేకపోతే ధనవంతుని దగ్గర ఉన్న ధనాన్ని దోచుకొని అయినా లేని వారికి దానం చేయాలని కింది పద్యంలో చెబుతున్నాడు.

ద్రోహబుద్ధినైన దొంగరికమునైన
నటలనైన సాహసమునునైన
సంపదధికు నుండి సాధించి దనమును
బడుగు కిచ్చెనేని బాగు వేమా

ధనం తన దగ్గర ఉంటే దాన్ని పాత్రులకు దానం చేయాలి. తన దగ్గర లేకపోతే మోసం చేసి కానీ, దొంగిలించి కానీ, దోచుకొని కానీ మరేవిధంగానైనా సరే ధనవంతుని దగ్గరనుంచి ధనాన్ని తీసుకొని పేదలకు దానం చేయాలని వేమన చెప్పాడు. వేమన కాలం గురించి

అనేక భిన్నాభిప్రాయాలున్నప్పటికీ అతను మధ్యయుగానికి చెందిన వాడని ఎక్కువ మంది నమ్మకం. మధ్య యుగాలనాడే వేమన ఇంతటి విప్లవాత్మకమైన భావాలను ప్రకటించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇది కూడా భావవిప్లవం కిందికే వస్తుంది.

<u>విశ్వకవి</u> :-

తెలుగు సాహిత్యంలో కవిత్రయం వారు, శ్రీనాధుడు, పోతన, పెద్దన మొదలైన మహాకవులు ఎందరో ఉన్నారు. కానీ వారందరూ తెలుగు దేశంలో మాత్రమే ప్రసిద్ధులు. తెలుగు వారిలో గూడా శిష్టసాహిత్యంతో పరిచయం ఉన్నవారికి మాత్రమే వారి గురించి తెలుసు. వారి రచనలు ఇతర భాషీయులకు తెలియవు. కారణం వారి రచనలు ఇతర భాషల్లోకి అనువదింప బడకపోవడమే. వేమన పద్యాలు సంస్కృతం, తమిళం, కన్నడం, మళయాళం, హిందీ, ఇంగ్లీషు మొదలైన భాషల్లోకి అనువదింప బడ్డాయి. ముఖ్యంగా ప్రపంచ భాష అయిన ఆంగ్లంలోకి ఎంతో మంది వేమన పద్యాలను అనువదించారు. ఎంతో మంది పాశ్చాత్యులు వేమన చేత బాగా ఆకర్షింపబడ్డారు. వేమన పద్యాలను మొదట వెలుగులోకి తెచ్చిన వారు పాశ్చాత్యులే. "1731 లో ఫ్రాన్సు మిషనరీ ఫాదర్ లెగాక్ వేమన పద్యాలను కొన్నింటిని సేకరించి పారిస్ నగర గ్రంథాలయంలో భద్రపరిచాడు".[13] జె.ఎ. దుబాయ్ అనే ఫ్రెంచి మత గురువు ఫ్రెంచి భాషలో రాసిన హిందువుల అచారాలు అలవాట్లు మతకర్మలు ( ఇది 1816లో ఫ్రెంచి భాష నుంచి Hindu manners, customs, and ceremonies అనే పేరుతో ఆంగ్లభాషలోకి అనువదింప బడింది.) అనే గ్రంథంలో వేమనను గురించి, అతని హిందూమత మూఢాచార నిరసనను గురించి, విప్లవాత్మకాలైన అతని భావాలను గురించి గొప్పగా ప్రశంసించాడు. అంతేగాకుండా ఇతని కాలం నాటికే వేమన పద్యాలు అనేక ఇతర భాషల్లోకి అనువదింప బడుతున్నట్లుగా కూడా ఈయన రాశాడు.

వేమనను వెలుగులోకి తెచ్చిన పాశ్చాత్యుల్లో చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ప్రముఖుడు. వేమన పద్యాలను సేకరించి వాటిని పరిష్కరించి పీఠిక రాసి వేమన పద్యాలను ఆంగ్లంలోకి

13. లోకకవి వేమన యోగి, మరుపూరు కోదండ రామరెడ్డి, పీఠిక - 15



అనువదించి 1829లో మొట్టమొదటిసారి ప్రకటించిన ఘనత బ్రౌన్‌కే దక్కుతుంది. ఇతను వేమనను గురించి, "ఈయన పద్యములు అత్యంతము లోకప్రియములైనవి. తమిళము మళయళము కన్నడములోనికి ఎన్నో మార్చబడినవి. వేమన సూక్తులు గ్రీకు వేదాంతి ప్లేటో గూఢమత నిబంధనలకు సన్నిహితములగుచుండ ఆయన నైతిక నియమావళి గ్రీసుదేశ బౌతిక తత్వశాస్త్రవేత్తల్లో అగ్రగణ్యుడైన డెమోక్రిటిస్ సాంప్రదాయిక సూత్రములను బోలియున్నవి"[14] అని వేమనను ప్రశంసించాడు. వేమన తర్వాత హెన్రీ బ్యూ చాంప్, విలియమ్ హోవర్డ్ క్యాంబెల్, ఎం. ఆర్. మాక్డొనాల్డ్, జి.యు.పోప్, లాయనల్ డేవిడ్ బార్‌నెట్, చార్లెస్ గోవర్, హెన్రీ బవర్స్, గ్రియర్‌సన్ మొదలైన పాశ్చాత్యులు వేమన పద్యాలను లాటిన్, ఆంగ్ల బాషల్లోకి అనువదించారు. హైదరాబాదు నివాసి అయిన మీర్ మహమ్మద్ ఖాన్ గారు 100 వేమన పద్యాలను Musings of a Mystic ( మర్మయోగి భావశబలత ) అనే పేరుతో ఆంగ్లపద్య రూపంలోకి అనువదించి ప్రకటించారు. ఇందులో ఖాన్ గారు వేమనకు ముస్లిం సూఫీ యోగులకు మధ్య ఉన్న సామరస్య భావాలను వివరించారు. విజయనగరానికి చెందిన గంధం శ్రీరామమూర్తి, ఇర్రింకి నరసింహమూర్తి అనే జంటకవులు వేమన వెయ్యి పద్యాలను సంస్కృత భాషలోకి అనువదించి వేమగీత అనే పేరుతో 1960లో ప్రకటించారు. "బహుభాషావేత్త యరమాక ఆదిశేషారెడ్డిగారు 300 వేమన పద్యాలను సంస్కృతీకరించారు. తమిళాంధ్ర కవి ముదనూరు జగన్నాధరాజు గారు కొన్ని వేమన పద్యాలను తమిళంలోకి అనువదించారు"[15]. వీరే గాకుండా బెంగాలీ భాషకు చెందిన వినయకుమార్ సర్కార్, పుట్టుకతో ఆంధ్రుడై తమిళనాడులో ద్రవిడ మున్నేట్ర కళగం పార్టీని స్థాపించిన మహానాయకుడు సి.ఎన్.అణ్ణాదురై మొదలైన గొప్పవారు వేమన గొప్పతనాన్ని వేనోళ్ళ శ్లాఘించారు. United Nations Educational Social Cultural Organisations

14. వేమన-పాశ్చాత్యులు, తెనుగు సేత - మరుపూరు కోదండరామ రెడ్డి, పుటలు -51-53

15. లోకకవి వేమన యోగి, మరుపూరు కోదండరామ రెడ్డి, పీఠిక - 15

(UNESCO) సంస్థ లిపి-లేఖనం ఉన్న ప్రపంచ భాషల్లో ఒక్కొక్క మహాకవిని గుర్తించి అతని ఉత్తమ కృతిని ఒక దాన్ని మొదట ఆంగ్లంలోకి ఆతర్వాత ఇతర భాషల్లోకి అనువదించే ప్రణాళికలో భాగంగా తెలుగు నుంచి వేమనను ఎన్నుకోవడం జరిగింది. దీన్ని బట్టి తెలుగు కవుల్లో వేమనను ఒక్కణ్ణే ప్రపంచం మహాకవిగా గుర్తిస్తున్నట్లుగా అర్థమవుతూంది. ఈవిధంగా వేమన తెలుగు సీమను, భారతదేశ సరిహద్దులను దాటి ఖండాంతరాలకు వ్యాపించాడు. మహాకవి, దార్శనికుడు, సంఘసంస్కర్త, మానవతావాది అయిన వేమన కులరహిత సమాజాన్ని కాంక్షించి, అన్నిమతాల్లోని మోసాలను, డాంబికాచారాలను, మతపెద్దల దుర్మార్గాలను ధైర్యంగా ఎత్తిచూపి, అన్ని రకాల జీవహింసను ఖండించి, అహింస గొప్పతనాన్ని చాటి జీవులన్నింటిలోనూ భగవంతున్నాడని, జీవహింస మహాపాపమనే సార్వకాలికమైన సందేశాన్ని సమస్తజాతుల ప్రజలందరికీ వివరించి చెప్పడమే గాకుండా నాటికి నేటికీ ముందుతరల నాటికి వర్తించే లాగా ఎన్నో నీతులను, సుభాషితాలను, సూక్తులను చాటిచెప్పిన వేమన నిస్సందేహంగా విశ్వకవి. ప్రాచీన కవులకు నోబెల్ బహుమానాన్ని ప్రకటిస్తే తెలుగు నుంచి ఆబహుమానానికి వేమన తప్ప మరొకరు అర్హులు కారు.

ఇంతటి విశిష్టలక్షణాలు కలిగిన వేమన తెలుగుదేశంలో పుట్టడం తెలుగువారి అదృష్టం, తెలుగు భాషచేసుకున్న సుకృతం. ఐతే తెలుగువాడుగా వేమన పుట్టడం మన అదృష్టమే గానీ వేమన దృష్ట్యా చూస్తే అది ఆయన దురదృష్టమే. తెలుగు వాడుగా గాకుండా వేమన ఏతమిళుడుగానో, కన్నడిగుడుగానో లేక మరొక భాషీయుడుగా పుట్టివుంటే, ఆభాషీయులు, వారి ప్రభుత్వాలు ఆయనకు ఎంతగానో బ్రహ్మరథం పట్టేవారు. ఆయనను రాష్ట్రకవిగా కీర్తించి ఆయన పేరుతో పీఠాలు పెట్టడం, ఊరూర ఆయన విగ్రహాలను ప్రతిష్ఠాపించడం మొదలైనవి ఎన్నో చేసేవారు. గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు వేమనను పూర్తిగా మరచిపోయినప్పటికీ ప్రస్తుత ముఖ్యమంత్రి వై. ఎస్. రాజశేఖర రెడ్డి గారు మాత్రం వేమనకు కొంత న్యాయం చేస్తున్నట్లుగా కనిపిస్తుంది. కడపలో కొత్తగాఏర్పాటు చేస్తున్న విశ్వవిద్యాలయానికి "యోగివేమన విశ్వవిద్యాలయం" అని పేరు పెట్టడం వేమనను



తద్వారా తెలుగు భాషను, తెలుగు సాహిత్యాన్ని గౌరవించడమే అవుతుంది. ఈవిషయంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఉన్నత విద్యామండలి అధ్యక్షులైన ఆచార్య కె .సి. రెడ్డి గారి కృషి ప్రశంసనీయమైనది. కె. సి. రెడ్డి గారు వేమన మీద ఉన్న గొప్ప గౌరవంతో ఆసక్తితో కడపలో పెట్టబోతున్న విశ్వవిద్యాలయానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఒప్పించి వేమన పేరుతో వేమన విశ్వవిద్యాలయం అని పేరును నిర్ణయింప జేశారు. కె. సి. రెడ్డి గారు వేమన మీద ఇంతటి అభిమానాన్ని కలిగి ఉన్నందువల్లనే వారికి ఈగ్రంథాన్ని అంకితం ఇవ్వడం జరిగింది. వేమన కోసం మన ప్రభుత్వం ఇంకా చేయవలసింది ఉంది. వేమనను రాష్ట్రకవిగా గుర్తించి గౌరవించాలి. కడపలో గానీ హైదరాబాదులో గానీ వేమన విజ్ఞాన కేంద్రాన్ని స్థాపించి, అందులో వేమన మీద ఆసక్తి, అనురక్తి ఉన్న పండితులను పరిశోధకులుగా నియమించి ముద్రితమైన వేమన పద్యాలతో పాటు ప్రజల్లో ప్రచారంలో ఉన్న వేమన పద్యాలను గూడా సేకరించి, వాటిలో వేమన రాసిన పద్యాలు ఏవి? వేమన పేరుతో ఇతరులు రాసిన పద్యాలు ఏవి? అనే విషయాన్ని నిర్ణయించి, వేమన రాసిన పద్యాల ఆధారంగా అతని హృదయాన్ని, తత్వాన్ని ఆవిష్కరింప జేయాలి. అప్పుడే వేమనకు కొంతవరకైనా న్యాయం చేసిన వారమవుతాం. ఇప్పటివరకు తెలుగు ప్రజలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు వేమనకు చేసింది చాల తక్కువ. తమ భాష పట్ల, తమ కవుల పట్ల, తమ సంస్కృతి పట్ల నిరాదరణ, నిర్లక్ష్యాన్ని వహించడం తెలుగు వారి జీవలక్షణం. కాబట్టి తెలుగు వారు వేమనను పట్టించుకోలేదని మనం బాధపడనవసరం లేదు. అయినప్పటికీ సామాన్య ప్రజలు వేమనను ఎంతగానో అభిమానించారు. అతని పద్యాలను నోరారా చెప్పుకున్నారు. తెలుగు భాష, తెలుగు ప్రజలు ఉన్నంత కాలం వేమన ప్రజల నాలుకల మీద జీవించి ఉంటాడు.

# స్త్రీల స్థితి గతులు

వేమన దృష్టిలో స్త్రీని గురించి పరిశీలించే ముందు మన సమాజంలో స్త్రీల పరిస్థితిని గురించి కొంత చెప్పవలసి ఉంది. పితృస్వామ్య వ్యవస్థలోని మన పురుషాహంకార సమాజం ప్రాచీనకాలం నుంచి మొన్నమొన్నటి వరకు స్త్రీజాతిని తన ఇనుపపాదాల కింద తొక్కిపట్టి ఉంచింది. చైతన్యానికి అవసరమైన విద్య నుంచి ఆమెను దూరం చేశారు. స్త్రీకి మనసుంటుందని, ఆమెకు కొన్ని భావాలు, కోరికలు ఉంటాయనే విషయాన్ని పట్టించుకోకుండా ఆమెను పూర్తిగా వంటింటికి, పడకటింటికి పరిమితం చేశారు. ఆర్థిక స్వేచ్ఛ, వాక్స్వాతంత్ర్యం మొదలైనవేమీ లేకుండా ఆమెను ఒక బొమ్మను చేసి బంధించారు. బాల్యం నుంచి ఆమెను అనేక రకాల కట్టుబాట్లతో, హద్దుల్లో పెంచారు. స్త్రీ బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కొడుకు అధీనంలో ఉండాలని ఎలాంటి స్వేచ్ఛ ఆమెకు ఉండగూడదని ధర్మశాస్త్రాలు రాశారు. స్వేచ్ఛ లేకుండా అలా ఉన్న స్త్రీని పతివ్రతని, సద్గుణసంపన్నురాలని ఇంకా చాల బిరుదులతో కీర్తించారు. ఇదేమని ప్రశ్నించిన స్త్రీని గయ్యాలి గంప అని ముద్ర వేశారు. భర్త మరణించిన స్త్రీని విధవను చేయడం, దేవదాసీ వ్యవస్థ, వేశ్యావ్యవస్థ, సతీసహగమనం, బసివి వ్యవస్థ, బాల్యవివాహం, వరశుల్కం, వరకట్నం మొదలైన దురాచారాలన్నీ పురుషులు తమ శారీరక కోర్కెలు తీర్చుకోవడానికీ, స్త్రీలను తొక్కిపట్టి ఉంచడానికి ఏర్పాటు చేసినవే. ఇలాంటి దురాచారాల వల్ల స్త్రీజాతి తరతరాలుగా ఎంతటి అవమానాలకు, అకృత్యాలకు, దుర్మార్గాలకు, దోపిడీకి, పీడనకు గురి అయిందో మాటలతో చెప్పడం సాధ్యం కాదు.

పైదుర్మార్గాలకు తోడు స్త్రీలు చంచలస్వభావులని, అనుమాన స్వరూపులని పురుష సమాజం స్త్రీల మీద నిందవేసి "అనుమానం ముందు పుట్టి ఆడది తర్వాత పుట్టిందని" సామెతలు చెప్పింది. నిజానికి పురుషుడే చంచల స్వభావుడు. అందమైన స్త్రీ కనిపిస్తే ఆమెను అనుభవించాలను కుంటాడు. నూటికి తొంభై శాతానికి పైగా పురుషులు బహుపత్నీకులు. స్త్రీలు తొంభైశాతం పతివ్రతలే. స్త్రీ తనను కోరుకుంటే సాధారణంగా ఏపురుషుడు ఆఅవకాశాన్ని వదులుకోడు. కానీ పరాయి పురుషుడు తనను కోరుకుంటె అందుకు



అంగీకరించే స్త్రీలు నూటికి ఒకరు గూడా ఉండరు. చాల మంది స్త్రీలతో తాను చేసే శృంగారం రసికత్వమని అదే స్త్రీ చేస్తే వ్యభిచారమని పురుషుడు ద్వంద్వనీతిని కల్పించాడు. చెల్లి, తల్లి, ఇల్లాలు మొదలైన తనకు సంబంధించిన స్త్రీలు పరాయి పురుషులతో చనువుగా ఉన్నా, చనువుగా మాట్లాడినా పురుషుడు సహించలేడు. అనుమాన భూతం అతణ్ణి ఆవహించి అనేక రకాల ఆంక్షలను వారికి విధిస్తాడు.

స్త్రీలు తమ అందచందాలతో పురుషుణ్ణి పిచ్చివాణ్ణి చేసి, భక్తితో, తపస్సుతో, యోగంతో ఆకాశమంత ఎత్తులో ఉన్న పురుషుణ్ణి తన పాద దాసులుగా చేసుకొని అత:పాతాళంలో పడవేస్తారని, స్త్రీకారణంగా పురుషుడు చెడిపోతున్నాడని, ఆమె కారణంగా అనేక యుద్ధాలు జరిగాయని దుష్ప్రచారం చేయడం స్త్రీజాతికి పురుష ప్రపంచం చేస్తున్న మరొక అపకారం. ఈదుష్ప్రచారం పూర్తిగా అసత్యం. సాధారణంగా స్త్రీలు తమకు తాముగా పురుషుల వెంట పడి వారి మీద తమకు గల కోరికను చెప్పరు. కానీ పురుషుడు తనకు నచ్చిన స్త్రీ వద్దకు వెళ్ళి తన కోరికను చెప్పి ఆమె తనను ఇష్టపడినా ఇష్టపడక పోయినా బలవంతగానైనా ఆమెను పొందడానికి ప్రయత్నిస్తాడు. పురుషుడు ఎంత గొప్ప ఋషి అయినా, యోగి అయినా అందమైన స్త్రీ కనపడిన వెంటనే తపస్సును, యోగాన్ని వదలిపెట్టి ఆమె వెంట పడితే అది స్త్రీ తప్పు కాదు. దానికి పురుషునిలో ఉండే బలహీనత, చపలత్వం కారణం. తన బలహీనతకు స్త్రీని నిందించడం దుర్మార్గం, అన్యాయం. ఇవి స్త్రీజాతి పట్ల పురుషాహంకార సమాజం చేసిన దుర్మార్గాల్లో కొన్ని మాత్రమే. చెప్పవలసి వస్తే ఇలాంటివి చాల ఉన్నాయి.

కులం, మతం, మూఢాచారాలు, పీడితులు మొదలైన విషయాల్లో ఎంతో విశాలమైన, ఉన్నతమైన, తర్కసమ్మతమైన, అభ్యుదయకరమైన, విప్లవాత్మకమైన భావాలను ప్రకటించిన వేమన తరతరాలుగా పురుష సమాజం చేత పీడనకు గురి అవుతున్న స్త్రీజాతి పట్ల అంతే విశాలమైన, ఉదాత్తమైన, విప్లవాత్మకమైన భావాలను ప్రకటించి స్త్రీజాతి ఉద్ధరణకు పాటుపడతాడని, పురుషాహంకారుల దుర్మార్గాలను, దుర్నీతిని,

ద్వంద్వప్రమాణాలను తన పద్యకరవాలాల చేత చీల్చి చెండాడతాడని మనం ఆశించడం సహజం, సమంజసమూ కూడా. అయితే అలా ఆశిస్తే అది నిరాశ, అడియాసే అవుతుంది. ఎందుకంటె స్త్రీలను గురించి వేమన చెప్పిన భావాలన్నీ సంకుచితమైనవి, సంప్రదాయబద్ధమైనవి, పురుషపక్షపాతంతో కూడుకున్నవి, అభ్యుదయ వాదులకు ఏమాత్రం నచ్చనివి. వేమన లాంటి సంఘసంస్కర్త, కరుణార్ద్రహృదయుడు, మానవతావాది, దార్శనికుడు స్త్రీల విషయంలో ఇలాంటి సంప్రదాయబద్ధమైన, గర్హనీయమైన భావాలను ప్రకటించడం ఆశ్చర్యాన్ని, ఆలోచనను, ఆవేదనను కలిగిస్తుంది. పరికించి చూస్తే వేమనలో మొదటి నుంచి ఉన్న యోగి లక్షణాల వల్ల గానీ, అతనికి తటస్తపడిన స్త్రీల వల్ల కలిగిన అనుభవం వల్ల గానీ వేమన ఇలాంటి భావాలను ప్రకటించి ఉంటాడని మనం భావించవలసి వస్తుంది. కారణాలు ఏవైనా వేమన స్త్రీజాతిని ఏమాత్రం అర్థం చేసుకోలేదు. స్త్రీని వేమన పురుష సమాజం దృష్టితోనే చూశాడు గానీ స్త్రీదృష్టితో చూడలేకపోయాడు. కనీసం తటస్తుడుగా కూడా చూడలేకపోయాడు.

స్త్రీలను గురించి వేమన చాల పద్యాలు చెప్పాడు. స్త్రీని గురించి అతను చెప్పినన్ని పద్యాలు మరొక కవి చెప్పి ఉండక పోవచ్చు. అంతేకాదు స్త్రీల మీద వేమన చెప్పినన్ని పద్యాలు మరి ఏయితర విషయం మీద చెప్పలేదు. స్త్రీలను గురించి వేమన చెప్పిన పద్యాలను 1) తల్లిని గురించి చెప్పిన పద్యాలు 2) పతివ్రతలను గురించి చెప్పినపద్యాలు 3) గయ్యాలి భార్యలను గురించి చెప్పిన పద్యాలు 4) విధవలను గురించి చెప్పిన పద్యాలు 5) వేశ్యలను గురించి చెప్పిన పద్యాలు 6) స్త్రీజాతి మొత్తాన్ని గురించి చెప్పిన పద్యాలు అనే ఆరు రకాలుగా విభజింపవచ్చు.



## తల్లిని గురించి వేమన చెప్పిన పద్యాలు

సమస్త జీవరాశిలోనూ తల్లి తన సంతానం మీద ఎనలేని ప్రేమను మమకారాన్ని కలిగి ఉంటుంది. జంతువులు సంతానానికి జన్మనిచ్చినప్పుడు మునుపటి కంటె భయంకరంగా ఉండి తమ సంతానాన్ని ఎంతో జాగ్రత్తగా గమనిస్తూ ఆ సంతానానికి అపకారం జరుగుతుందను కున్నప్పుడు ఎంత పెద్ద జంతువునైనా చంపడానికి లేదా చావడానికి కూడా సిద్దంగా ఉంటాయి. పిల్లల మీద వాటికి అంత ప్రేమానురాగాలు ఉంటాయి. సంతానం విషయంలో అవి ఎంతటి త్యాగానికైనా సిద్ధంగా ఉంటాయి. ఈవిషయంలో పులి మరింత జాగ్రత్తగా భయంకరంగా ఉంటుంది. అందువల్లనే ఈనిన పులి లాగా సామ్యాన్ని చెబుతూ ఉంటారు. వివేకం లేని జంతువులు తమ పిల్లల విషయంలో అంత ప్రేమను చూపిస్తుంటే వివేకం ఉన్న మానవుల విషయంలో చెప్పేదేముంది? తల్లి తన బిడ్డల విషయంలో చూపించే ప్రేమానురాగాలకు, తన పిల్లల బాగు కోసం ఆమె పడే తపనకు లెక్క కట్టలేము. తన కన్నబిడ్డను పెంచి పెద్ద చేయడానికి ఆమె ఎంత శ్రమనైనా భరిస్తుంది. ఎన్ని కష్టాలనైనా సహిస్తుంది. తల్లిప్రేమను కొలవడానికి ఎలాంటి కొలమానాలు సరిపోవు. తల్లిప్రేమ గాఢతను తెలియ జేయడానికి ఏభాషలోని పదాలు సరిపోవు. ఆప్రేమను పొందిన బిడ్డకు మాత్రమే అది అవగతమౌతుంది. అందువల్లనే తల్లిని మించిన దైవం లేదని పెద్దలు చెబుతూ ఉంటారు. తల్లి గొప్పతనాన్ని, ప్రాముఖ్యాన్ని తెలిపే సామెతలు మనకు చాల ఉన్నాయి.తల్లి దైవం తండ్రి ధనం, తల్లిని నమ్మిన వాడు భూమిని నమ్మినవాడు చెడడు, తల్లి ముఖం చూడని బిడ్డ వాన ముఖం చూడని పైరు ఒకటే, కన్నతల్లి నీడ కానుగ నీడ , తల్లి లేని పిల్ల దయ్యాల పాలు, తల్లి లేని పిల్ల ఉల్లి లేని కూర మొదలైన సామెతలు ఇలాంటివి.

వేమన తల్లి గొప్పతనాన్ని బాగా తెలిసినవాడు. తల్లి మీద అతనికి ఎనలేని భక్తిగౌరవా లున్నాయి. వేమన స్త్రీల విషయంలో చిన్న చూపు కలిగి ఉన్నప్పటికీ తల్లి విషయంలో అతను వెల్లడించిన భక్తి గౌరవాలు చాల గొప్పవి. అంతే గాదు బిడ్డకు తల్లి అవసరం ఎంతగా ఉందో బాగా తెలిసినవాడు.

తల్లి యున్నయపుడె తనదు గారాబము
లామె పోవ దన్ను నరయ రెవరు
మంచి కాలమపుడె మర్యాద నార్జింపు,విశ్వ

తల్లి ఉన్నంత కాలమే బిడ్డ గారాబం చెల్లుతుంది. ఎంత అల్లరి చేసినా, ఎన్ని తప్పులు చేసినా తల్లి తన బిడ్డను వెనక వేసుకొని వస్తుంది. ఆమె చనిపోతే ఆబిడ్డను ఎవరూ పట్టించుకోరు. తండ్రి ఉన్నా బిడ్డ ఆలనాపాలనా తల్లి చూసినంత ప్రేమగా జాగ్రత్తగా అతను చూడలేడు. చూడాలనుకున్నా అది వీలు కాకపోవచ్చు. ఎందుకంటె అతను తన పనుల్లో తీరిక లేకుండా ఉంటాడు. ఇక అతను రెండవ పెళ్ళి చేసుకుంటె ఆబిడ్డ కష్టాలు మరి చెప్పలేము. తండ్రి ఉన్నా లేనట్లే. కొత్త భార్య మోజులో పడి తండ్రి ఆమె చెప్పినట్లు వింటాడు. అందుకే "తల్లి చనిపోతే తండ్రి పినతండ్రితో సమానం" అనే సామెత ఏర్పడింది. కాబట్టి బిడ్డకు తల్లి ఉండడం చాల అవసరం. అలాగే మనిషి గూడా తనకు మంచి కాలం ఉన్నప్పుడే అంటే తన దగ్గర ధనం, పలుకుబడి మొదలైనవి ఉన్నప్పుడు నలుగురికి ఉపయోగపడి, నలుగురితోటి మంచిగా నడుచుకొని మంచి పేరు తెచ్చుకోవాలి. మంచి కాలంలో ధనమదంతో, అధికార మదంతో విర్రవీగి చెడ్డ పేరు తెచ్చుకొని, మంచి కాలం పోయిన తర్వాత అయ్యో అని బాధ పడితే ఉపయోగం లేదని వేమన ప్రజలకు బోధ చేశాడు.

సవతి తల్లి జూడ సాకులు నెరపును
సొంత తల్లి వలెను సైప దెపుడు
వింత లడచి లోన విజ్ఞాన మందరా , విశ్వ

లోకంలో కొన్ని విషయాలు నిత్యసత్యాల లాగా ప్రవర్తిల్లుతున్నాయి. అలాంటి వాటిలో అత్తా కోడళ్ళకు పడకపోవడం, సవతి తల్లి కుంటిసాకులు పెట్టి సవతి పిల్లలను బాధలకు గురిచేయడం మొదలైనవి ఇలాంటివి. అయితే వీటిలో కొన్ని మినహాయింపులుంటాయి. అలాంటివి వేళ్ళ మీద లెక్కింపదగినవిగా ఉంటాయి. కన్నతల్లి తన బిడ్డలు ఎన్ని తప్పులు చేసినా సహిస్తుంది. కానీ సవతి తల్లి అలా సహించదు. పైగా ఏతప్పు చేయక పోయినా



ఏదో ఒక తప్పును తన సవతి పిల్లల మీద నెట్టి వారిని హింసలకు గురి చేస్తుంది. అలాగే మతాల్లోని పైపై వేషాలను వదలివేసి అసలైన జ్ఞానాన్ని పొందమని వేమన చెప్పాడు.

తల్లి నెరుగు వాడు దైవంబు నెరుగును
మన్ను నెరుగు వాడు మిన్ను నెరుగు
మిన్ను మన్నెరిగిన తన్ను తానెరుగురా , విశ్వ

తల్లి గొప్పతనం తెలుసుకున్నవాడు దేవుని మాహాత్మ్యాన్ని తెలుసుకున్నవాడు అవుతాడని వేమన తల్లిని భగవంతునితో సమానంగా చెప్పాడు. దీన్ని బట్టి వేమనకు తల్లి మీద ఎంత భక్తి ఉందో అర్థమౌతుంది. భూమిని గురించి తెలుసుకున్నవాడు ఆకాశాన్ని గురించి తెలుసుకున్న వాడు అవుతాడు. ఇక్కడ భూమి అంటె కష్టం, ఆకాశం అంటే సుఖం అని చెప్పవచ్చు. ఎందుకంటె భూమి మీద కష్టపడితేనే సుఖపడగలం. మిన్ను మన్నెరుగడం అంటె కష్టసుఖాల విలువ తెలుసుకున్నవాడు తనను తాను తెలుసుకున్న వాడు అవుతాడు.

అమ్మ సుమీ యాలనగా
నమ్మనగా నాలు సుమ్మి యాయిద్దరినిన్
ఇమ్మహిలో పరమాత్ముని
నెమ్మదిలో తెలియ దానె నేర్పరి వేమా

పురుషుని జీవితంలో చాల ముఖ్యమైన పాత్రను పోషించేవారు తల్లి, భార్య. వేమన ఆయిద్దరు స్త్రీలను ఎంతో గొప్ప చేసి ఈపద్యంలో చెబుతున్నాడు. అంతేగాకుండా ఆఇద్దరికి అభేదాన్ని గూడా చెప్పాడు. మొదటి పాదంలో భార్య అంటే తల్లి లాంటిది సుమా అని చెప్పాడు. పురుషుడు పుత్రుని రూపంలో మళ్ళీ తన భార్య గర్భంలో జన్మిస్తాడు. తండ్రి ప్రతి రూపమే కొడుకు. ఆవిధంగా భార్య తనకు తల్లి అవుతుంది. పడక గదిలో తప్ప మిగిలిన చోట్ల భార్యను తల్లి లాగా గౌరవంగా చూడాలి. అంతేగాకుండా కొంత కాలం తర్వాత తన భార్యను గూడా పురుషుడు మాతృభావంతో చూడాలి. అలా చూడగలవాడే గొప్పవాడు. రెండవ పాదంలో అమ్మ ఆలు లాంటిదని చెప్పాడు. ఇది కొంత విరోధాన్ని కలిగించే విషయంగా కనిపిస్తుంది. పురుషుడు తన తండ్రి ప్రతిరూపం. కాబట్టి తన తండ్రి

భార్య తనకు గూడా భార్య అవుతూంది. ఈవిధంగా తల్లి భార్య అవుతూ ఉంది. ఆకారణంగా వేమన అమ్మనగా ఆలు సుమా అని చెప్పాడు. కొంత మంది పురుషులు "పెళ్ళాం బెల్లం తల్లి అల్లం" అన్నట్లుగా భార్యను చాల ప్రేమగా చూస్తూ, కని పెంచిన తల్లిని మాత్రం చాల నిరాదరణ చేస్తూ ఉంటారు. అలా కాకుండా తల్లిని కూడా భార్యతో సమానంగా ప్రేమగా చూడాలనే ఉద్దేశ్యంతో కూడా వేమన అమ్మనగా ఆలు సుమా అని చెప్పాడు. అంతే గాకుండా ఆయిద్దరినీ భగవంతునితో సమానంగా చూడాలని, అలా చూసిన వాడే నేర్పరి అని వేమన చెప్పాడు.

ఒకరి యాడుబిడ్డ కొసర దాకొడుకయి
తల్లి'వెడలదోలు క్షుల్లకుండు
పోతుపంది కిట్టి పోకిళ్ళు లేకుండు , విశ్వ

తల్లిని దైవంగా భావించిన వేమన ఈపద్యంలో తల్లిని నిర్లక్ష్యం చేసే నీచుణ్ణి పంది కంటె హీనమైన వాడని చెప్పాడు. తనను కని అనేక కష్టాలు పడి పెంచి పెద్ద చేసిన తల్లిని ఇంట్లో నుంచి వెళ్ళగొట్టేవాడు నీచాతినీచుడు. మురికి గుంటలో పొర్లాడే నీచమైన పంది గూడా అలా చేయదు.

తల్లి ఏడ్వ వినక తన యాలు వగచిన
జాలి పడెడు వాడు జడుడు సుమ్ము
తారతమ్య మెరుగ నేరని పశువు సుమ్ము , విశ్వ

తల్లిని విషం లాగా పెళ్ళాన్ని అమృతం లాగా చూసే వాడు తల్లి ఏదైనా బాధతో దు:ఖిస్తూ వుంటె ఆమెను పట్టించుకోకుండా, భార్య ఏదైనా చిన్న కారణం చేత కొంచెం బాధ పడగానె అయ్యో అని తెగ బాధ పడేవాడు మూర్ఖుడని, అలాంటి వాడు తల్లీపెళ్ళాల మధ్య భేదాన్ని తెలుసుకోలేని జంతువని వేమన తిట్టాడు.

కల్ల నిజము రెండు కరకంఠు డెరుగును
నీరు పల్ల మెరుగు నిజముగాను
తనయుని జననంబు తల్లి తానెరుగును , విశ్వ



ఈపద్యంలో వేమన మూడు విషయాలను గురించి చెప్పాడు. చరాచరజగత్తులోని నిజానిజాలు ఈశ్వరునికి తెలుస్తాయి. నీరు స్పష్టంగా పల్లం వైపే ప్రవహిస్తుంది. అలాగే కుమారుని జన్మ తల్లికి మాత్రమే తెలుస్తుంది. అంటే వేమన ఉద్దేశ్యం ఇక్కడ తన కడుపున పుట్టిన కొడుక్కు కానీ కూతురుకు కానీ తండ్రి ఎవరన్నది తల్లికే తెలుస్తుందని. ఇప్పుడు శాస్త్రవిజ్ఞానం బాగా అభివృద్ధి చెందడం వల్ల డి.ఎన్.ఎ పరీక్ష చేస్తే తండ్రి ఎవరో తెలుసుకునే అవకాశం ఉంది. ఇలాంటి అవకాశం లేని పూర్వకాలంలో తండ్రి ఎవరు అనేది కేవలం నమ్మకం మాత్రమేనని, తల్లి తన భర్తను ఇతను నీతండ్రి అని చూపించడం వల్లనే బిడ్డ అతణ్ణి నాన్న అని పిలుస్తూ ఉందని చెబుతూ ఉంటారు. కానీ అది నిజమా? కాదా? అనేది తల్లికి, దేవునికి మాత్రమే తెలుస్తుంది.

నాతి పైని ప్రేమ నానాటికిని రోత
జ్యోతిపైని ప్రేమ జూడగాను
మాతృప్రేమ యొకటె మర్యాద దాల్చును , విశ్వ

ఆకర్షణ కారణంగా స్త్రీ మీద పురుషునికి ప్రేమ మొదట ఎక్కువగా ఉంటుంది. ఆకర్షణ తగ్గిపోయిన తర్వాత రోజులు గడిచే కొద్దీ ప్రేమ స్థానంలో అసహ్యం చోటు చేసుకొని రోతగా మారుతుంది. తల్లి స్త్రీ అయినప్పటికీ తల్లి ప్రేమ మాత్రం ఆకర్షణ ఉన్న స్త్రీ ప్రేమ లాంటిది కాదు. తల్లిప్రేమ వెలుగు లాంటిది. వెలుగు చీకటిలో ఉన్న మనుషులకు దారి చూపించి కష్టాల నుంచి గట్టెక్కిస్తుంది. అలాగే తల్లి గూడా తన సంతానానికి అన్నీ తానే అయి బిడ్డ బాగు కోసం మంచిదారి ఏర్పాటు చేస్తుంది. అంతేగాకుండా ఎంతకాలమైనా తల్లిప్రేమకు తరుగు ఉండదు. తల్లిప్రేమ ఎంత త్యాగమైనా చేస్తుంది. అందువల్లనే వేమన తల్లిప్రేమ ఒక్కటే గొప్పది, పూజనీయమైనది అని చెప్పాడు.

ఈ పద్యంలో వేమన దృష్టిలో స్త్రీకి ఉన్న అభిప్రాయం చక్కగా వ్యక్తమౌతూ ఉంది. వేమనకు తల్లి మీద తప్ప మిగిలిన స్త్రీల మీద సదభిప్రాయం లేదు. తల్లి మీద మాత్రం అతనికి గొప్ప గౌరవం ఉంది.

## పతివ్రతలను గురించి వేమన చెప్పిన పద్యాలు

పతివ్రత అనే మాటకు సంస్కృతంలో "పతిరేవ వ్రతం యస్యా: సా" అంటే పతియే వ్రతంగా కలది అని, "పతిమేవ వృణుతే ఇతి పతివ్రత" అంటే పతినే వరించునది అని రెండు రకాల వ్యుత్పత్తులను చెప్పారు. భర్తమాటకు ఎదురు చెప్పకుండా అతని అడుగులకు మడుగులొత్తుతూ అతని మీద మాత్రమే అవ్యాజమైన ప్రేమాభిమానాలను కలిగి, అతని మనస్సు నెరిగి ప్రవర్తిస్తూ, అతని కోసం అతని సుఖం కోసం అహర్నిశలు శ్రమించడమే పరమార్థంగా భావించి త్రికరణశుద్ధిగా భర్తకు సేవ చేస్తూ, గుట్టుగా కాపురం చేసుకుంటున్న స్త్రీని మన వారు పతివ్రత అన్నారు. అలా ఉన్న స్త్రీ చనిపోయిన తర్వాత స్వర్గానికి వెళ్తుందని మనవారు రాశారు. ఇది పూర్తిగా పురుషుణ్ణి దృష్టిలో పెట్టుకొని చెప్పినదే. ఇలాంటి వ్యవస్థలో స్త్రీకి ఎలాంటి వ్యక్తిత్వం లేదు. ఆమె కేవలం భర్త చేతిలో ఒక మరబొమ్మ. అతను చెప్పినట్లుగా నడుచుకునే యంత్రం లాంటిది. భర్త దుర్మార్గుడైనా, రోగిష్టివాడైనా, చివరకు ముండల ముఠాకోరైనా అతను చెప్పినట్లుగా భార్య నడుచుకోవాలి. అలా నడుచుకోకపోతే ఆమె పతివ్రత కాదు. ఈభావాలు సంప్రదాయవాదులు పురుషపక్షపాతంతో చెప్పినవి. వేమన కూడా పతివ్రతల విషయంలో ఇలాంటి భావాలనే వ్యక్తం చేశాడు. పతివ్రతలైన ఇలాంటి స్త్రీలను వేమన బాగా ప్రశంసించాడు.

తగిన కులజుడైన తలయెత్తు ధనమైన
భాగ్యపురుషునేల పట్టనెంచు
పరమ సాధ్వి చూడ పరుల నంటదు సుమీ , విశ్వ

పతివ్రత అయిన స్త్రీ పరాయి పురుషుడు ఎంత గొప్ప ధనవంతుడైనా, గొప్ప కులంలో పుట్టినవాడైనా, తనకు తల ఎత్తు ధనం ఇస్తానన్నా అతణ్ణి తాకదు.

గుణవతి యగు యువతి గృహము చక్కగనుండు
చికటింట దివ్వె చెలగు రీతి
దేవి యున్న యిల్లు దేవార్చన గృహంబు , విశ్వ

ఇకటింట్లో దీపం వెలుగుతున్నట్లుగా, దేవత ఉన్న దేవాలయం లాగా గుణవతి అయిన యువతి ఉన్న ఇల్లు అందంగా ఉంటుంది. ఇక్కడ గుణవతి అంటే పతివ్రత అని అర్థం.



పతి పలుకు సతులకు పరమార్థమని యెంచి
హితవు తోడ పతిని ఇచ్చగించి
ధరణిని యెలనాగ తనువు తప్తము జేసి
పరము జెడక నట్టి ప్రబలు వేమ

ఇహలోకంలో భర్తమాటను పరమార్థంగా భావించి, పతి ఇష్టానుసారంగా మెలుగుతూ ఉన్న స్త్రీ చనిపోయిన తర్వాత పరలోకంలో సుఖపడుతుంది.

మగని మీద భక్తి మానకుండిన కాంత
మూడు లోకములను ముక్తి గనును
మగువ అందరకును మగలె దేవతలయా , విశ్వ

స్త్రీలకు భర్తలే దేవుళ్ళు. అందువల్ల భర్త మీద భక్తి ఉన్న స్త్రీ ముల్లోకాల్లోనూ ముక్తిని పొందుతుంది.

ఒడలు నల్లనైన నోర్చెడి ఇల్లాలు
గుణము గల్గియున్న కోటి చేయు
యెనుము పాలు రోత యన వచ్చునా , విశ్వ

ఇల్లాలు నల్లగా ఉన్నప్పటికీ సహనవతి, గుణవతి అయితే అలాంటి స్త్రీ కోటి రూపాయల విలువ చేస్తుంది. ఈపద్యంలోని మొదటి పాదానికి "ఒడలు శిథిలమైన ఓరుపు గల సతి" అని రెండవ పాదానికి "గుణము మేల్మి బట్టి కోటి సేయు" అనే పాఠాంతరాలున్నాయి.

పతిని విడువ రాదు పదివేలకైనను
పెట్టి జెప్పరాదు పేదకైన
పతిని తిట్టరాదు సతి రూపవతియైన , విశ్వ

భార్య రూపవతి అయినప్పటికీ భర్తను తిట్టగూడదు. అతణ్ణి విడిచిపెట్టి వెళ్ళగూడదు.

వల్లభునికి నిష్ట వస్తువు లందించి
యతని మానసమున కతికి యున్న
నట్టి వనిత మంచి కట్టడి గలదగు , విశ్వ

భర్తకు ఇష్టమైన అన్ని వస్తువులను సమకూరుస్తూ అతని మనసు నెరిగి నడుచుకుంటున్న స్త్రీ మంచి మర్యాద కలిగినది.

భావమరసి తన్ను భార్య సేవించిన
ఇంటికైన నగును నీశ్వరుండు
అదియు లేక బ్రదుకు టధమము భువిలోన , విశ్వ

భర్త ఇష్టం ప్రకారం నడుచుకునే స్త్రీ ఉన్న ఇంట్లో అంటే పతివ్రత ఉన్న ఇంట్లో ఈశ్వరుడు కొలువై ఉంటాడు. అలా లేకుండా బ్రతకడం నీచమైనది. అంటే భర్త చెప్పినట్లు వినని భార్యను వదలి వేయాలి.

వెలది చక్కదనము వెరవైన ఈడును
విభుని కరుణ లేమి విగతి నుండు
నీదు కరుణ లేమి సేర్పులు కొర గావు , విశ్వ

భర్త దయ లేని స్త్రీ అందం, యవ్వనం వ్యర్థం. అవి కొర గానివి అవుతాయి.

గుణము కలిగి యున్న కులసతి నెవ్వరు
నింద చేయలేరు నీతి జూచి
గుణము లేకయున్న కులహీను రాలయా , విశ్వ

సంసారి సుగుణవంతురాలైతే ఆమెను ఎవరూ నిందించలేరు. గుణం లేకపోతే ఆమె కులహీనురాలు అవుతుంది. ఇక్కడ గుణం అంటె భర్త చెప్పినట్లు వినడమే.

పైపద్యాలను పరిశీలిస్తే వేమన భావాలు మధ్యయుగం నాటి సంప్ర దాయవాదులవేనని స్పష్టమవుతుంది. అంటే భర్త దుర్మార్గుడైనా, తనను హింసించేవాడైనా, చిపరకు నపుంసకుడైనా భార్య అతణ్ణి వదలిపెట్టగూడదనీ, అతను చెప్పినట్లుగా నడుచుకోవాలని, అదే ఆమె పవిత్ర కర్తవ్యమని, పరమ ధర్మమని చెప్పాడు. పతివ్రతలైన స్త్రీల మీద వేమనకు మంచి అభిప్రాయం ఉంది.



## గయ్యాళి భార్యలను గురించి వేమన చెప్పిన పద్యాలు

గయ్యాళము అంటే ధిక్కారపు మాట. గయ్యాళి అంటే ధిక్కరించి మాట్లాడేది అని అర్థం. పురుషాధిక్య సమాజంలో భార్య భర్త మాటకు అడ్డు చెప్పగూడదు. అడ్డు చెబితే ఆమె భర్తను ఎదిరించినట్లుగా భావించి లోకం ఆమెను గయ్యాళి కింద జమ కట్టేస్తుంది. భర్త ఎలాంటి వాడైనా అతను చెప్పినట్లు వింటేనే ఆమె సద్గుణవంతురాలు, పతివ్రత. లేకపోతే ఆమె గయ్యాళే. వేమన కూడా ఇదే అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ గయ్యాళి భార్యలను గురించి చాల పద్యాలు చెప్పాడు.

ఆలి వంచగ లేక అధమత్వమున నుండి
వెనుక వంతుననుట వెర్రితనము
చెట్టు ముదరనిచ్చి చిదిమిన పోవునా , విశ్వ

వేమన కాలంలో పెళ్ళిళ్ళన్నీ సాధారణంగా పెద్దలూ కుదిర్చినవే. ఇలాంటి పెళ్ళిళ్ళలో వధూవరులిద్దరూ పరస్పరం కొత్తవారుగా ఉంటారు. అలా కొత్తగా తమ ఇంటికి వచ్చిన కొత్త పెళ్ళి కూతురును భయపెట్టి వంచడం సులభం. అందువల్ల పెళ్ళి చేసుకున్న వెంటనే మగవాడు భార్యను నయానా భయానా వంచి తన చెప్పుచేతుల్లో పెట్టుకోవాలి. మొదట అలా భార్యను వంచకుండా కొత్తమోజులో ఆమె చెప్పినట్లు విని తర్వాత వంచుతాననుకోవడం మూర్ఖత్వం. "మొక్కైవంగనిది మానై వంగుతుందా?" అన్న సామెత లాగా చెట్టు ముదరనిచ్చిన తర్వాత చేత చిదిమితే పోదని అందువల్ల పెళ్ళైన కొత్తలోనే భార్యను వంచాలని వేమన మగవారికి హితోపదేశం చేశాడు.

ఆలి మాటలు విని అన్నదమ్ముల రోసి
వేరే పోవువాడు వెర్రివాడు
కుక్కతోక బట్టి గోదావరీదునా , విశ్వ

వేమనకు సమిష్టికుటుంబం మీద ఇష్టమున్నట్లుగా కనిపిస్తుంది. కానీ సమిష్టికుటుంబంలో కోడలు చాల కష్టపడవలసి ఉంటుంది. తెల్లవారుజామున లేచినప్పటినుంచి రాత్రి పడుకునే వరకు విశ్రాంతి లేకుండా ఆమె పని చేయవలసి ఉంటుంది. పగటి పూట భర్తతో కనీసం

మాట్లాడుకోవడానికి కూడా అవకాశం ఉండదు. దీనికి తోడు అత్తమామల పోరు, ఆడుబిడ్డల పోరు. అందువల్ల సాధారణంగా కోడళ్ళు సమిష్టికుటుంబం నుంచి వేరే పోవాలని భర్త చెవిలో ఇల్లుకట్టుకొని పోరుతూ ఉంటారు. వేరు కాపురం పెట్టాలని మొగునికి చెబుతున్న వైనాన్ని జానపదకవి కింది జానపద గేయంలో ఎంతో చక్కగా వివరించాడు.

సందమామ కన్న సక్కాని మొగుడా
వేరే పోదామా వేరేపోదామా - సంద
అత్తమామల పోరు నేను పడలేను
ఆడుబిడ్డల పోరు అసలె పడలేను - సంద
ఉంగరాలా సెయ్యి ఊగెరా మొగుడా
కందిరీగ నడుము కదిలెరా మొగుడా - సంద
కొండంత కోప్పేమొ కదిలెరా మొగుడా
కొప్పుపై జాజులు వాడెరా మొగుడా - సంద

అత్తింటి కోడలు అత్తగారి ఆరళ్ళు పడలేక మొగుణ్ణి తన చెప్పుచేతల్లోకి మప్పుకొని, వేరేపడదామంటూ ఏవేవో అడియాసలు పెడుతుంది చూడండి.

వేరే ఉంటే మేలురా నాధా కూడి వుంటే పోరురా
గిద్దె పెసరా పప్పు గిన్నెతోడను వండి
పద్దువద్దన నీకు వడ్డించి నేతినగ
ముద్ద చేసి కొంత మూల దాచిపెట్టి
పొద్దున్న సద్దితో పొలమునకు పంపింతు - వేరే
మాటలేటికి క్రొత్తరాటము మనకొస్తే
పూటకు నేసేడు పుంజాలు నూలొడికి
నీటయిన తలగుడ్డ నీకు నేయించంగా
కోటబొమ్మంచు నాకోకకే మిగిలింతు - వేరే
పది రూకలకు నీవు పాడిగేదెను కొంటె
ముదర గాచిన పాలు ముందు నీకు బోసి
ఉదయాన పెరుగైన ఉంచి నీకొడ్డించి
కడమ పెరుగుతో నెలకు కడవ నెయ్యి సేతు - వేరే
మిర్రు పల్లము లేని మెట్ట దాపున నున్న
మర్రిచెట్టు చేను మనపాలు కొస్తేను
ఒట్టిమాటలు గావు ఒక యేటికీ సంత
బర్రెపాల మీద సయిఖర్చు గడిపేను - వేరే

(మిన్నేరు, పుట- **197, 198**)

ఈగేయం ఇలా సాగిపోతుంది.

ఇలా చెవిలో ఇల్లు కట్టుకొని పోరుతున్న భార్య మాటలు విని సమిష్టి కుటుంబం నుంచి వేరేపోయే వాడు పెర్రివాడని అలా చేసేవాడు కుక్కతోకను పట్టుకొని గోదావరిని ఈద ప్రయత్నించి విఫలుడైనట్లుగా చెడిపోతాడని వేమన చెప్పాడు.

ఆలు మగని మాటకడ్డంబు వచ్చెనా
ఆలు గాదది నుదుట వ్రాలు గాని
అట్టి యాలు విడిచి అడవి నుండుట మేలు , విశ్వ

భర్త మాటకు అడ్డం వచ్చే భార్య, భార్య కానే కాదు. భర్త మాటకు ఎదురు చెప్పే భార్య పూర్వజన్మలో చేసుకున్న పాపం వల్లనే దొరుకుతుంది. అలాంటి భార్యతో కాపురం చేసే కంటే మగవాడు ఆమెను వదలిపెట్టి అడవిలో ఉండడం మంచిది.

మాట వినని యాలు మగనికి మరగాలు
దాని జేర బ్రాణ మాన హాని
అట్టి యాలి విడిచి యడవి నుండుట మేలు , విశ్వ

మాట వినని భార్య భర్తకు కృత్రిమంగా పెట్టిన కాలు లాంటిది. కాలు విరిగిపోయినపుడు దాని స్థానంలో కృత్రిమకాలు పెడితే అది నడవడానికి కొంత ఉపయోగపడినా చూడడానికి వికారంగా ఉంటుంది. కానీ సహజసిద్ధమైన కాలు లాగా పని చేయదు. కుంటివాడని

చూడగానే తెలిసిపోతుంది. అలాగే గయ్యాలి భార్య ఉన్నవాడు గూడా అసమర్థుడుగా ఊరంతటికీ తెలిసిపోతాడు. అలాంటి భార్య దగ్గర ఉంటే భర్తకు మానహాని ప్రాణహాని కూడా కలుగుతుంది. కాబట్టి అలాంటి భార్యను వదలిపెట్టి అడవిలో ఉండడం మంచిది.

పతికి మారు బల్కు పడతియే శునకంబు
మీరు సతిని గవయ మిగులు పతియు
పంది పంది గూడి పడదూకు రొంపిలో , విశ్వ

భర్త మాటకు ఎదురు చెప్పే భార్య కుక్క లాంటిది. అలాంటి భార్యతో సంసారం చేయడం పందిపంది కలిసి రొంపిలో దూకడం లాంటిది.

చెప్పులోని రాయి చెవులోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా , విశ్వ

గయ్యాలి భార్య చెప్పులోని రాయి లాంటిది, చెవిలోని జోరీగ లాంటిది, కంటిలో నలుసు లాంటిది, కాలిలో గుచ్చుకున్న ముల్లు లాంటిది. ఇన్ని విధాలుగా భర్తను ఇబ్బందుల పాలు చేస్తున్న అలాంటి భార్యతో కాపురం చేయడం రోజూ యుద్ధం చేయడం లాంటిది.

వాడకురికి తిట్టు వలదన్న మొరబెట్టు
ముందు మగని దిట్టు ముసుగు బెట్టు
గడుసురాలు మగని గంప బెట్టమ్మురా , విశ్వ

గయ్యాలి బార్య చీటికీ మాటికీ వీధిలోకి వచ్చి భర్తను, అతని బంధువులను తిడుతుంది. అలా తిట్టవద్దని భర్త చెబితే నీకు దండంరో మొగుడా అని మరింత ఏడ్చి గగ్గోలు పెడుతుంది. తర్వాత మగని తిట్టి, పనీ పాట, వంటా వార్పూ చేయకుండా ముసుగేసి పడుకుంటుంది. ఈవిధంగా గయ్యాలి భార్య భర్తను గంపలో పెట్టి వీధివీధి తిరిగి అమ్మినట్లుగా ఊరు వాడా అందరికీ తెలిసేలాగా అపఖ్యాతి పాలుచేసి ఇంటిగుట్టు బట్టబయలు చేస్తుంది. వేమన లోకాన్ని బాగా పరిశీలించినవాడు కావడం చేత గయ్యాలి భార్య చేసే చేష్టలను ఆగాయిత్యాన్ని చిన్నచిన్న మాటలతో చక్కగా వివరించాడు.



ఆడబోవు చోట నాయింటి వారెల్ల
సారెసారె కొట్టి చంపెననుచు
పుట్టినింటి కేగి పొలతి తాబోదయా , విశ్వ

గయ్యాలి భార్య మెట్టినింట్లోని వారందరూ తనను రాచి రంపాన పెడుతున్నారని, కొట్టి చంపేస్తున్నారని ప్రతిచోటా చెప్పి వారందరినీ అపఖ్యాతి పాలు చేసి, పుట్టింటికి వెళ్ళి మెట్టినింటికి వెళ్ళకుండా మొండికేస్తుంది.

వశము గాని యాలి వైరమేమన వచ్చు
యశము చెరచు గాని అనువు పడదు
కొసరుటెల్ల దాని కోరికనే తీర్చు , విశ్వ

భర్త మాట వినని భార్య భర్తకు గొప్ప శత్రువు. ఆమె భర్త కీర్తిని మొత్తాన్ని చెడగొట్టడమే గాకుండా అతనికి అసమర్థుడన్న అపకీర్తిని తెచ్చిపెడుతుంది. అలాంటి గయ్యాలిని దారిలోకి తీసుకొని రావడం కుదురని పని. కాబట్టి భర్తే ఆమె దారిలోకి వెళ్ళి ఆమెను బ్రతిమాలు కొని అల్లరి పాలు గాకుండా చూసుకోవాలి.

వేమన కాలంలో గూడా మగవారిని తమ చేష్టలతో భయపెట్టే స్త్రీలున్నారని పైమూడు పద్యాలను బట్టి తెలుస్తుంది. మధ్యయుగాల్లోని పురుషాహంకారసమాజం చేత అణగదొక్కబడిన స్త్రీజాతిలో తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకొని పురుషులను ఎదిరించి నిలిచిన ధీరయువతులుగా వేమన చెప్పిన గయ్యాలి యువతులను మనం చెప్పవచ్చు.

భాగ్యవంతురాలు పరుల యాకలి దప్పి
తెలిసి పెట్టనేర్చు దీర్చనేర్చు
తనదు దుష్ట భార్య తన యాకలినె కాని
పరుల యాకలెరుగ దరయ వేమ

సద్గుణవంతురాలైన భార్య ఇతరుల ఆకలి దప్పికలను తెలుసుకొని వాటిని తీరుస్తుంది. దుర్మార్గురాలైన భార్య తన ఆకలే తప్ప ఇతరుల ఆకలిని ఎరుగదు.

ఆలు పతి సౌఖ్యముల కిల
నాలాయంబైన దాని యాలన వచ్చున్
అలాగున గాకుండిన
కాలుని పెను దూత గదర కదియగ వేమా

భర్తకు ఎల్లప్పుడు సుఖసౌఖ్యాలను కలిగించేదే భార్య . అలా చేయకపోతే ఆమె భర్త పాలిట యమదూత అవుతుంది గానీ భార్య కాదు. ఇలాంటిదే మరొక పద్యం.

పెట్టి పోయని చెలి పెనిమిటికది ధర్మ
పత్ని గాదు కాలమిత్తి గాని
యట్టి పత్ని నెనసి యలరు పెనిమిటకి
పుట్టగతులు లేకపోవు వేమా

భర్తకు పెట్టి పోయని స్త్రీ దర్మపత్ని గాదు. అలాంటి స్త్రీ భర్తకు అకాలమృత్యువు లాంటిది. అలాంటి భార్యతో కాపురం చేసే భర్తకు పుట్టగతులుండవు.

కూలి నాలి జేసి గుల్లాము పనిచేసి
తెచ్చి పెట్టనేని మెచ్చునాలు
చిక్కు పడ్డవేళఁకాకు పరచూ , విశ్వ

భర్త కూలి నాలి గానీ, సేవక వృత్తి గానీ, మరొకటి గానీ చేసి డబ్బు సంపాదించి పెడితే గయ్యాళి భార్య మెచ్చుకొని గౌరవిస్తుంది. భర్త ఏదైనా కష్టాల్లో ఉండి ధన సంపాదన చేయలేకపోతే అతణ్ణి చీకాకు పరుస్తుంది.

కుడువ కూడు లేక కూడ బెట్టగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడవ సాగకున్న నడపీనుగందురు , విశ్వ

తినడానికి తిండి, మాసిపోయిన బట్టలు మార్చుకోవడానికి గుడ్డలు, తలలో పెట్టుకోవడానికి పూలు నగలు, సంసారం నడవడానికి, కూడబెట్టడానికి అవసరమైన ధనం సంపాదించ గలిగినప్పుడే భార్య భర్తను గౌరవిస్తుంది. ధనసంపాదన లేని భర్తను



నడపీనుగ అని అంటే నడిచి వస్తున్న పీనుగ అని గయ్యాళి భార్యలు అసహ్యించుకుంటారు.

కలిమి నాడు మగని కాముగా జూచును
లేమి జిక్కునాడు లేవకుండు
మగువ మగనినైనా మడియంగ జూచును , విశ్వ

గయ్యాళి భార్య భర్త ధనవంతుడుగా ఉన్నప్పుడు అతణ్ణి మన్మధుని లాగా చూస్తూ గౌరవిస్తుంది. ఏదైనా కారణం చేత భర్త బీదవాడైతే అతణ్ణి పూచిక పుల్ల కంటె హీనంగా చూస్తుంది, చివరకు భర్తను చంపడానికైనా వెనుకాడదు.

మాట వినని యాలు మగనికి మృతియౌను
యోరపడగ సర్పమొంటి గ్రహము
తనకు గాని యాలు దాసవురాలయా , విశ్వ

మాట వినని భార్య భర్తకు మృత్యువులాంటిది, పాముపడగ నీడ లాంటిది, దుష్టగ్రహం లాంటిది, రాక్షసి లాంటిది.

మగని కలిమి బలిమి మగువకును బలంబు
కలిమి లేని మగడు కాసు గాడు
పనికి రాని మగని పాటించి చూడదు , విశ్వ

సాధారణంగా లోకంలో స్త్రీకి భర్తను బట్టి గౌరవం ఉంటుది. అంటే పురుషుడు ధనవంతుడు బలవంతుడు అయితే అతణ్ణి బట్టి అతని భార్యకు సంఘం గౌరవం ఇస్తుంది. భర్త బీదవాడు బలహీనుడు అయితే అతనికి సంఘంలో గౌరవం ఉండదు. అతణ్ణి బట్టి అతని భార్యకు సంఘంలో ఎలాంటి గౌరవం ఉండదు. మంచి భార్య అయితే తన భర్తను లోకం గౌరవింపక పోయినా తాను గౌరవిస్తుంది. గయ్యాళి భార్య లోకంతో పాటు తాను గూడా అతణ్ణి హీనంగా చూస్తుంది.

వాదమాడి తిట్టు వరుస నెవ్వరినైన
చేరరాదటన్న చేటు దెచ్చు
గడుసురాలు తెలియ వడిసెల బోలురా , విశ్వ

గయ్యాళి ఎంత మందితోనైనా దెబ్బలాట పెట్టుకొని వరుసగా అందరినీ తిట్టిపోసే కొంపకు చేటు తెస్తుంది. ఆమె వడిసెల లాంటిది. జొన్న మొక్కజొన్న లాంటి పంట పొలాలకు కాపలా ఉన్నవాళ్ళు పక్షులు వచ్చి వాటి గింజలు తినకుండా వడిసెలతో రాళ్ళు విసురుతూ పక్షులను పారదోలుతూ ఉంటారు. గయ్యాళి భార్య అలా రాళ్ళు రువ్వే వడిసెల లాంటిదని వేమన చెబుతున్నాడు. ఆమె తిట్లు వడిసెల నుంచి వచ్చే రాళ్ళ లాగా తగులుతాయని వేమన ధ్వనింపజేస్తున్నాడు.

అనుకూలవతి గాని ఆలి నేలుట యేల
తనకు లోకువ గాని తనయుడేల
పనికి మాలినట్టి బంధుండు యేలయా, విశ్వ

అనుకూలవతి గాని భార్య, విధేయుడు గాని కుమారుడు, పనికిరాని చుట్టం అవసరం లేదు. వీరందరని వదలివేయాలి.

విడువ వలయు నూరు విశ్రాంతి గాకున్న
విడువ వలయు నాలి విధము చెడిన
విడువ వలయు రాజు వితరిణి గాకున్న , విశ్వ

ప్రశాంతత లేని ఊరును, సక్రమంగా లేని భార్యను, దానగుణం లేని రాజును వదలి వేయాలి.

ఓర్పు లేని భార్య యున్న ఫలంబేమి?
బుద్ధి లేని బిడ్డ పుట్టి యేమి?
సద్గుణంబు లేని చదువది యేలరా , విశ్వ

సహనం లేని భార్య, వివేకవంతుడు కాని కుమారుడు, సద్గుణాలను చెప్పని విద్య అవసరం లేదు.

గురువు వచ్చుచున్న కూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్క గొనని మగువకు గతి యున్నె , విశ్వ



గురువు మీద భక్తి గౌరవాలు లేని శిష్యునికి, భర్తను నిర్లక్ష్యం చేసే భార్యకు ముక్తి లభించదు.

పైపద్యాలను బట్టి వేమనకు భర్త మాట వినని భార్యల మీద ఏమాత్రం గౌరవం లేదని, పూర్తిగా చులకన భావం ఉందని స్పష్టమౌతుంది. ఇలాంటి భావాలు పూర్తిగా సంప్రదాయ వాదులవి. పురుషపక్షపాతంతో కూడుకున్నవి.

# విధవలను గురించి వేమన చెప్పిన పద్యాలు

పురుష సమాజం ఏర్పాటు చేసిన దుర్మార్గమైన దురాచారాల్లో ముఖ్యమైనది భర్త చనిపోయిన స్త్రీని విధవగా మార్చడం. మన సమాజంలో వివాహం కారణంగా స్త్రీకి కొత్తగా సంక్రమించేవి తాళిబొట్టు, కాలిమట్టెలు మాత్రమే. భర్త చనిపోతే ఇవి రెండు మాత్రమే తీసి వేయాలి. కానీ పురుష సమాజం తాళి, కాలిమట్టెలతో బాటు స్త్రీకి పుట్టుకతో వచ్చే బొట్టు కాటుక చేతిగాజులు మిగిలిన అలంకారాలు అన్నీ తీసి వేసి ఆమెకు ముండమోపి, విధవ అనే నీచమైన పేర్లు పెట్టి దయనీయమైన జీవితాన్ని విధించారు. హిందూ సమాజంలో విధవ జీవితం దుర్భరమైనది. సరైన తిండి, బట్ట ఆమెకు ఉండవు. ఎలాంటి అలంకారాలు ఆమె చేసుకోకూడదు. అన్ని శుభకార్యాలకు ఆమె దూరంగా ఉండాలి. ఉదయం లేచినప్పటినుంచి రాత్రి పడుకునే వరకు ఇంటి చాకిరంతా ఆమే చేయాలి. ఆమె జీవితం పూర్తిగా వంటింటికే పరిమితమౌతుంది. ఆమె పడక గూడా వంటింటిలోనే. అదీ నేల మీద. కొన్ని కులాల్లో విధవలకు గుండు గూడా చేయిస్తారు. ఇలాంటి దయనీయమైన, దుర్భరమైన జీవితాన్ని విధవలు గడుపుతుండడం వల్లనే ఆధునిక కాలంలో వీరేశలింగం గారి లాంటి సంఘసంస్కర్తలు విధవలు మళ్ళీ పెళ్ళి చేసుకొని పుణ్యస్త్రీలలాగానే సుఖమయ జీవితం గడపాలని ఎంతో ప్రయత్నించి కొంత వరకు సఫలీకృతులయ్యారు. విధవల విషయంలో గూడా వేమన అభిప్రాయాలు సంప్రదాయ బద్ధంగానే ఉన్నాయి.

ముండమోపి కేల ముత్యాల పాపిట
వన్నెలన్ని భాగ్యవతికి గాక
కుంటి గుర్రమునుకు కుచ్చుపల్లంబేల , విశ్వ

విధవలు కుంటి గుర్రాల లాంటివారు. కుంటిగుర్రం పరుగెత్తలేదు, అది స్వారీకి పనికి రాదు.అందువల్ల దానికి కుచ్చుపల్లం అంటె కుచ్చులు అల్లిన జీను అక్కర లేదు. అలాగే విధవలకు గూడా ముత్యాల పాపిట మొదలైన అలంకార వస్తువులు అవసరం లేదు. అలాంటి వన్నీ సౌభాగ్యవతులైన స్త్రీలకే అవసరం.



బండదాని కేల బంగరు మొలత్రాడు
విధవరాలి కేల వెండి గొలుసు
ముచ్చుముండ కేల ముంజేతి కడియాలు , విశ్వ

స్త్రీలు సన్నగా ఉంటే అందంగా ఉంటారు. లావుగా ఉంటే అందంగా ఉండరు. అందంగా లేని వారికి బంగారు ఆభరణాలు ఎన్ని పెట్టినా దాని వల్ల ఎలాంటి అందమూ రాదు. బండది అంటె లావుగా ఉండి ఎలాంటి అందమూ లేనిదిఅని అర్థం. అలాంటి స్త్రీకి బంగారు మొలతాడు అవసరం లేదు. విధవరాలికి బంగారుగొలుసు కాదు గదా వెండిగొలుసు కూడా అక్కర లేదు. దొంగతనం మరిగిన స్త్రీకి ముంజేతి కడియాలు అవసరం లేదు.

అయితే వేమన విధవల విషయంలో కొంత జాలి చూపించినట్లుగా కింది పద్యాన్ని బట్టి తెలుస్తుంది.

ముండ తమ్ము జూడ మొగమాట పడుదురు
ముండ కూడు దినక ముక్తి లేదు
ముండ ముప్పురికిని మూలంబు గాదటో , విశ్వ

ప్రజలు విధవలు చేసిన వంటకాలు తింటూనే ఆమె ముఖాన్ని చూడడం దుశ్శకునంగా భావించి ఆమెను చూడడానికి సందేహిస్తుంటారు. త్రిమూర్తులకు మూలమైన ఆదిశక్తికి భర్త లేడు కాబట్టి ఆమె కూడా గూడా విధవే. విధవ అయిన ఆదిశక్తిని పూజిస్తూ తమ కుటుంబంలో ఒకరుగా ఉన్న విధవలను మాత్రం నీచంగా చూడడం తగదని వేమన చెప్పాడు.

విధవల తిథులకును విధవల జెప్పక
చెలగి విప్రవరుల చెప్పనేల
ముత్తయిదు తిథికిని ముత్తయిదుకిడగా , విశ్వ

హిందువుల్లోని కొన్ని కులాల్లో ముత్తైదువులైన స్త్రీలు చనిపోతే, వారు చనిపోయిన రోజున శ్రాద్ధకర్మ చేసి కొంత మంది ముత్తైదువులకు భోజనం పెట్టి సంభావన ఇస్తారు. వీరే తమ ఇంట్లో విధవలు చనిపోతే వారు చనిపోయిన రోజున వారిశ్రాద్ధకర్మ చేస్తూ

బ్రాహ్మణపురుషులకు భోజనం పెట్టి సంభావన ఇస్తారు. ఇలా చేయడం తగదు అని వేమన చెబుతున్నాడు. ఎందుకంటే ముత్తైదువుల తిథిని ముత్తైదువులకు ఇస్తున్నప్పుడు, విధవల తిథిని విధవలకు ఇవ్వకుండా పురుషులైన బ్రాహ్మణులకు ఇవ్వడమేమిటని వేమన ప్రశ్నిస్తున్నాడు. ఇలా ప్రశ్నించడంలో వేమన హేతుబద్ధత, తార్కికత, విశాల దృక్పథం కనిపిస్తున్నాయి. అయితే చనిపోయిన తర్వాత చేసే కర్మకాండ విషయంలో వేమునకు నమ్మకం లేదు. అందువల్ల ఈపద్యం వేమన రచించినది కాదు.

విధవలను గురించి వేమన చెప్పిన పద్యాలను పరిశీలిస్తే విధవలు ఎలాంటి అలంకారాలు చేసుకోగూడదని ఆయన చెప్పినప్పటికీ వారిని అశుభంగా, చిన్నతనంగా చూడగూడదని, కుటుంబ సభ్యుల్లో ఒకరుగా గౌరవంగా చూడాలని భావించాడు. కాబట్టి వేమన విధవల విషయంలో కొంతవరకు అభ్యుదయ భావాలను ప్రకటించాడని భావించవచ్చు.



## వేశ్యలను గురించి వేమన చెప్పిన పద్యాలు

మన సమాజ.ు ఏర్పాటు చేసిన దుర్మార్గపు వ్యవస్థలో వేశ్యా వ్యవస్థ ఒకటి. మొదట దేవాలయాల్లో దేవదాసీలుగా నియమింపబడిన స్త్రీలు తర్వాత ధనవంతుల శారీరక కోర్కెలు తీర్చే అందమైన బొమ్మలుగా మార్చబడ్డారు. వారి సంతానం గూడా అదే వృత్తిలో కొనసాగడం వల్ల కాలక్రమంలో వారే వేశ్యాకులంగా స్థిరపడ్డారు. మగవారికి తమ శరీరాన్ని అప్పగించి డబ్బు సంపాదించడం వీరి వృత్తి. యవ్వనం ఉన్నంత కాలమే వీరి సంపాదన ఉంటుంది. యవ్వనం పోయిన తర్వాత వీరి ముఖం చూసే వారు గూడా ఉండరు. అందువల్ల వీరు ధనానికే ప్రాధాన్యత నిస్తారు. సొమ్ము మొదట తమ చేతుల్లో పడిన తర్వాతనే విటునికి తమ శరీరాన్ని అప్పగిస్తారు. వీరికి ధనం మీద తప్ప మరెవ్వరి మీదా ప్రేమ ఉండదు. అందువల్ల వీరు తమ వద్దకు వచ్చే విటులను బాగా ఆకర్షించి వారి స్థిరచరాస్తులను తమ వశం చేసుకొని వారిని బికారులను చేస్తారు. అది వారి వృత్తి ధర్మం. దాన్ని ఎవ్వరూ తప్పు పట్టవలసిన అవసరం లేదు. కటికవాడు జంతువులను చంపి మాంసాన్ని కోసి వ్యాపారం చేస్తే, వేశ్య తాను జీవించి ఉండగానే తన మాంసంతో కూడిన శరీరావయవాలతో వ్యాపారం చేస్తుంది. నిజానికి ఇది ఎంతో దయనీయమైన వ్యాపారం. ఈవృత్తి చేస్తూ ధనం కోసం వెంపరలాడే వేశ్యలను మనం తప్పు పట్టకూడదు. వేశ్యావ్యవస్థను ఏర్పాటు చేసిన మన సమాజాన్ని తప్పు పట్టా. కానీ దయలేని లోకం వేశ్యలను, వారి ధన సంపాదనను తప్పు పడుతూవుంది. లోకంతో పాటు వేమన గూడా వేశ్యలను, వారి ధనసంపాదనను తప్పుపడుతున్నాడు. వేమన వేశ్యలను తన పద్యాల్లో ఎక్కువగా లంజ అని వారకాంత అని పిలిచాడు.

గంపెడంత తవుడు గంపలో బెట్టక
చనులు బట్టనీదు కొన్న బర్రె
వారకాంతలేల వలతురు యూరక , విశ్వ

కొత్తగా కొన్న బర్రె గంప నిండా తవుడు పెట్టకుండా ఏవిధంగా పొదుగు మీద చెయి వేయనీయదో అలాగే వేశ్య గూడా తాను అడిగినంత ధనం ఇవ్వకుండా విటునికి తన

పొందు ఇవ్వదు.

కులుకు గుబ్బ జూపి గొబ్బున గరగించి
చేతికాసు లెల్ల జేరదీయు
అల్పుజేసి పుత్తురా వారకాంతలు , విశ్వ

వేశ్యలు పెద్దగా, అందంగా ఉన్న తమ స్తనాలను చూపించి విటులను బాగా ఆకర్షించి వారిని తమ వలలో వేసుకొని వారి దగ్గర ఉన్న ధనమంతా లాగి వేసుకొని వారిని బికారులగా చేసి వదలివేస్తారు. ఈపద్యానికి చివరి పాదంగా "అతను చేతి కత్తులమరంగ గాంతలు" అనే పాఠాంతరం ఉంది. అతనుడు అంటే మన్మథుడు. వేశ్యలు మన్మథుని ఆయుధాల వంటివారు. మన్మథుని ఆయుధాలు పువ్వులు. పువ్వుల లాంటి వారైన వేశ్యలు విటులకు విరహాన్ని కలిగిస్తారు.

పడయ నేర్చి లంజ బంగార మాసించు
మాటలకు వలచుట మహిమ గాదె
కొరక నేర్చు బఱ్ఱె గోకితే చేపునా , విశ్వ

దూడ ఉన్న గేదె నుంచి పాలు పితకడానికి మనుషులు మొదట దూడను వదులుతారు. అది తల్లి దగ్గరికి వెళ్ళి పాలు తాగడానికి ప్రయత్నించగానే గేదె తన దూడ కోసం పాలు చేపుతుంది. వెంటనే దూడను గేదెకు సమీపంలో కట్టివేసి గేదె నుంచి పాలు తీస్తారు. పాలు అన్నీ పితకకుండా కొన్ని పాలు దూడకు ఉంచి దూడను వదలగానే దూడ ఆపాలను తాగుతుంది. రాయలసీమలో దూడ చనిపోయిన గేదె నుంచి పాలు తీయడానికి గేదెకు గంపలో తౌడు గానీ, మిగిలిపోయిన అన్నం గానీ, వేరుశెనగ చెక్క(వేరుశెనగవిత్తనాల నుంచి నూనె తీయగా మిగిలిన పిప్పి) గానీ, పగలగొట్టిన జొన్నబువ్వ (జొన్నలను తిరగలిలో వేసి తిప్పి పగలగొట్టి చేసిన జొన్నబియ్యంతో వండిన అన్నం) గానీ, పత్తిగింజలను దంచి దానికి తౌడు కలిపి నానబెట్టిన మిశ్రమాన్ని గానీ పెడతారు. గంపలో పెట్టిన ఆహారాన్ని తింటూ గేదె పాలు చేపుతుంది. ఇలా గంపలో పెట్టిన ఆహారాన్ని తినడాన్నే వేమన కొరక నేర్చు బఱ్ఱె అని అంటున్నాడు. ఇలా గంపలో తిండికి అలవాటు పడిన బఱ్ఱెకు యజమాని



తిండి పెట్టకుండా చేతితో దాని మేను నిమురుతూ దాని మీద వట్టిప్రేమను ప్రదర్శిస్తే దానికి సంతోషించి ఆగేదె పాలు చేపదు. దీన్నే వేమన గోకితే చేపునా? అని ప్రశ్నిస్తున్నాడు. గంప తిండికి అలవాటు పడిన గేదె గోకితే ఏవిధంగా పాలు చేపదో అలాగే వేశ్య కూడా విటుల మెచ్చుకోలుమాటలు, మాయమాటలు నమ్మి వారికి తన పొందు ఇవ్వదు. ఆమెకు కావలసింది ధనం లేక బంగారం. అవి ఇస్తేనే ఆమె విటుల దగ్గర పడుకుంటుంది. ఇలాంటిదే మరొక పద్యం.

పదవి గలుగ లంజ పయి దానె పడుగాక
యెందు రిత్త మాట కేల వచ్చు
కుడితి మరిగి బఱ్ఱె కూసితే చేపునా , విశ్వ

దూడ చనిపోయిన గేదెలకు పైన చెప్పిన పద్యంలో చెప్పినట్లుగా గంపలో తిండికి బదులుగా కుడితి నీళ్ళు పెట్టి పాలు పితుకుతారు. అలా కుడితి నీళ్ళకు మరిగిన గేదె యజమాని కుడితినీళ్ళు పెట్టకుండా స్నేహపూర్వకమైన వట్టి మచ్చికకూతలకు పాలు చేపదు. ఏదో ఒక తిండి దానికి పెట్టవలసిందే. అలాగే వేశ్య కూడా అధికారం ఉన్న పురుషుల దగ్గరకు వారు పిలువకుండానే తానే వచ్చి వారి మీద పడుతుంది. అధికారి వల్ల వేశ్యలకు చాల లాభాలు ఉంటాయి. వాటిని ఆశించి వేశ్య అధికారం ఉన్న పురుషుల దగ్గరకు వెళ్తుంది. అధికారం లేకుండా ఉన్న పురుషులు వ్యర్థమైన మాటలు ఎన్ని చెప్పినా వేశ్య వారి దగ్గరకు రాదు.

విటుని గన్న వలపు విశదమై యుండును
బోటి చూపునకును సాటి గలదె
కంటిలోని పాప కుంటెన కాడయా , విశ్వ

బోటి అంటే ఇక్కడ వేశ్య అని అర్థం. వేశ్య చూపుకు సాటి లేదని వేమన చెబుతున్నాడు. కుంటెనకాడు అంటే తార్పుడుగాడు. వేశ్యకు వేరే తార్పుడు గాడు అక్కర లేదు. ఆమె చూపులే తార్పుడు గాని లాంటివి. విటుడు ఎంత మందిలో ఉన్నా ఆమె అతణ్ణి చూడగానే గుర్తించి, తన కంటి చూపుతో హొయలతో అతనికి తన వలపును తెలియ జేస్తుంది.

ఆవిషయాన్ని గ్రహించి విటుడు ఆమె దగ్గరకు వస్తాడు. వేశ్యల్లో ఉన్న ఈనైపుణ్యం తెలుసుకోవడానికి తప్పని సరిగా వేశ్యలతో పరిచయం ఉండాలి. ఈపద్యాన్ని బట్టి వేమనకు వేశ్యలతో బాగా సంబంధం ఉన్నట్లుగా చెప్పవచ్చు. ఇలాంటిదే మరొక పద్యం.

విటుల కనుల కెంతో విభ్రమమ్మై తోచు
సాటిలేని పొలతి చక్కదనము
కంటిలోని పాప కుంటెన తనమెకా , విశ్వ

ఇక్కడ పొలతి అంటే వేశ్య. వేశ్యల యొక్క అందచందాలు విటులకు గొప్ప ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. వేశ్య కళ్ళల్లో ఉన్న కంటిపాప తార్పుడుగత్తెగా పని చేసి వారిని వేశ్యల దగ్గరికి చేరుస్తుంది. అంటే వేశ్య తన కనుసైగలతోనే విటులను తన దగ్గరికి రప్పించు కుంటుంది.

తొడల మెరుగు జూచి దొడ్డచన్నుల జూచి
వనిత జూచి దాని వగలు జూచి
విటుల కడుపులెట్లు విరహాగ్ని గొనకుండు , విశ్వ

వేశ్యల మెరుస్తున్న తొడలను, అందమైన స్తనాలను, వారి హొయలను చూచిన తర్వాత విటులు వారి ఆకర్షణకు లోనై వారి మీద విరహంతో వేగిపోతారు.

ఒడలి మెరుగు చూచి నడక సొబగు చూచి
వంక కొప్పు బెట్టు వనిత జూచి
విటులు కడుపులోన వెత నొందకుందురా , విశ్వ

బంగారంలా మెరుస్తున్న శరీరం రంగు, నడకలో ఉన్న వయ్యారం, సొగసుగా వేసుకున్న పక్కకొప్పు మొదలైనవి చూచి విటులు వేశ్యల మీద విరహంతో బాధ పడతారు.

జగడమునకు బోదు జారిణి యెప్పుడు
మాయ జేసి పురుషు మమత బెట్టు
కానిమాట లాడు గయ్యాళి సతతము , విశ్వ

ఈపద్యంలో వేమన వేశ్యకు గయ్యాళికి ఉన్న తేడా చెబుతున్నాడు. వేశ్య అనవసరమైన తగవులు పెట్టుకోదు. ఎందుకంటె అది ఆమె వృత్తికి భంగం కలిగిస్తుంది. తగవులమారి



అని లోకానికి తెలిస్తే అలాంటి వేశ్యల దగ్గరికి విటులు రారు. అందువల్ల ఆమె ఎవ్వరితోనూ జగడం పెట్టుకోకుండా తన మాయవలపు చేత పురుషుణ్ణి లొంగదీసుకుంటుంది. గయ్యాలి దీనికి వ్యతిరేకం. ఆమెకు నోటి తీట ఎక్కువ. "తిట్టేనోరు తిరిగే కాలు ఊరుకోదు" అన్నట్లుగా ఆమె ఎప్పుడూ ఎవరినో ఒకరిని ఆడిపోసుకోకుండా ఉండలేదు. ప్రతి చిన్న విషయానికి గయ్యాళి అందరితోటి తగవు పెట్టుకొని ఊరికి వాడకు చెడ్డ అవుతూ ఉంటుంది.

నాడెమైన చెడిప నయమెరిగి తిరుగు
విటుని కుస్తరించు వివరమెరుగు
బానిసైన తొత్తు పాటింప రాదయా , విశ్వ

చెడిప అంటే చెడిపోయినది అని అర్థం, అంటే వేశ్య. నాణ్యమైన వేశ్య అంటే నాగరికత తెలిసిన వేశ్య ఎలాంటి గొడవలు లేకుండా నయంగా అంటే లౌక్యంగా తన వృత్తిని చేసుకుంటుంది. విటులను బుజ్జగించడం బ్రతిమాలు కోవడం మొదలైన వాటి ద్వారా తన పనులను చక్కబెట్టు కుంటుంది. అందువల్ల అలాంటి బానిస తొత్తు మాటలను నమ్మరాదు.

కొంత మంది వేశ్యలు తమ అందచందాలతో ధనవంతులను తమ వశం చేసుకొని వారి ఇంటికి వచ్చి అక్కడే మకాం వేసి మెల్లమెల్లగా వారి ఆస్తి మొత్తాన్ని తమ వశం చేసుకొని వారిని దివాళా తీయించి చివరకు వారి చావుకు కారకులౌతారు. అందువల్లనే వేమన వేశ్యలను కొన్ని పద్యాల్లో మృత్యువుతో పోల్చాడు.

పూసపోగు బెట్టి పురుషుని భుజమెక్కి
కన్నులార్పి వారకాంత చేరి
తనకు లొంగు వాని తడయక జంపురా , విశ్వ

వేశ్య పూసపోగులు మొదలైన వాటితో చక్కగా అలంకరించుకొని తనను ఉంచుకున్న వాడిని బాగా ఆకర్షించి వాడి ఇంట్లో తిష్ట వేస్తుంది. వేమన ఇక్కడ కన్నులార్పి అనే చక్కని మాటను వాడాడు. వేశ్య తన నిజస్వరూపం విటుడు తెలుసుకోలేనంత అంధునిగా అంటే

ఆమెను గుడ్డిగా నమ్మేటట్లుగా చేస్తుంది. చివరకు విటుని భుజం మీద ఎక్కి కూర్చున్న దయ్యం లాగా వాణ్ణి పీడించి వాని ఆస్తిపాస్తులను హరించి వాణ్ణి దివాలా తీయించి వాని పాలిట మృత్యుదేవతై వాణ్ణి తప్పక చంపుతుంది.

వేశ్య మృత్యుదేవత అనే విషయాన్ని మరింత స్పష్టంగా వేమన కింది పద్యంలో చెబుతున్నాడు.

వారకాంతలెల్ల వలచి యేతెంతురా
పొందు జేసి దనము పుచ్చు కొరకు
మారకమ్మ జొచ్చి మరి యిల్లు వెళ్ళునా , విశ్వ

వారకాంతలకు విటుల మీద ప్రేమ ఏమాత్రం ఉండదు. వారు ధనం కోసమే విటుల ఇళ్ళకు వచ్చి తమ పొందుచేత వారిని తమ వశం చేసుకొని, మెల్లగా వారి ధనాన్ని హరించి వారి మరణానికి కారకులౌతారు. మారకమ్మ అంటే మృత్యుదేవత. మృత్యుదేవత ఇంట్లోకి వచ్చాక ఎవరినీ చంపకుండా వెళ్ళదు. అలాగే మృత్యుదేవత లాంటి వారకాంత ఇంట్లోకి వచ్చి ప్రాణాలు తీయకుండా వెళ్ళదని వేమన చెబుతున్నాడు.

బత్తి గలిగి లంజ పలుమారు వచ్చిన
బత్తి గాదు కాలమిత్తి గాని
మిత్తి యిల్లు జొచ్చి మ్రింగక పోవునా , విశ్వ

వేశ్య ధనవంతుల వద్దకు భక్తి పేరుతో చాల సార్లు వస్తుంది. ఆమె ఎవరి ఇంటికైనా వచ్చిందంటే అది భక్తితో గాదు. వాడి ఆస్తి మొత్తాన్ని హరించి, వానికి అకాల మృత్యువును కలిగించడానికే. మృత్యువు ఇంట్లోకి వచ్చిన తర్వాత మింగకుండా పోతుందా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

లంజ లంజకాని లావెల్ల గొనియాడు
లంజతల్లి వానిలజ్జ గడుగు
తల్లి గలుగు లంజ తగులుట దోషంబు , విశ్వ

వేశ్యల్లో గూడా కొంత మంది అమాయకులుంటారు. ఇలాంటి వారు తమను ఉంచుకున్న



విటుని గొప్పతనాన్ని గురించి ప్రేమతో పొగడుతూ ఉంటారు. వీరు ధనం కోసం విటులను పెద్దగా పీడించరు. అయితే ఇలాంటి వేశ్యల తల్లులు మాత్రం విటుల సిగ్గు తీస్తూ ధనాన్ని గుంజుతూ ఉంటారు. అందువల్ల వేమన తల్లి ఉన్న వేశ్యను తగులుకోవడం తప్పు అని అంటున్నాడు.

త్రాసును ధరలో బడసిన
వేశ్యయు తానొక్క రూపు వివరింపంగా
వీసంబెక్కువ యైనను
వాసవముగ నొరగును నొక్క వంకకు వేమా

త్రాసు, వేశ్య ఒకే విధమైన వారు. త్రాసులో ఏవైపు బరువు ఎక్కువగా ఉంటె అది అటు వైపు మొగ్గుతుంది. అలాగే వేశ్య కూడా తనకు ధనం ఎవరు ఎక్కువ ఇస్తే వారి వద్దకు వెళ్తుంది. ఆమెకు ధనమే ప్రధానం. మరొకటి కాదు.

అదనెరిగిన మగువ అనువెర్గు చనువెర్గు
ముదముతోడ మగని మోహమెరుగు
విభుని శ్రేష్ఠగుణము వేశ్య తానెర్గునా , విశ్వ

ఇల్లాలు భర్త గొప్పతనాన్ని, అనువును, చనువును తెలుసుకొని మసలుకొంటుంది. వేశ్యకు తనను ఉంచుకున్న విటుని గొప్పతనంతో పని లేదు. ఆమెకు కావలసింది ధనం. తనను ఉంచుకున్నవాడు నీచుడా? గొప్పవాడా? అనేది ఆమెకు అనవసరం. తాను అడిగినంత ధనం అతను ఇస్తున్నాడా లేదా అనేదే ఆమె చూస్తుంది.

ఈవిధంగా వేమన వేశ్యలు ధన పిశాచాల లాంటి వారని, వేశ్యను తగులుకుంటే మృత్యువును తగులుకున్నట్లేనని చెప్పాడు. ఇలాంటి అభిప్రాయాలన్నీ పురుషాహంకారులు, సంప్రదాయవాదులు చెప్పేవే. సంఘసంస్కర్తలు చెప్పేవి కావు. సంఘసంస్కర్తలు సమస్య మూలాన్ని తెలుసుకొని దాన్ని నివారించే ప్రయత్నం చేస్తారు. అంతేగానీ సమస్య గురించి ఆలోచించకుండా సమస్యల్లో జీవిస్తున్న వ్యక్తులను నిందించడం తగని పని. వేమన వేశ్యలనే గాకుండా వేశ్యల దగ్గరికి వెళ్ళే పురుషులను గూడా తిట్టాడు.

ఒకడు మున్ను గూడి ఒనరంగ విడిచిన
దాని కూడినట్టి హీనుడొకడు
తమ్ము దిన్నవాని తమ్ము తాదిన్నట్లు , విశ్వ

ఒకడు కూడిన స్త్రీని కూడేవాడు హీనుడు. అలా కూడడం ఒకరి నోట్లోని తాంబూలాన్ని మరొకడు తినడం లాంటి నీచమైనది.

అలాగే ఒకడు అనుభవించి వదలి వేసిన వేశ్యను మరొకడు అనుభవించడం ఎంగిలి విస్తరాకును కుక్క నాకడం లాంటిదని వేమన కొన్ని పద్యాల్లో చెప్పాడు. అంటే వేమన వేశ్యను పంచభక్ష పరమాన్నాలతో కూడిన విస్తరాకుగా, భోగ్యవస్తువుగా భావిస్తున్నాడు.

విటుడు తగిలి రోసి విడిచి పెట్టు వెనుక
పిదప నొకడు తగిలి ప్రియము సేయు
కుడిచి పైచు పుల్లె కుక్కలు నాకవా , విశ్వ

ముందు ఒక విటుడు వేశ్యను తగులుకొని కొంత కాలం ఆమెను అనుభవించి, చివరకు ఆమె మీద అసహ్యం పుట్టి వదలివేస్తే, ఆతర్వాత మరొకడు ఆమెను తగులుకొని ప్రేమ చూపిస్తాడు. ఇది భోజనం చేసి పారవేసిన విస్తరాకును కుక్కలు నాకడం లాంటిది. పుల్లె అంటే ఎంగిలి విస్తరాకు. ఇలాంటి పద్యమే మరొకటి.

ఒకడు పిప్పి జేసి యొల్లక విడిచిన
పిప్పికాస జేయు పేద విటుడు
కుడిచి పేయు పుల్లె కుక్కలు నాకవా , విశ్వ

ఇందులో వేమన వేశ్యను చెరకు ముక్కలాంటి ఒక ఖాద్య వస్తువుగా భావించాడు. చెరకును బాగా నమిలి దానిలోని రసమంతా పీల్చి మింగివేసి, చివరకు పిప్పిని ఊసి వేసినట్లుగా ముందుగా ధనవంతుడైన ఒక విటుడు వేశ్యను తగులుకొని ఆమెను చాల కాలం అనుభవించి చివరకు రోసి విడిచిపెడితే, ఆతర్వాత మరొక పేద విటుడు ఆమెను ఆశిస్తాడు. ఇది గూడా తిని పారేసిన విస్తరాకును కుక్కలు నాకడం లాంటిదే. ఇలాంటిదే మరొక పద్యం



విటుడు డాగు చేసి విడిచి పెట్టిన లంజ
బీదవిటుని దగిలి ప్రియము సేయు
కుప్పలోని చెప్పు కుక్క తిన్నట్లయా , విశ్వ

డాగు అంటే మచ్చ. ధనవంతుడైన విటుడు వేశ్యను అనుభవించడాన్ని వేమన మచ్చ చేయడంగా చెబుతున్నాడు. అంతేగాకుండా అలా వదలి వేయబడిన వేశ్య చాల కాలం వాడి పారేసిన చెప్పు లాంటిదని కూడా చెబుతున్నాడు. ధనవంతుడు డాగు చేసి విడిచి పెట్టిన వేశ్యను పేదవిటుడు తగులుకొని ప్రేమ చూపిస్తాడు. అలా చూపించడం చెత్తకుప్పలో పారేసిన చెప్పును కుక్క తినడం లాంటిది.

బగిసి పోవగొట్టి బ్రతికెడు దానికి
నెవ్వడైన నేమి యెగ్గు గలదె
యెంగిలైన యాకు యేకుక్క నాకదో , విశ్వ

బగిసి అంటే మర్యాద. శరీరాన్ని అమ్ముకొని బతికే వేశ్యకు గౌరవం ఉండదు. అలా మర్యాద లేకుండా ధనం కోసం బతికే వేశ్యకు డబ్బు ఇచ్చేవాడు ఎవ్వడైనా ఒకటే. ఎవడు ధనం ఇస్తే వాడిని తగులు కుంటుంది. ఎంగిలి చేసి పారేసిన విస్తరాకును ఏకుక్కైనా నాకుతుంది. అంటే ఒకడు వాడుకొని వదలివేసిన వేశ్యను తగులుకున్న విటులను వేమన కుక్కలతో పోల్చి చెబుతున్నాడు. ఈవిధంగా వేమన పై మూడు పద్యాల్లో వేశ్యను రుచికరమైన భోజనపదార్థాలతో కూడిన విస్తరాకుగా, మధురమైన చెరకుముక్కలాంటి ఖాద్యవస్తువుగా భావించాడు. ఈవిదంగా స్త్రీని విలాసవస్తువుగా, భోగ్యవస్తువుగా భావించడం పురుషాహంకార లక్షణం. అందువల్ల వేమన పైభావాలు పురుషాహంకార భావాలను ప్రతిబింబిస్తున్నాయి.

క్రొత్తది యిది గాదు క్రొత్తది యనవద్దు
భ్రాంతి పడిన విటుడు బాయలేడు
ప్రాత యెనుము పాలు రోతన వచ్చునా , విశ్వ

విటుడు తాను ఉంచుకున్న వేశ్య పాతదా కొత్తదా అని చూడడు. అతడు "తాను మెచ్చింది

రంభ' అనే భ్రాంతిలో ఉండి ఆమెను తగులు కుంటాడు. గేదె ఎక్కువ సార్లు ఈనినప్పటికీ దాని పాలు రోతగా ఉండవు కదా! అలాగే చాల మంది చేతులు మారి తన దగ్గరికి వచ్చిన వేశ్యను కొత్తవిటుడు ప్రేమగానే చూసుకుంటాడు. పైన చెప్పిన మూడు పద్యాల అభిప్రాయానికి ఈ పద్యం విరుద్ధంగా ఉంది.

ఔరసుండె నీకు వారసుండగు గాక
వేశ్య యందు బుట్టు వెధవ కొడుకు
నీవు పోయినపుడు నీరైనా వదలునా , విశ్వ

పెళ్ళి చేసుకున్న భార్య వల్ల పుట్టిన కుమారుడే పురుషునికి వారసుడుగా ఉంటాడు. అతడు తండ్రి చనిపోయిన తర్వాత పరలోకంలో సద్గతి కలిగే లాగా తండ్రికి నీళ్ళు వదులుతాడు. వేశ్య వల్ల పుట్టిన కొడుకు స్వంత కుమారుని లాగా నీళ్ళు వదలడు. ఈపద్యం వేమన చెప్పింది కాదు. చనిపోయిన తర్వాత కొడుకు వదిలే నీళ్ళ వల్ల సద్గతి కలుగుతుందన్న నమ్మకం వేమనకు లేదు. కాబట్టి వేమన ఇలాంటి పద్యాలను చెప్పడు.

ఇంటియాలి విడిచి ఇల జారకాంతల
వెంట తిరుగు వాడు వెర్రివాడు
పంట చేను విడిచి పరిగ లేరియట్లు , విశ్వ

భార్యను వదలిపెట్టి వేశ్యల వెంట తిరిగేవాడు తన పంట చేను విడిచిపెట్టి ఇతరుల చేలల్లో పరిగలు ఏరుకునే వెర్రివాని లాంటివాడు.

తొత్తు తోడి పొందు తొర్రి పెసల మూట
లంజ తోడి పొందు లజ్జ చెడుపు
జాంద్ర తోడి పొందు చావునకే యగు , విశ్వ

దాసితో అక్రమ సంబంధం చిరుగు ఉన్న సంచిలో పెసలుధాన్యాన్ని తీసుకొని పోవడం లాంటిది. పెసరగింజలు చాల చిన్నవిగా గుండ్రంగా సులభంగా జారిపోయేటట్లుగా ఉంటాయి. చిన్న చిరుగు ఉన్నా ఆ చిరుగులో నుంచి పెసలన్నీ కారిపోతాయి. అంటే దాసితో అక్రమ సంబంధం సులభంగా భార్యకు తెలిసిపోయి సంసారం నరకమౌతుంది.



వేశ్యతో పొందు మర్యాద నాశనం. జాండ్ర యువతితో పొందు మరణహేతువు.

వేమన వేశ్యల గురించి చెప్పిన పైపద్యాలన్నీ పురుషాహంకార భావాలను ప్రతిబింబిస్తున్నాయి. వేమన వేశ్యలను పురుషసమాజం దృష్టితోనే చూశాడు. సంస్కర్త దృష్టితో చూడలేక పోయాడు.

## స్త్రీజాతి మొత్తాన్ని గురించి వేమన చెప్పిన పద్యాలు

స్త్రీ జాతి మొత్తాన్ని గురించి వేమన చాల పద్యాలు చెప్పాడు. ఇవన్నీ నిర్హేతుకమైన నిందలే. ఈసడింపులే. కొన్ని పద్యాలు స్త్రీల మర్మావయవాలను గురించి అశ్లీలంగా చెప్పినవి కూడా ఉన్నాయి. స్త్రీజాతి మీద ప్రత్యేకంగా ద్వేషం, కక్ష ఉంటే తప్ప ఇలాంటి పద్యాలను చెప్పడని పిస్తుంది. వేమన లాంటి సంఘసంస్కర్త స్త్రీ జాతి పట్ల ఇంత దారుణమైన భావాలను వ్యక్తం చేయడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఆడదాని బొంకు గోడ బెట్టినయట్లు
పురుషవరుని బొంకు పూరి తడికె
స్త్రీలు నేర్పులు భువి ఇకురాయి తపము , విశ్వ

ఇందులో వేమన స్త్రీని ఆడది అని పురుషుని మాత్రం పురుషవరుడు అని సంబోధిస్తున్నాడు. ఈసంబోధనలోనే వేమన పురుష పక్షపాతం కనిపిస్తూ వుంది. స్త్రీ అబద్ధమాడితే అది గోడ కట్టినట్లు పకడ్బందీగా, గట్టిగా, ఎలాంటి అనుమానం లేకుండా నమ్మేవిధంగా ఉంటుంది. అంటే స్త్రీ అబద్ధాన్ని ఎంతో నైపుణ్యంగా చెబుతుంది. అదే పురుషుడు అబద్ధమాడితే గడ్డితో కట్టిన తడికె లాగా ఉంటుంది. గడ్డితో కట్టిన తడికె అవతల ఏముందో సులభంగా తెలిసిపోతుంది. అలాగే పురుషుడు అబద్ధం చెబితే అతడు అబద్ధమాడుతున్నట్లుగా అందరికీ వెంటనే సులభంగా తెలిసిపోతుంది. అంటే పురుషునికి అబద్ధమాడడం తెలియదని వేమన చెబుతున్నాడు.

ఇది పూర్తిగా నిరాధారమైనది. అబద్ధమాడడం పూర్తిగా వ్యక్తిగతమైంది. దీనికి స్త్రీపురుష భేదానికి ఎలాంటి సంబంధం లేదు. నిజానికి స్త్రీల కంటె పురుషులే ఎక్కువగా అబద్ధాలు చెబుతారు. స్త్రీలు సాధారణంగా ఇంట్లోనే ఉంటారు. కాబట్టి వారికి అబద్ధమాడ వలసిన అవసరం లేదు. అది గాకుండా స్త్రీలు చాల వరకు పతివ్రతలు. పురుషులు ఎక్కువగా బైట తిరుగుతుంటారు, అంతేగాకుండా వీరు చాల వరకు బహుపత్నీకులు. ఏమాత్రం అవకాశమున్నా పరాయి స్త్రీతో పొందును కోరుకుంటారు. ఈకారణంగా వీరు తమ భార్యలకు అనేక విధాలుగా అబద్ధాలు చెప్పి నమ్మిస్తుంటారు. కాబట్టి స్త్రీలు అబద్ధాలు



నైపుణ్యంగా చెబుతారని పురుషులు అబద్ధాలు చెప్పలేరని అనడం నిజం కాదు.

నీళ్ళ మీద జాడు నెరయ నోడ బలిమి
బట్ట బయల జాడు బండి బలిమి
యాడు దాని బలిమి యాడనే జూడరా , విశ్వ

నీటి మీద ఓడ బలమైనది. అది నీటి మీద బాగా పరుగెడుతుంది. భూమి మీద బండి బలమైనది. అది భూమి మీద బాగా పరుగెడుతుంది. నీటి మీద బండి, భూమి మీద ఓడ చాల బలహీనమైనవి. అవి వాటి మీద పరుగెత్త లేవు. కానీ స్త్రీ మాత్రం అలా కాదు. ఆమె ఎక్కడ ఉన్నా బలమైనదే. నీటి మీద గానీ, భూమి మీద గానీ, ఆకాశంలో గానీ, మరెక్కడున్నా స్త్రీ బలమైనదే. అంటే ఎలాంటి పరిస్థితినైనా తనకు అనుకూలంగా మార్చుకొని బ్రతకగల నేర్పు స్త్రీకి పుట్టుకతోనే వస్తుంది. మరింత స్పష్టంగా చెప్పాలంటే స్త్రీ మాయావి. తన మాయలచేత ఆమె ఎక్కడైనా బ్రతక గలదు. ఇక్కడ 'ఆడదాని బలం ఆడనే' అంటే సంభోగం సమయంలో అని గూడా అర్థం చెప్పవచ్చు.

ఇది గూడ పూర్తిగా అభాండమే. స్త్రీలు సాధారణంగా మనసులోని మాట దాచుకోలేరు. ఎవరికో ఒకరికి తప్పకుండా చెబుతారు. "స్త్రీ నోట నువ్వుగింజ నానదు" అనే సామెత దీనికి మంచి ఉదాహరణ. దీనికి కారణం ధర్మరాజు శాపం అని చెబుతారు. కారణం ఏదైనా స్త్రీలు రహస్యాన్ని దాచలేరు. రహస్యాన్ని దాచలేని వారు మాయావులు అయ్యే అవకాశమే లేదు. అయితే దీనికి మినహాయింపుగా ఒకరు ఇద్దరు ఉండవచ్చు. కానీ పురుషులు మాత్రం మాయావులే. మాయమాటలు చెప్పి స్త్రీలను తమ వశం చేసుకోవడంలో గానీ, భార్యకు తెలియకుండా ఇతర స్త్రీలతో శృంగారాన్ని సాగించడంలో గానీ వారికి వారే సాటి. ఇలాంటివి స్త్రీలు చేసే అవకాశమే లేదు.

పైపద్యం లాంటిదే మరొకటి.

నీళ్ళ మీద జాడు నెరయ నోడలు పర్వు
బయిలు మీద జాడు పక్షి పర్వు
నాడు వారి గమన మాలాగు నుండురా , విశ్వ

నీటి మీద ఓడలు, భూమి మీద పక్షులు సహజంగా, సులభంగా పరుగెత్తినట్లుగా స్త్రీల ప్రవర్తన ఉంటుంది.

కాకిగూట నాడుకోకిల తన గ్రుడ్ల
బెట్టి పెనువజేయు గుట్టెరుంగుడీ
ఆడువారి మోసమపుడైన దెలియదో, విశ్వ

ఆడుకోకిల తన గుడ్లను అతిరహస్యంగా కాకిగూటిలో పెడుతుంది. కాకి అది గ్రహించలేక తన గుడ్లతో కలిపి కోకిల గుడ్లను గూడా పొదిగి పిల్లలను చేస్తుంది. స్త్రీల ప్రవర్తన, వారి నేర్పరితనం కూడా ఆడకోకిల లాగా రహస్యంగా ఉంటుంది.

పెరటి జెట్టు బెట్టి పరికింప కుండిన
వెలుగు దాటి తీవ వెడల బారు
నాడు దాని గుణము నటు వలె నుండురా , విశ్వ

పెరటిదొడ్డిలో చెట్టు పెట్టి పట్టించుకోకుండా వదలివేస్తే అది కంచె దాటి బైటికి వెళ్ళబారుతుంది. దానివల్ల ఆచెట్టు పూలు గానీ పళ్ళు గానీ దారిన పోయే వారు కోసుకునే అవకాశముంటుంది. అందువల్ల చెట్టు పెట్టిన వారు దాన్ని గమనిస్తూ అది ప్రహరి దాటి రాకుండా చర్యలు తీసుకోవాలి. స్త్రీ గూడా పెరటిలో పెట్టిన చెట్టు లాంటిదే. స్త్రీని ఎల్లప్పుడు గమనిస్తూ హద్దుల్లో పెడుతూ ఉండాలి. అప్పుడే ఆమె సుగుణవతి అవుతుంది. పతివ్రత అవుతుంది. లేకపోతే ఆమె విచ్చలవిడిగా విజృంభిస్తుంది.

ఇది గూడా నిరాధారమైన ఆరోపణే. విచ్చలవిడితనం శృంగారపరమైన కోరికలను బట్టి ఉంటుంది. అలాంటి కోరికలు పురుషులకే ఎక్కువ. కాబట్టి హద్దుల్లో పెట్టవలసింది పురుషులనే కానీ స్త్రీలను కాదు.

జాలలోన నుండి స్త్రీల వీధుల వంక
జూడనీయరాదు సుమ్ము, వినక
చూతురేని యట్లు చేటులు మూడురా, విశ్వ

స్త్రీలు తమ ఇళ్ళల్లో నుంచి కిటికీల గుండా వీధుల్లోకి చూస్తూ ఉంటారు. అలా వారిని



చూడనివ్వగూడదు. అలా చూస్తే చేటు కలుగుతుంది. అంటే వారికి అందమైన పురుషులు కనిపిస్తే స్త్రీలు వారితో లేచిపోయే అవకాశం ఉందని చెప్పడం. ఇది గూడా నిర్హేతుకమైన ఆరోపణే.

ఋతువు ననుసరించి స్థితి కాలమున నొప్పు
గతిని బట్టి మనుజు మతియు నొప్పు
స్వేచ్ఛ బట్టి ఉవిద చెల్లాటములు నొప్పు

ఋతువును బట్టి వాతావరణం, మనిషి ఆర్థికస్థితిని బట్టి అతని బుద్ధి సహజంగా ఉంటుంది. అలాగే స్వేచ్ఛను బట్టి స్త్రీ విజృంభణ ఉంటుంది. అంటే స్త్రీకి స్వేచ్ఛ ఉంటే వారు విచ్చలవిడిగా తిరిగి చెడిపోతారు. కాబట్టి స్త్రీకి స్వేచ్ఛ ఉండగూడదు. ఆమెను ఎప్పటికప్పుడు హద్దుల్లో ఉంచాలి.

ఇది గూడా నిరాధారమైన నిందే. స్వేచ్ఛను బట్టి చెడిపోవడం వ్యక్తిగతమైనది. దానికి స్త్రీపురుష లింగ భేదానికి సంబంధం లేదు.

కామ యుతులు మిగుల కఠిన చిత్తులు స్త్రీలు
స్త్రీల నడవడేమి చెప్పవచ్చు
తలపగాను పతిత తనము ముఖ్యంబౌను
కడమ మేడిపంటి కరణిని వేమ

స్త్రీలు కామస్వరూపులు. కామం కారణంగా వారు చంచలస్వభావులు. అంతేగాదు వారు గొప్ప కఠినమైన మనస్సు కలవారు. తమ శారీరక కోరిక తీర్చని పురుషుని విషయంలో వారు ఎంతటి దుర్మార్గానికైనా ఒడిగడతారు. అందువల్ల స్త్రీల ప్రవర్తన గురించి మంచిగా చెప్పడానికి ఏమీలేదు. వారిలో వ్యభిచారం ముఖ్యమైనది. మేడిపండు పైకి అందంగా కనిపించినప్పటికీ పొట్టవిప్పి చూస్తే పురుగులున్నట్లుగా స్త్రీలు పైకి అందంగా కనిపించినప్పటికీ వారు మనస్సులో ఎప్పుడూ వ్యభిచార సంబంధమైన కోరికలతో రగిలిపోతూ ఉంటారు.

ఇది అకారణమైన ఆరోపణ. కామం వ్యక్తిగతమైంది. స్త్రీపురుష భేదం లేకుండా కొంత మందిలో అది ఎక్కువగానూ, కొంత మందిలో తక్కువగానూ ఉంటుంది. ఎక్కువ

మందిలో అది సాధారణ స్థాయిలో ఉంటుంది. జాతి పరంగా చూసుకుంటే నిజానికి స్త్రీల కంటె పురుషులకే కామం ఎక్కువగా ఉంటుంది. లోకంలో స్త్రీల మీద పురుషులు చేసే అత్యాచారాలే అందుకు నిదర్శనం. కాబట్టి స్త్రీలు కామయుతులు అని చెప్పడం పూర్తిగా నిరాధారం.

ఇంతి తనదు పేరు నెల్ల కాలంబును
ప్రజలు దలచునట్లు ప్రతిభ గాంచె
నింతికి పతి భక్తి యెంతన వచ్చును , విశ్వ

ఒక స్త్రీ తన ప్రతిభ కారణంగా తన పేరు ఎల్లకాలం ప్రజలు గుర్తుంచుకునే లాగా ప్రసిద్ధి కెక్కింది. అలాంటి స్త్రీకి ఎంత పతి భక్తో కదా ! అని వేమన ఎగతాళి చేస్తున్నాడు. అంటే స్త్రీలు భర్తలను మించిన ప్రతిభావంతులు కాగూడదు. భర్తల కంటే పేరు ప్రఖ్యాతులు సంపాదించ గూడదు. స్త్రీలు ఎల్లప్పుడూ తమ భర్తలకు అణిగిమణిగి ఉండాలి. వారి చెప్పినట్లుగా నడుచు కుంటూ ఉండాలి. వారు స్వతంత్రంగా వ్యవహరించ గూడదు. ఇది పురుషాహంకారుల భావాలకు అద్దం పడుతుంది.

స్త్రీలకును బెడుదురు స్త్రీల శ్రాద్దంబులు
స్త్రీల యోగ్యమేమి జెప్పవచ్చు
స్త్రీల కిడుట కంటె శిలల కిడుట మేలు , విశ్వ

కొన్ని కులాల్లో స్త్రీలు చనిపోయిన రోజున వారికి శ్రాద్ధం పెట్టి కొంత మంది ముత్తైదువలకు భోజనం పెట్టి సంభావన ఇస్తారు. దీన్ని శ్రాద్ధం స్వీకరించడం అంటారు. ఇలా శ్రాద్ధం సీకరించడానికి స్త్రీలు యోగ్యులు కారు. శ్రాద్ధం అయోగ్యులైన స్త్రీలకు ఇవ్వడం కంటె రాళ్ళకు ఇవ్వడం మంచిది.

శ్రాద్ధమునకు స్త్రీని సరిబిల్చినపుడే
శ్రాద్ధము వృథయైన శ్రాద్ధమాయె
కర్త బోక్త లెన్నగా పురుషులె సుమ్ము , విశ్వ

శ్రాద్ధానికి స్త్రీని పిల్చినప్పుడే శ్రాద్ధం వృధా ఆయిపోతుంది. కాబట్టి శ్రాద్ధం పెట్టడానికి



గానీ, శ్రాద్ధాన్ని స్వీకరించడానికి గానీ పురుషులే అర్హులు. స్త్రీలు అర్హులు కారు.

శ్రాద్ధానికి సంబంధించిన ఈరెండు పద్యాలు వేమన రాసి ఉండక పోవచ్చు. ఎందుకంటే వేమనకు శ్రాద్ధం మీద నమ్మకం లేదు. “పిండములను జేసి పితరుల తలపోసి కాకులకు పెట్టు” వారిని ఆయన గాడిదలు అని తిట్టాడు. పిండాలను పెట్టే ఆచారంలో నమ్మకం లేని వేమన స్త్రీలు శ్రాద్ధం పెట్టడానికి గానీ, శ్రాద్ధం స్వీకరించడానికి గానీ అర్హులు గారని, పురుషులు మాత్రమే అర్హులని చెప్పడు. కాబట్టి పైరెండు పద్యాలు వేమనవి కావు.

కాంత మేని జూచి కళవళ పడుదురు
కడుపులోని రోత గానలేరు
యింత రోత బతుకు యీదేహ మేలరా , విశ్వ

పురుషులు పైకి కనిపించే స్త్రీ దేహంలోని పైపైమెరుగులు శరీరకాంతి చూచి వారి మీద మోహంతో వేగిపోతుంటారు. కానీ స్త్రీలు పైకి కనిపించేటంత మంచివారు కారు. వారి మనస్సులో కామం, కఠినత్వం మొదలైన గొప్ప అసహ్యమైన భావాలు ఉంటాయి. ఇంత నీచమైన, అసహ్యమైన బతుకు ఉన్న స్త్రీని దేవుడు ఎందుకు పుట్టించాడు?

ఇది అకారణమైన ఆరోపణ. ప్రత్యేకించి స్త్రీలకు మాత్రమే అసహ్యమైన భావాలు ఉండవు. ఇలాంటి భావాలకు స్త్రీపురుష భేదానికి సంబంధం లేదు. ఇంతకు ముందే చెప్పినట్లుగా కామం స్త్రీల కంటె పురుషులకే ఎక్కువగా ఉంటుంది.

స్త్రీలు గలుగు చోట చెల్లాటములు గల్గు
స్త్రీలు లేని చోట చిన్న బోవు
స్త్రీల చేత నరులు చిక్కుచున్నారయా , విశ్వ

స్త్రీలు ఉన్న చోట విచ్చలవిడితనం ఉంటుంది. అలాగని స్త్రీలు లేకుండా అందరూ పురుషులే ఉంటే ఆప్రదేశంలో అసలు అందం, ఆనందం ఉండదు. స్త్రీల అందాన్ని బట్టి పురుషులు వారి వ్యామోహంలో పడిపోతున్నారు.

ఇది గూడా నిర్హేతుకమైన ఆరోపణే. విచ్చలవిడితనం వ్యక్తిగతమైనది. దీనికి

స్త్రీపురుష భేదానికి సంబంధం లేదు. ఇక స్త్రీపురుష ఆకర్షణ ప్రకృతి సిద్ధమైనది. పురుషుడు స్త్రీ అందానికి దాసుడైతే అది స్త్రీ తప్పు గాదు. అది పురుషుని బలహీనతకు నిదర్శనం. బలహీనత పురుషుల్లో పెట్టుకొని స్త్రీల మీద నింద వేయడం అన్యాయం.

సతి యొనర్చు చెడ్డ పతి కవశ్యము వచ్చు
పతి యొనర్చు మంచి సతికి సగము
పతి యొనర్చు చెడ్డ సతి కేల రాదురా , విశ్వ

భార్య చేసే పాపంలో కొంత భాగం భర్తకు వస్తుంది. భర్త చేసే మంచిలో కొంత భార్యకు చెందుతుంది. అలాంటపుడు భర్త చేసే చెడ్డలో కొంత భాగం భార్యకు ఎందుకు రాదు? అని వేమన ప్రశ్నిస్తున్నాడు. ఇది హిందూ ధర్మశాస్త్రాల్లోని విషయంగా కనిపిస్తుంది. పురుషుడు స్త్రీని అదుపు ఆజ్ఞలలో పెట్టి జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. అలా చేయకుండా వారికి స్వేచ్ఛను ఇస్తే వారు విచ్చలవిడిగా తిరిగి చెడిపోతారు. అందువల్ల స్త్రీ పతివ్రతగా ఉండడానికి, పతితగా మారడానికి పురుషుడే కారణం. వేమన చెప్పిన కింద పద్యం ఈ విషయాన్ని చెబుతుంది.

తరుణి పుణ్యవతిగ వరుని బట్టియె యగు
పాపిని యగు మగని ప్రాపు వలన
భర్త వర్తనంబె పడతుల యందుండు, విశ్వ

భర్తను బట్టి స్త్రీ పుణ్యవతిగా ఉంటుంది. అతణ్ణి బట్టే ఆమె పాపి అవుతుంది. భర్త ప్రవర్తనే భార్యల్లో ఉంటుంది. కాబట్టే స్త్రీ పాపపుణ్యాలు ఆమె భర్త మీద ఆధారపడి ఉన్నాయి. అందువల్లనే భార్య చేసే పాపంలో కొంత భర్తకు వస్తుందని, భర్త చేసే పుణ్యంలో కొంత భార్యకు చెందుతుందనీ ధర్మశాస్త్రాల్లో చెప్పడం జరిగింది. వేమన "సతి యొనర్చు చెడ్డ పతి కవశ్యము వచ్చు" అనే పద్యంలో భార్య చేసే చెడ్డలో కొంత భర్తకు చెందినప్పుడు, భర్త చేసే మంచిలో కొంత భార్యకు వచ్చినప్పుడు, భర్త చేసే పాపంలో కొంత భార్యకు చెందాలి గదా అని వేమన ప్రశ్నించాడు. అట్లా ఎందుకు రావడం లేదు అని ప్రశ్నించిన వేమన 'తరుణి పుణ్యవతిగ వరుని బట్టియె యగు' అని ధర్మశాస్త్రాల్లో చెప్పిన దాన్ని సమర్థిస్తూ చెప్పడం పరస్పర విరుద్ధంగా ఉంది.



కోడెతాచు పెట్టె కోమలి తలపోయ
పెట్టెలోన సొమ్ము బెట్టివేసి
పెరికి తియ్యగ బోతె పెద్దతాచయి లేచె , విశ్వ

స్త్రీ కోడెతాచును ఉంచిన పాము పెట్టె (బుట్ట) లాంటిది. పురుషుడు బంగారు ఆభరణాలను తెచ్చి భార్యకు ఇస్తే ఆమె వాటిని తన పెట్టెలో దాచిపెట్టు కుంటుంది. ఆతర్వాత అవసరం కొద్దీ ఆబంగారాన్ని ఇమ్మని భర్త అడిగితే ఆమె పెద్ద తాచుపాము లాగా కోపంతో భర్త మీదికి లేస్తుంది. అంటే స్త్రీలకు భర్త మీద కంటె బంగారు ఆభరణాల మీదనే ఎక్కువ ఇష్టం అని చెప్పడం.

చక్కనైన వాని ముక్కువ గన్నంత
తక్కువగను చూచు తనదు విభుని
ఆడు బుద్ధికంటె నవర బుద్ధింకేది , విశ్వ

స్త్రీలు చాల చంచలస్వభావులు. అందమైన పురుషుణ్ణి చూడగానే వారు అతని మీద మనసు పడి తమ భర్తలను చులకనగా చూస్తారు. ఇలాంటి ఆడబుద్ధి కంటె చెడ్డబుద్ధి ఇంకేముంటుంది.

ఇది కూడా నిర్హేతుకమైన ఆరోపణే. నూటికి ఒకరు ఇద్దరు తప్ప చాల వరకు స్త్రీలు పతీవ్రతలే. కనిపించిన అందమైన పురుషుణ్ణి కామించే స్వభావం స్త్రీలకు ఉండదు. దీనికి పూర్తి వ్యతిరేకం పురుషులు. పురుషులు చాల వరకు బహుపత్నీకులు. అందమైన స్త్రీ కనిపించగానే ఆమెను తన దానిగా చేసుకోవాలను కుంటారు. తమకు ఉన్న బుద్ధిని స్త్రీలకు అంటగట్టి చెప్పడం పురుషాహంకారుల లక్షణం.

పరుడు చక్కనైన వజ్రాల గనియైన
తళుకు మెరుపు వంటి తత్వమున్న
అన్యపురుష వాంఛ ఆడుదానికి నుండు , విశ్వ

భర్త మంచి అందగాడు, సజ్జనుడూ, గొప్ప ధనవంతుడు అయినప్పటికీ స్త్రీకి పరపురుషుని మీద కోరిక ఉంటుంది.

ఇది పూర్తిగా నిరాధారమైన మాట. భర్త అందగాడు సజ్జనుడు, ఆస్తిపరుడు అయితే ఏస్త్రీ పరపురుషుణ్ణి కోరుకోదు. కాకపోయినా కోరుకోదు. అయితే నూటికి ఒకటి లేక రెండు శాతం మినహాయింపు ఉంటుంది.

తరుణి సొగసుకాని దనయుని గన్నను
మరుని కళలె మించి మనసు పారు
పాపజాతి మనసు పట్టంగరాదయా , విశ్వ

స్త్రీజాతి గొప్ప పాపిష్టిది. వారి మనసు గొప్ప చంచలమైనది. అందగాడైన కుమారుని చూచినా వారి మనసు వాని మీదికి మళ్ళుతుంది. వాని పొందు కోరుకుంటుంది. స్త్రీ మనసును ఎవరూ అదుపులో పెట్టలేరు.

ఇది గూడా పురుషాహంకారులు స్త్రీజాతిని నిందించడానికి కల్పించినదే.

ఇంటి మగని జూచి యిల్లాలు దు:ఖించి
వెంట విటుని దగిలి వెతల బడును
తుంటరైన దాని తొలగింప మేలురా , విశ్వ

ఇంట్లో భర్తతో దెబ్బలాడి ఆకోపంతో ఉంచుకున్నవాడి వెంట వెళ్ళిపోయిన స్త్రీ అనేక కష్టాలు పడవలసి వస్తుంది. అలాంటి చెడ్డదాన్ని తొలగించడం మంచిది. ఇక్కడ తొలగించడం అంటే విడిచిపెట్టడం అని ఒక అర్థం. చంపడం అని మరొక అర్థం. భర్తను విడిచి లేచిపోయిన ఆడదాన్ని వదలివేయడం సాధారణంగా అందరూ చేస్తారు. అలా లేచిపోయి తనకు తన కుటుంబానికి మాయని మచ్చ తెచ్చిందని భావించిన కొంత మంది పురుషులు లేచిపోయిన స్త్రీని, లేవదీసుకు పోయిన పురుషుణ్ణి వెదికి పట్టుకొని చంపుతారు. ఇలాంటి సంఘటనలు రాయలసీమలో జరుగుతూ ఉంటాయి.

చెట్ట బట్టు దనుక చేలోకువై యుందు
రంత తాడు గట్ట నగడు గండ్రు
యాడువారి కింది నడగుండ జెప్పదో , విశ్వ

స్త్రీలు తమ మెడలో మూడు ముళ్ళు పడే వరకు అణగిమణగి ఉంటారు. మెడలో తాళి



పడగానే వారు విజృంభిస్తారు.

ఈప్రకరణంలో చెప్పిన పద్యాలన్నీ అకారణంగా స్త్రీజాతి మీద వేసిన నిందలే. స్త్రీలు సున్నిత శరీరులే గాదు, సున్నిత మనస్కులు గూడా. స్త్రీ తల్లిగా, సోదరిగా, భార్యగా, అత్తగా తన వారిని ఎంతగానో ప్రేమిస్తుంది. అభిమానిస్తుంది. స్త్రీ ప్రేమించినంతగా అభిమానించినంతగా పురుషుడు ప్రేమించలేడు, అభిమానించలేడు. అలాంటి ప్రేమ స్వరూపులైన స్త్రీల మీద ఇలాంటి నిందలు వేయడం దారుణం. ఇంతకంటె దారుణంగా అశ్లీలంగా స్త్రీల అవయవాల మీద వేమన చెప్పిన పద్యాలు ఉన్నాయి.

కాంత కెంచి చూడ కాలమై బుతువుట్టె
బుతువు యంతకంత రూఢి మీరె
కాంత పేరు ఏమి కాలము పేరేమి , విశ్వ

స్త్రీ బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగు పెట్టే సమయంలో సమర్త అవుతుంది. దీన్నే పుష్పవతి కావడం అని, రుతుమతి కావడం అని అంటారు. ఆతర్వాత ప్రతినెలా ఆమె రుతుమతి అవుతుంది. ఇది ప్రకృతి సహజమైన పరిణామం. ఇందులో ఆమె ప్రమేయం ఏమీ లేదు. స్త్రీలో ప్రకృతి సహజంగా జరిగే ఈపరిణామానికి కూడా స్త్రీదే తప్పు అన్నట్లుగా కాంత పేరేమి? కాలం పేరేమి? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

బాల చనుల పూల బంతుల బోల్తురు
పాలు మాలినట్టి భ్రష్టులవని
మాంస ఖండమందు మరియేమి యున్నది , విశ్వ

కొంత మంది కవులు స్త్రీల స్తనాలను పూలబంతులతో పోల్చారు. అలా పోల్చడాన్ని వేమన తప్పు పడుతున్నాడు. అంతే గాకుండా అలా పోల్చిన వారిని సోమరిపోతులని తిడుతున్నాడు. స్త్రీల స్తనాల్లో మాంసం ముక్కలు తప్ప అందులో ఏముంది అని ప్రశ్నిస్తున్నాడు.

మొలక చనుల నాడు మూడు కోటులు జేయు
కులుకు చనుల నాడు కోటి జేయు

తటుకు చనుల నాడు దమ్మిడీ సేయదో , విశ్వ

స్త్రీ స్తనాలు వచ్చే దశలో అంటే యవ్వన ప్రారంభంలో మూడు కోట్ల విలువ చేస్తుంది. స్తనాలు పూర్తిగా వచ్చి, నడిచేటప్పుడు ఒక రకమైన అందమైన తూగు ఉన్న దశలో ఆమె కోటి రూపాయల విలువ చేస్తుంది. యవ్వనం అంతరించిపోయి స్తనాలు వేలాడిపోయిన దశలో ఏమాత్రం విలువ చేయదు.

ఇది స్త్రీలకే కాదు పురుషులకు, సమస్త జీవరాశికి వర్తిస్తుంది. యవ్వనంలో ఉన్నప్పుడు అన్ని జీవులు అందంగా ఉంటాయి. వయసు పైబడే కొద్దీ వాటి అందం తగ్గిపోతూ ఉంటుంది. స్త్రీని అందం కోణంలో మాత్రమే చూడడం పురుషాహంకార లక్షణం. ఇలాంటిదే కింది పద్యం కూడా.

పూప చన్నులపుడు భూమెల్ల చేసును
మొలక చనుల నాడు మోహించి వలపించు
గుబ్బ(కొదమ) చనుల నాడు కోర జేయు
తప్ప చనుల నాడు దయ్యాలు యొల్లవు , విశ్వ

పువుపిందె లాంటి స్తనాలున్నప్పుడు స్త్రీ భూమంత విలువ చేస్తుంది. అంటె ఎక్కువ విలువ చేస్తుంది. స్తనాలు మరికొంత పెద్దవై మొలక దశలో ఉన్నప్పుడు పురుషులను మోహానికి గురి చేస్తుంది. స్తనాలు పూర్తిగా పెరిగి పెద్దవైన దశలో మగవానిలో కోరికలు కలుగజేస్తుంది. యవ్వనం తొలగిపోయి స్తనాలు తోలుతిత్తుల లాగా వేలాడే దశలో మానవులు కాదు గదా చివరకు దయ్యాలు గూడా ఆమెను కోరవు.

ఈపద్యం గూడా స్త్రీని అందం దృష్టితో చూసినదే. ఇలాంటిదే మరొక పద్యం.

ఇంతి చనుల బిరుసు కొంత కాలమె గాని
పంతగించి చూడ పాలతిత్తి
చెంత విడక యేడ్చి చీకడా పుత్రుడు , విశ్వ

స్త్రీలో పురుషుని బాగా ఆకర్షించేది బిగువైన ఆమె స్తనాలు. కానీ స్తనాలు ఎల్లకాలం బిగువుగా ఉండవు. సంతానవంతురాలయ్యాక ఆమె స్తనాలు పాలతిత్తులుగా మారతాయి. బిడ్డ



ఆమెను వదిలిపెట్టకుండా పాలు తాగుతూ ఉంటాడు కదా.

కన్నెదాని మేను కస్తూరి వాసన
ముసలిదాని మేను మురికి కంపు
వయసు దాని మేను వర్ణింప శక్యమా , విశ్వ

స్త్రీ కన్నె వయసులో ఉన్నప్పుడు కస్తూరి లాగా సువాసన వేస్తుంది. పరిపూర్ణమైన యవ్వనంలో ఆమె శరీరసౌష్టవం వర్ణింప సాధ్యం కాదు. అంటే చూడగానే మగవారిలో కోరికను కలిగిస్తుంది. వృద్ధురాలయ్యాక ఆమె శరీరం మురికి కంపు కొడుతుంది. ఇది గూడా స్త్రీ పురుషులు ఇద్దరికి వర్తిస్తుంది.

వెనుక జూతమంటె వెస పురీషపు గుంట
ముందు జూత మంటె మురుకి గుంట
వెలది జూచి నరులు వేడుక పడుదురు , విశ్వ

స్త్రీకి వెనుక వైపు మలం గుంట, ముందు వైపు మూత్రంతో కూడిన మురికి గుంట ఉంటాయి. ఇలాంటి అసహ్యమైన స్త్రీని చూచి పురుషులు ఎందుకు అంతగా ఇష్టపడుతున్నారు.

ఈపద్యంలో చెప్పిన రెండు గుంటలు పురుషులకు గూడా ఉన్నాయి. ప్రత్యేకించి స్త్రీలకు మాత్రమే అవి ఉన్నట్లుగా వారిని నిందించడం పురుషపక్షపాతమే.

ఈత గింజవంటి ఇసుమంత యోనికి
ఆశ పడును నరుడు అడవిలోన
తోయజాక్షుల మాయ తోయ నెవ్వర వశము , విశ్వ

స్త్రీ యోని ఈతగింజ ఆకారంలో చిన్నదిగా ఉంటుంది. ఇక్కడ వేమన యోని గురించి చెప్పిన పోలిక చక్కగా ఉంది. స్త్రీలు గొప్ప మాయావులు. వారి మాయను తోసివేయడం ఎవ్వరికీ సాధ్యం కాదు. వారు తమ మాయ చేత చిన్న ఈతగింజ లాంటి తమ యోని కోసం పురుషుణ్ణి అడవిలో ఆశపడేలాగా చేస్తున్నారు. పురుషుడు అమాయకంగా ఆమాయలో తగులుకొని బైటికి రాలేక పోతున్నాడు.

ఆడదియను రోలు నందరు యరగంగ
దంచి దంచి యలసి తముకు దామె
తొడల యందు బడిరి తొడరి జగము లందు ,విశ్వ

ఈపద్యంలో స్త్రీయోనిని రోలుతో పోల్చడం జరిగింది. రోట్లో ధాన్యం పోసి రోకలితో దంచుతూ ఉంటే రోలుకు ఏమీ కాదు. రోకలి అరిగిపోతుంది. లేదా దంచేవాళ్ళే అలసిపోతారు. అలాగే స్త్రీ యోనిని ఎంత మంది పురుషులు సంభోగించినా ఆమెకు కష్టం గానీ అలసట గానీ ఉండదు. సంభోగం చేసి చేసి పురుషులు అలసి సొలసి ఆమె తొడల మధ్యపడిపోవలసిందే.

కొంత మంది పురుషాహంకారులు స్త్రీని నీచంగా ఎగతాళి చేయడానికి ఇలాంటి మతిలేని మాటలు చెబుతూ ఉంటారు. ఇలాంటి వారు కొందరు స్త్రీని భూమితోనూ పురుషుణ్ణి నాగలితోనూ పోలుస్తూ ఉంటారు. నాగలి భూమిని దున్నిదున్ని అరిగిపోవడమో, విరిగిపోవడమో జరుగుతుంది, కానీ భూమికి ఏమీ కాదు. అలాగే పురుషుడు స్త్రీని సంభోగం చేసిచేసి తాను అలసిపోవలసిందే తప్ప ఆమెకు ఏమీ కాదని స్త్రీనింద చేసే పురుషులు చెబుతూ ఉంటారు.

చెరప కైక బుట్టె శ్రీరాము పట్టంబు
సీత బుట్టె లంక రీతి జెరప
చెప్ప రాజు జెరప చిత్రాంగి బుట్టెను , విశ్వ

శ్రీరామునికి జరుగబోతున్న పట్టాభిషేకాన్ని చెడగొట్టడానికి కైక పుట్టింది. వైభవోపేతమైన లంకా నగరాన్ని నాశనం చేయడానికి సీత పుట్టింది. రాజరాజనరేంద్రుణ్ణి చెడగొట్టడానికి చిత్రాంగి పుట్టింది. స్త్రీలు మంచిపని ఏదీ చేయకపోగా మంచివాటిని చెడగొట్టడానికే పుట్టారన్నట్లుగా వేమన ఈపద్యాన్ని చెప్పాడు. నిజానికి పై సంఘటనలు జరగడానికి స్త్రీల కంటే పురుషులే ప్రధానకారకులు.

దశరథుడు తనకు చాల కాలం సంతానం కలగకపోవడం చేత కేకయరాజు కుమార్తె అయిన కైకకు పుట్టిన కుమారునికే పట్టాభిషేకం చేస్తానని కేకయరాజుకు మాట ఇచ్చి



కైకను పెళ్ళి చేసుకొన్నాడు. తన తండ్రికి ఇచ్చిన మాట ప్రకారం తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకం చేయమని కైక పట్టుబట్టి రాముని పట్టాభిషేకాన్ని ఆపించింది. ఇక్కడ కైక తప్పు ఏమీ లేదు. పట్టపురాణి కౌసల్య ఉండగా కైకకు పుట్టిక కుమారునికే రాజ్యం ఇస్తానని మాట ఇవ్వడం దశరథుని తప్పు. అది గాకుండా రాజరికంలో తమ కుమారుడే రాజు కావాలని రాజు భార్యలందరూ రాజు మీద వత్తిడి తీసుకొని రావడం, అందుకోసం తమ వర్గాన్ని కూడగట్టుకొని అనేక రకాల ప్రయత్నాలు చేయడం సర్వసాధారణంగా జరిగేదే. అందువల్ల రామపట్టాభిషేక విఘ్నానికి కైకను తప్పు పట్టవలసిన అవసరమే లేదు. రెండవది. లంకాదీశ్వరుడైన రావణుడు సీతను మోసంతో ఎత్తుకొని పోవడం వల్ల సీత భర్త రాముడు వానర సైన్యంతో లంక మీదికి దండెత్తి దాన్ని పాడు చేశాడు. ఇందులో సీత తప్పు ఏమీ లేదు. సీతను బలవంతంగా ఎత్తుకొని పోయిన రావణునిది తప్పు. మూడవది రాజరాజును చిత్రాంగి చెరచడం. ఇందులో రాజరాజు, చిత్రాంగి ఇద్దరి తప్పులూ ఉన్నాయి. ముసలివాడైన రాజు యవ్వనవతి అయిన చిత్రాంగిని వివాహం చేసుకోవడం అతని తప్పు. వావివరసలు లెక్కచేయకుండా సవతి కుమారుని కామించడం చిత్రాంగి తప్పు. ఎక్కడ ఏసంఘటన జరిగినా దానికి అనేక రకాల కారణాలుంటాయి. ప్రత్యేకించి స్త్రీలు మాత్రమే కారకులు కారు. అలా చెప్పడానికి కారణం స్త్రీ వ్యతిరేకతే.

పడతి మోసె నొకడు పడతి దాల్చె నొకడు
పడతి నెదను బెట్టి బ్రతికె నొకడు
పడతి కొరకు నిట్లు బలు పాట్లు పడిరయా , విశ్వ

ఈపద్యంలో వేమన త్రిమూర్తులను గురించి చెప్పాడు. బ్రహ్మ సరస్వతిని నోట్లో పెట్టుకొని మోశాడు. ఈశ్వరుడు పార్వతిని తన సగం శరీరంలో ధరించాడు. విష్ణువు లక్ష్మిని తన హృదయం మీద పెట్టుకొని జీవించాడు. ఈవిధంగా త్రిమూర్తులు భార్యల వల్ల పడరాని కష్టాలు పడ్డారు. ఇదే విషయాన్ని వేమన కింది పద్యంలో మరొక విధంగా చెప్పాడు.

బోటి యొకతె బ్రహ్మ నోటి మీదను తన్నె
కొమ్మ యొకతె విష్ణు రొమ్ము తన్నె
సఖియ యొకతె శివుని సగముగా చేసెను , విశ్వ

ఒక స్త్రీ (సరస్వతి) బ్రహ్మను నోటి మీద తన్నింది. ఒక స్త్రీ (లక్ష్మి) విష్ణువును గుండెల మీద తన్నింది. వేరొక స్త్రీ (పార్వతి) శివుణ్ణి సగంగా చేసింది. అంటే అర్ధనారీశ్వరుణ్ణి చేసింది.

కంటి మంట చేత కాముని గాల్చిన
వేల్పు పెద్ద పెంటి విడువలేడు
పెంటి బాసినట్టి పెద్దలు గలరొకో , విశ్వ

మూడవకన్ను నుంచి వెలువడిన అగ్ని చేత మన్మధుని దహించిన దేవాధిదేవుడైన ఈశ్వరుడు గూడా చివరికి భార్యను విడిచిపెట్టలేక పోయాడు. భార్యను వదలిపెట్టిన పెద్దలు ఎవరున్నారు?

కొండ దండి మామ కొండ కూతురె యాలు
కొండ మేటి విల్లు కొండ యిల్లు
కొండ వంటి దొరయు గుండయి పోయెరా , విశ్వ

ఈపద్యంలో వేమన ఈశ్వరుని గొప్పతనాన్ని చెప్పి అంత గొప్పవాడు కూడా స్త్రీదాసు డయ్యాడని చెబుతున్నాడు. ఈశ్వరుని మామ హిమవంతుడు పెద్దకొండ. ఆకొండ కూతురైన పార్వతి ఈశ్వరుని భార్య. మేరు పర్వతం ఈశ్వరుని విల్లు. కైలాసపర్వతం అతని ఇల్లు. ఈవిధంగా ఇన్ని కొండలతో సంబంధం పెట్టుకొన్న ఈశ్వరుడు గూడా గొప్ప పర్వతం లాంటివాడే. అంత కొండ లాంటి వాడు గూడా స్త్రీ చేతిలో ( పార్వతి చేతిలో) పిండి అంటే బూడిద అయిపోయాడు.

సతుల మాయ జూచి చాలించె భైరేడు
పెద్దకడుపు వాడు పెండ్లి మానె
పుట్టు కాసె గట్టె భువి నాంజనేయుడు , విశ్వ

సతుల మాయను చూచి అసహ్యంతో భైరవుడు పెళ్ళి చేసుకోవడం మానివేశాడు. పెద్దకడుపువాడైన వినాయకుడు కూడా అదే భావంతో పళ్ళి చేసుకోలేదు. ఆంజనేయుడు స్త్రీల మీద అసహ్యం వల్లనే ఆజన్మబ్రహ్మచారిగా ఉండిపోయాడు.



ఈవిధంగా వేమన మానవులే గాకుండా దేవతలు గూడా స్త్రీల వల్ల అనేక కష్టాలు పడ్డారని దేవతా స్త్రీలను గూడా విమర్శించాడు.

పుణ్యమంత గూడి పురుషుడై జనియించె
పాపమంత గూడి పడతి యయ్యె
కష్టపు సతి యనుచు కని రోయ వెరతురు , విశ్వ

పూర్వజన్మలో చేసుకున్న పుణ్యఫలం వల్ల పురుషుడుగా జన్మిస్తాడు. దీనికి వ్యతిరేకంగా పూర్వజన్మలో చేసుకున్న పాపఫలం కారణంగా స్త్రీగా పుడతారు. స్త్రీ ఇంతటి పాపస్వరూపి కాబట్టే స్త్రీని చూడడానికి కూడా భయపడతారు.

ఆడుదనగ రోత అది చూడగా రోత
తలచి చూడ తనకు తానె రోత
ఎంత వారికైన యింతియే పెనుఘాత , విశ్వ

ఆడది అంటేనే రోత. ఆమెను చూడడం కూడా రోత. అంతేకాదు ఆలోచించి చూస్తే స్త్రీ తనకు తానే రోత. ఎంత గొప్పవారికైనా స్త్రీయే గొప్ప దెబ్బ

వేమన పైవిధంగా స్త్రీజాతిని నిందించి స్త్రీలను చూడగానే వారి అందాలకు బానిసలై వారి పొందును ఆశించి వారిని పెళ్ళి చేసుకొని వారికి లోబడి పోతున్న పురుషులను గూడా నిందిస్తూ కొన్ని పద్యాలను చెప్పాడు. సంసార సాగరంలో మునిగి దేవునికి దూరమౌతున్నారని వేమన పురుషులను అనేక రకాలుగా తిట్టాడు.

సతుల మాయ నమ్మి సౌఖ్యంబు గలదని
మతి విహీనులైరి మనుజులెల్ల
గతులు సతుల వలన కానంగ లేరయా , విశ్వ

స్త్రీల వల్ల సుఖం ఉందని నమ్మి పురుషులు స్త్రీల మాయలో మూర్ఖంగా పడిపోయి మోక్షానికి దూరమవుతున్నారు.

స్త్రీల మాయ చేత జిక్కి తాగొన్నాళ్ళు
తగులుగోరునట్లు తగిలి పోవు
తనిసి పొలిసి తాను దైవంబుచే జెడు , విశ్వ

పురుషులు స్త్రీల మాయలో చిక్కి వారికి లోబడిపోయి వారితోనే ఉంటూ దానికే తృప్తి పడిపోయి చెడిపోతున్నారు. అంటే పురుషులు కనీసం చివరి దశలోనైనా యోగులుగా మారకుండా చనిపోయేవరకూ స్త్రీలతో కలిసి కాపురం చేస్తూ మోక్షానికి దూరమవుతున్నారని వేమన విమర్శిస్తున్నాడు.

గొప్ప పిరుదు గన్న కుచకుంభములు గన్న
చెప్పరాని చోటి చెలువు గన్న
ముప్పిరి గొనునయ్య మొనసిన మోహము , విశ్వ

స్త్రీలలో ఉన్న విశాలమైన పిరుదులను, పెద్దవైన కుచాలను, యోని అందాన్ని చూడగానే పురుషులకు స్త్రీల మీద మోహం మూడు రెట్లు అవుతుంది.

తొడల మెరుపు జూడ దొడ్డ చన్నుల జూడ
వగలు జూడ వాని వన్నె జూడ
అయ్యల కెపుడైన ఆశలు పుట్టవా? , విశ్వ

స్త్రీల తొడల మెరుపు, పెద్దవైన స్తనాలు, వారి వగలు, అందచందాలు చూడగానే గొప్పవారైన పురుషులకు కూడా వారి మీద కోరికలు కలుగుతాయి.

ఇంతి కనులు చనులు యెంత లెస్సను చూచి
మోహపడుచు బుద్ధి మోసపోయి
గరిసెలోని వాని కానలేడాయెరా , విశ్వ

అందమైన స్త్రీలోని విశాలమైన కళ్ళు పెద్దవైన స్తనాలు చూసి ఎంత బాగున్నాయో కదా అని పురుషుడు ఆమె మీద మోహంతో మోసపోయి ఆమెకు దాసుడవుతాడు. అయితే గరిసె లాంటి ఆమె లోతైన మనసులోని మాయను మాత్రం అతను గ్రహించలేడు.

కడు విచిత్ర మరయ కామినీ మంత్రంబు
పువ్వుబోణి చుక్కబొట్టు గన్న
నరుని కాక్షణమున నెరసొక్కు బుట్టురా , విశ్వ

స్త్రీ మంత్రం లాంటిది. పువ్వులాంటి శరీరం, నుదుట చుక్కబొట్టు ఉన్న అందమైన యువతి



కనిపించగానే పురుషునికి వెంటనే నెరసొక్కు పుట్టి ఆమె వెంట పడిపోతాడు. అంటే స్త్రీ పేరు చెప్పగానే పురుషులు వారి వశమయి పోతున్నారని చెప్పడం.

స్త్రీల ముఖము జూచి చిత్తంబు నిలుకడ
చేయలేక నరుడు చెడుట గాదె
యేటి గట్టు మాను యెందాక నిలుచురా , విశ్వ

ఏటి గట్టు మీద ఉన్న మాను ఎంతో కాలం ఉండలేదు. ఎందుకంటే ఏరు భూమిని కోస్తూ ఉంటుంది. అలా కోయడం వల్ల మాను పడిపోతుంది. అలాగే పురుషులు స్త్రీల ముఖం చూచిన వెంటనే వారి మీద మనసు పారేసుకొని వారి వశమై చెడిపోతున్నారు.

జాణలైన యట్టి చపలాయతాక్షుల
వలపులరసి చూచి భ్రమయనేల?
బయలి రూపులెల్ల పరికింపగానేల, విశ్వ

అందమైన విశాలమైన చంచలమైన కళ్ళు కలిగిన స్త్రీల జాణతనానికి, పైకి కనిపించే వారి అందమైన శరీరానికి భ్రమపడి వారి ప్రేమలో పడిపోవద్దు. వారికి లోబడవద్దు.

అధర మమృత మనుచు ఆపేదవి గొరుకు
చొంగ కడుపులోన చొరవగాను
మలము తిత్తి మీద మనసెట్లు పుట్టెరా , విశ్వ

పురుషులు స్త్రీల పెదవులను ముద్దు పెట్టుకొని అధరామృతాన్ని ఆస్వాదిస్తూ ఉంటారు. నిజానికి అది అమృతం కాదు. ఆడవారి చొంగ. ఆచొంగ కడుపులోకి పోతూ ఉంటుంది. అది మలం తిత్తి లాంటిది. అలాంటి మలం తిత్తి మీదకు మనసు ఎట్లా పోతుంది?

బాల్యమందు తాను బహు విధముల బట్టి
చప్పరచినట్టి స్తనములకును
మోహమింత యేల మూఢాత్మ తెలియరా , విశ్వ

పురుషులు స్త్రీల స్తనాలను ఆశించి వారికి దాసులవుతూ ఉంటారు. పురుషుడు తాను శిశువుగా ఉన్నప్పుడు తల్లి స్తనాలను అనేక రకాలుగా పట్టుకొని నోటితో చీకి వదలివేసిన

స్తనాల మీద ఇంత మోహమెందుకురా మూర్ఖుడా? అని వేమన ప్రశ్నిస్తున్నాడు.

యోని యందె పుట్టి యోనికి రుచి జేసి
చన్ను గుడిచి పెరిగి చన్ను బట్టి
సృష్టిలోన నడగు సిగ్గెరుంగని జీవి , విశ్వ

పురుషునికి ఏమాత్రం సిగ్గు లేదు. ఎందుకంటే వాడు యోని నుంచి పుట్టి తిరిగి యోనిని ఆశిస్తున్నాడు. చన్ను తాగి పెరిగి పెద్దవాడై తిరిగి చన్నును ఆశిస్తున్నాడు. చివరకు నశిస్తున్నాడు. అలాంటి పురుషునికి సిగ్గు ఉందా? ఉంటే అలా చేయడని వేమన అభిప్రాయం.

ఉచ్చ చెలమ గోరి యున్నది జగమెల్ల
పిచ్చి బట్టి తిరిగి పెనగుచుంద్రు
తుచ్చ సుఖము దీని త్రుంపగ లేరయా , విశ్వ

వేమన స్త్రీయోనిని ఉచ్చచెలమ అంటున్నాడు. ప్రపంచమంతా అంటే పురుషులందరూ ఉచ్చచెలమ లాంటి స్త్రీయోనిని పిచ్చిపట్టినట్లుగా కోరుకుంటున్నారు. దీనివల్ల వచ్చేసుఖం అల్పమైనది. తుచ్ఛమైనది. అయినప్పటికీ పురుషులు దాన్ని తుంచలేకపోతున్నారు.

కూటికి ఎడబాసి కూర్చున్న మనుజుడు
వెలదుల గనుగొన్న వెతల బడును
చెలగి యగ్ని జూచు శలభంబు చాడ్పున , విశ్వ

మిడుత అగ్నిని చూచిన వెంటనే దానికి ఆకర్షింపబడి అందులో దూకి మాడిపోతుంది. అలాగే కూడు లేక ఆకలితో కూర్చున్న పురుషుడు కూడా స్త్రీని చూడగానే మన్మధతాపంతో బాధ పడతాడు.

ఔర యాడుదాని నాబ్రహ్మ సృష్టించె
పురుషు పాలిటి పెనుభూతమట్లు
దాని వలను చిక్కగాని వాడుండునే, విశ్వ

బ్రహ్మదేవుడు పురుషుని పాలిట పెద్ద దయ్యం లాగా స్త్రీని సృష్టించాడు. స్త్రీ వలలో తగులుకోని



పురుషుడు లేడు.

ఈ ప్రకరణంలో చెప్పిన పద్యాలను పరిశీలిస్తే వేమన స్త్రీ జాతి మీద ప్రత్యేకమైన ద్వేషాన్ని కలిగి ఉన్నట్లుగా స్పష్టమౌతుంది. లేకపోతే స్త్రీ జాతిని గురించి ఇంత దారుణంగా నిందించడు. ఇలా వేమన స్త్రీజాతిని నిందించడానికి గల కారణాలను గురించి పరిశీలించవలసి ఉంది.

# వేమన చేసిన స్త్రీ నిందకు కారణం

సంఘసంస్కర్త, దార్శనికుడు, అహింసావాది, పీడనకు గురిఅయ్యే వారి పట్ల అపరిమితమైన కరుణ, దయాస్వభావం ఉన్న వేమన తరతరాలుగా పీడనకు, వేదనకు గురి అవుతున్న స్త్రీ జాతి పట్ల ఏమాత్రం జాలి లేకుండా ఇంత నిర్దాక్షిణ్యమైన, ద్వేషపూరితమైన భావాలను వ్యక్తం చేయడానికి ఏదో బలమైన కారణం తప్పనిసరిగా ఉండాలి. లేకపోతే స్త్రీజాతిని నిందిస్తూ పని గట్టుకొని ఇన్ని పద్యాలను వేమన చెప్పడు. అయితే స్త్రీలను గురించి చెప్పిన పై పద్యాలన్నీ వేమన చెప్పినవే అని చెప్పలేం. వేమన చెప్పినవి కొన్ని ఉంటాయి. అతను చెప్పిన పద్యాలను బట్టి అతని భావాన్ని గమనించి ఆభావాలకు అనుగుణంగా మరికొంత మంది వేమన శైలిలో వేమన మకుటంతో కొన్ని పద్యాలను చెప్పి ఉంటారు. వీటిలో వేమన పద్యాలేవి? కానివేవి? అనే విషయానికి నేను పోవడం లేదు. మొత్తానికి వేమన తప్పనిసరిగా స్త్రీ జాతిని నిందిస్తూ కొన్ని పద్యాలను చెప్పాడు. దానికి గల కారణాలను గురించి వివరించే ప్రయత్నం చేస్తాను.

వేమనలోని స్త్రీనిందను గురించి, అందుకు గల కారణాన్ని గురించి అత్యున్నత విద్యావంతుడు, తెలుగుభాషలో మంచి పండితుడు, సంస్కృత భాషలో తగినంత ప్రవేశం కలిగినవాడు, తత్వశాస్త్రవేత్త, క్రైస్తవ మిషనరీ అయిన విలియం హోవర్డ్ క్యాంబెల్ ఇలా వివరించాడు. "ఈవిధముగా నారీజనమును నిందించుటచే హైందవ మృషాచారములను వేమన అధిగమించి పైకి రాలేకపోయినట్లు వ్యక్తమగుచున్నది. ఇది వేమనకు ఒక అపజయమనవచ్చును. అక్కడక్కడ కొన్ని పద్యములలో పాతివ్రత్యము, భక్తివిశ్వాసములు కలిగిన సత్యశీలులైన గృహిణులను ప్రశంసించుట కూడా కలదు; దీనివల్ల ఆయనకు ఉత్తమమును ఉన్నతమును అయిన స్త్రీత్వము మీద కొంత గౌరవము కలిగియుండినట్లు ద్యోతకమగుచున్నది. కానీ, ఎక్కువ మంది తన తోడి దేశీయుల వలెనే- నారి అబలయని అవిశ్వాసిని అని, వారి పలుకుబడి అంతా సాధారణముగా చెడ్డ వైపుకే మొగ్గియున్నదని వేమన నమ్మినట్లున్నది. ఆతనికి యీ అభిప్రాయము కలిగియుండుటలో వింత ఏమీ లేదు. భారతదేశములో ఉదార సంఘసంస్కరణములకు స్త్రీలే పట్టుదలతో విరోధమును



చూపుచున్నారు. ఈ వ్యతిరేకత వల్లనే తన ప్రాబల్యము తగ్గినదని వేమన గుర్తించి యుండును. ఆడువారి స్వభావసిద్ధమైన సంకుచిత భావదాస్యము, పురాతన సంప్రదాయములు ఆచారముల పట్ల వారు ప్రదర్శించు అంధానుమతి వేమనకు దిగ్భ్రమ గొలిపి, ఆయన కార్యోత్సాహమును కొంత మందగించి యుండును"[1]. క్యాంబెల్ ఈఅభిప్రాయాన్ని నార్ల వెంకటేశ్వరరావు గారు కొంత వరకు సమర్థిస్తూ ఇలా చెప్పారు. "ఏమైనా స్త్రీల విషయంలో వేమనవి విప్లవాత్మకమైన అభిప్రాయాలు కావు. సంకుచితమైన పూర్వాచారబద్ధమైనవి. వేమనకు గల ఈసంకుచిత దృష్టికి క్యాంబెల్ ఒక కారణాన్ని చూపి సమర్థిస్తున్నాడు. --- క్యాంబెల్ అభిప్రాయంలో నిజం లేకపోలేదు. కాని భారతదేశంలో స్త్రీలు వెనుకబడడానికి పురుషులే గదా కారణం? యుగాల తరబడి వారు స్త్రీలకు స్వాతంత్ర్యాన్ని , విద్యను, ప్రగతిని తిరస్కరించలేదా? సగభాగం స్వతంత్రంగా మరొక సగభాగం బానిసగా, సగభాగం విద్యావంతులుగా మరొక సగభాగం నిరక్షరాస్యులుగా, కొందరు పురోగాములుగా అనేకులు తిరోగాములుగా ఉన్న ఏ సమాజమైనా ప్రగతి పొందగలదా? అటువంటి సమాజంతో రెండవ సగం బరువుగ, భారంగ ఉంటే దానికి కారణమా మొదటి సగానిదే అని చెప్పక తప్పదు"[2]. అని స్త్రీలు వెనుకబడి ఉండడడానికి పురుషులే కారణమని చెప్పారు.

అయితే ఈఅభిప్రాయం సత్యమని చెప్పలేం. ఎందుకంటే స్త్రీలకు ఆనాడు ఎలాంటి స్వేచ్ఛ లేదు. దురంకార పురుషసమాజం చెప్పుచేతల్లో అణగిమణగి ఉన్న ఆనాటి స్త్రీలకు వేమన తలపెట్టిన సంస్కరణలకు అవరోధం కలిగించాలన్న ఆలోచన కానీ, ధైర్యం కానీ ఉండే అవకాశమే లేదు. పురుషులు తమ స్త్రీలను ఇంటినుంచి బైటికి పంపేవారే కాదు. ఇంట్లోనుంచి బైటికి వెళ్ళడానికి అవకాశం లేని స్త్రీలు వేమన సంస్కరణలను అడ్డుకోవడం సాధ్యం కాదు. ఏనాడైనా సంస్కరణలను అడ్డుకున్నది సంప్రదాసులైన పురుషులే కానీ

1. వేమన - పాశ్చాత్యులు; తెనుగుసేత - మరుపూరు కోదండరామ రెడ్డి పుట- 88,89

2. వేమన; వి. ఆర్. నార్ల; పుట-76

స్త్రీలు కాదు. సంప్రదాయ దాసులైన ఇలాంటి పురుషులు ఎంతటి పనైనా చేయగలరు. తన సంస్కరణలను అడ్డుకున్న పురుషజాతిని నిందిస్తూ వేమన ఒక్క పద్యం గూడా చెప్పలేదు. పురుషుల్లో దుర్మార్గులు, వేశ్యాలోలురు మొదలైన చెడ్డవారిని, వ్యసనాలకు బానిస అయిన వారిని నిందిస్తూ వేమన పద్యాలను వెప్పాడు కానీ పురుషజాతి మొత్తాన్ని నిందిస్తూ పద్యాలు చెప్పలేదు. కాబట్టి వేమన చేసిన స్త్రీనిందకు క్యాంబెల్ చెప్పినట్లుగా స్త్రీలు వేమన సంస్కరణలకు అవరోధం కలిగించడం కారణం కాదు. ఒకవేళ స్త్రీలలో కొందరు వేమన సంస్కణలకు అవరోధం కలిగించినా వారి కారణంగా వేమన స్త్రీజాతి మొత్తాన్ని నిందించాడని చెప్పడం ఉచితం కాదు. వేమన స్త్రీనిందకు ఏదైనా సైద్ధాతికపరమైన కారణం ఉండాలి.

వేమన బాల్యాన్ని గురించి, యవ్వనంలో అతడు ప్రవర్తించిన విధానాన్ని గురించి మనకు స్పష్టంగా తెలియక పోయినా, యవ్వనానంతర దశలో అతడు యోగిగా మారి శరీరశుభ్రతను పట్టించుకోకుండా గడ్డం మీసాలు పెంచి, గోచి మాత్రమే ధరించి గానీ లేదా అది గూడా వదలివేసి పూర్తి దిగంబరంగా గానీ సంచరించినట్లుగా అతని చిత్రపటాలను బట్టి తెలుస్తుంది. కాబట్టి వేమన తప్పనిసరిగా యోగిగా మారాడని మనం నిశ్చయంగా చెప్పవచ్చు. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు తమ 'నాథయోగి మన వేమన' అనే గ్రంథంలో వేమన నాథ సంప్రదాయానికి చెందిన యోగి అని నిరూపించి నాథసంప్రదాయ సిద్ధాంతాలను గురించి ఇలా చెప్పారు. "సంసారసౌఖ్యమునను స్వప్నమందైనను కోరరాదు, సంసార జలధిలో పడుట మూఢుల అజ్ఞానకృత్యము, స్త్రీలు ఘనపాపరతలు అను సిద్ధాంతములు నాథసంప్రదాయ సిద్ధాంతములనుటకు గౌరన నవనాథ చరిత్రలోని గోరక్షనాథుని వృత్తాంతము మాత్రమే గాక, ఔత్తరాహమైన గోరక్షనాథుని వివాహకథ కూడానిదర్శనమే"[3].

ఆచార్య కొర్లపాటి వారు గోరక్షనాథుని వృత్తాంతాన్ని బట్టి చెప్పిన దాని ఆధారంగా సంసారసుఖాన్ని కలలో గూడా కోరకపోవడం, సంసారసాగరంలో పడడం

3. నాథయోగి మన వేమన, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి, పుట - 80



మూర్ఖత్వం, స్త్రీజాతి గొప్ప పాపిష్టిది అనే మూడు సిద్ధాంతాలను యోగులు పాటిస్తారని తెలుస్తూ ఉంది. ఇందులో మొదటి లక్షణాన్ని రెండవ లక్షణాన్ని కలిపి సంసారాన్ని నిరసించడం అనే ఒకేలక్షణంగా చెప్పవచ్చు. రెండవది స్త్రీలు గొప్ప పాపిష్టివారు. ఈరెండు సిద్ధాంతాలకు సంబందించిన పద్యాలు వేమన పద్యాల్లో ఉన్నాయి. ఇందులో ముఖ్యమైనది స్త్రీలు గొప్ప పాపప్రియులు. యోగులు స్త్రీజాతి మొత్తాన్ని గొప్ప పాపులుగా భావిస్తారు, కాబట్టే వారిని నిందిస్తారు. అంటే యోగులు అసహ్యమైన పదాలతో స్త్రీనింద చేయడం సిద్ధాంతపరమైనది. యోగులు శరీరసుఖాలను వదలివేసి భగవంతుని ధ్యానంలో జీవితాన్ని గడుపుతారు. మానవుడు మిగిలిన సుఖాలను సులభంగా జయించవచ్చు గానీ స్త్రీసుఖాన్ని జయించడం అంత సులభం కాదు. ఎందుకంటే స్త్రీపురుషుల మధ్య ఆకర్షణ ప్రకృతి సహజమైనది. స్త్రీలోని అందాలు పురుషులను వారికి లొంగిపోయేలాగా చేస్తాయి. స్త్రీలలోని అందమైన ముఖం, స్తనాలు, కటిప్రదేశం, యోని మొదలైన వాటికి పురుషులు బానిసలై వారికి దాసులవుతుంటారు. ఇలాగా స్త్రీదాసులయినంత కాలం పురుషులు యోగులు కాలేరు. మొదట స్త్రీసుఖాన్ని త్యజించిన తర్వాతనే యోగిగా మారడానికి అర్హుడవుతాడు. పురుషుని యొక్క యోగజీవితానికి మొదటి ప్రతిబంధకం స్త్రీ. కాబట్టి యోగులు స్త్రీలను, వారిలో పురుషులను ఆకర్షించే అందమైన అవయవాలను అసహ్యించుకుంటూ స్త్రీ నింద చేస్తారు. యోగజాతి లక్షణాన్ని బట్టి వేమన గూడా మిగిలిన యోగుల మాదిరిగానే స్త్రీనింద చేశాడు. అతడు యోగిగా మారిన తర్వాత అందులోని మాధుర్యాన్ని రుచి చూసిన తర్వాత యవ్వనంలో తనను మురిపించి స్త్రీలోలునిగా చేసినది స్త్రీలోని అందాలే కాబట్టి వాటిని అసహ్యించుకుంటూ పద్యాలను చెప్పాడు.

అంతేగాకుండా వేమన ( వేమన ముందు భోగి అయి ఆతర్వాత యోగి అయ్యాడు)కంటె భిన్నంగా కొంత మంది యోగులు స్త్రీల అందాలకు దాసులై యోగాన్ని వదిలి పెట్టి భోగులుగా మారి ఉంటారు. గౌరన నవనాథచరిత్రలోని గోరక్షనాథుని వృత్తాంతం దీనికి మంచి ఉదాహరణ. నవనాథుల్లో మొదటివాడైన మత్స్యేంద్రనాథుడు స్త్రీవాంఛకు లోనై యోగరాజ్యసుఖాన్ని వదలివేసి భోగరాజ్యసుఖాన్ని కోరుకుంటాడు.

ఈవిధంగా తమ యోగజాతిని భ్రష్టు పట్టిస్తున్న స్త్రీజాతి పట్ల యోగులకు, యోగి అయిన వేమనకు తీవ్రమైన ద్వేషం ఉండడం సహజం. అందువల్లనే యోగి అయిన వేమన స్త్రీజాతి మొత్తాన్ని ద్వేషిస్తూ పద్యాలను చెప్పాడు. మత్స్యేంద్రనాథుని లాగా స్త్రీల అందానికి దాసులై భోగులుగా మారిన కొంత మంది యోగులను గురించి వేమన కొన్ని పద్యాలు చెప్పాడు.

మంత్రమెల్ల మరచి మధురాధరము దల్చు
నేవిధమున భక్తుడెరగు నిమ్న
యోని జూచి పరమ యోగంబు మరచురా , విశ్వ

యోగి స్త్రీ అందానికి దాసుడై తాను పఠించే భగవంతుని మంత్రాలను మరచిపోయి స్త్రీఅధరామృతాన్ని తలుచుకుంటున్నాడు. గొప్పదైన పరమయోగాన్ని మరచిపోయి తుచ్ఛమైన స్త్రీయోని కోసం పాకులాడుతున్నాడు. ఇలాంటి వాడు భగవంతుని ఏవిధంగా తెలుసుకోగలడు.

యోనిలోనె పుట్టి యోనిలోనె పెరిగి
యోనిలోని తెరువు గానలేక
యోని జూచి పరమ యోగంబు మరచురా , విశ్వ

యోగి అయిన పురుషుడు స్త్రీయోని నుంచి పుట్టి యోనిలోనే పెరిగి ఆయోని యొక్క నైచ్యం తెలుసుకోకుండా తిరిగి స్త్రీయోనిని ఆశించి పరమయోగాన్ని మరచిపోతున్నాడు.

అధర సుధను జూచి అన్నియు మరచును
తరుణి రూపు జూచి తన్ను మరచు
యోని జూచి బ్రహ్మయోగంబు మరచురా , విశ్వ

యోగి స్త్రీఅధరామృతాన్ని చూచి భగవధ్యానం మొదలైన వాటి నన్నింటనీ మరచిపోతున్నాడు. స్త్రీల అందచందాలను చూచి తనను తాను మరచిపోయి వారికి దాసానుదాసుడవుతున్నాడు. చివరకు స్త్రీయోని చూచి గొప్పదైన బ్రహ్మయోగాన్ని మరచిపోతున్నాడు.



కొప్పు చెలువు గన్న కుచ కుంభములు గన్న
చెప్పరాని తావు చెలిమి గన్న
ముప్పిరి గొనుచుండు మునికైన మోహంబు , విశ్వ

కొప్పులోని అందం, పెద్దవైన స్తనాలు, సంభోగం సమయంలో యోని వల్ల అతనికి కలిగిన ఆనందం మొదలైనవన్నీ చూచిన తర్వాత స్త్రీల మీద మునులకు గూడా వ్యామోహం మూడు రెట్లు పెరుగుతుంది.

సతుల వలపు జూచి యతులు మోహింతురు
లోకనింద కెల్ల లోను గాను
పిట్ట దొరికె నపుడె పిల్లికి కుశలమౌ , విశ్వ

స్త్రీలు పిల్లుల వంటివారు. యతులు పిట్టల వంటివారు. పిల్లి పిట్టలను కాపుగాసి వేటాడినట్లుగా స్త్రీలు తమ వలపుతో యతులను లోబరచుకొని తమకు దాసులుగా చేసుకుంటున్నారు. దాని వల్ల యోగులు చపలచిత్తులని లోక నిందకు గురి అవుతున్నారు.

కాంతల వల్ల యోగులు నిందల పాలు అవుతున్నారు కాబట్టే యోగులు కాంతలను వదలిపెట్టాలని, అలా వదలిపెట్టిన వారే నిజమైన యోగులని వేమన కింది పద్యాల్లో చెప్పాడు.

కాంత యందె వెడలి కాంతకై యాశించి
గాసి పడగ నేల కాంత చేత
కాంత విడుచు వాడు ఘనతర యోగిరా , విశ్వ

పురుషుడు ఒక స్త్రీ వల్ల భూమి మీదకు వచ్చి, మరొక స్త్రీని పెళ్ళి చేసుకొని సంసార సాగరాన్ని ఈదలేక పడరాని పాట్లు పడుతున్నాడు. పురుషుని కష్టాలకు మూలం స్త్రీలే. అందువల్ల స్త్రీని విడిచిపెట్టినవాడే గొప్పయోగి.

చన్ను గుడిచి పెరిగి చన్నుపై నాశించె
చన్ను వలన ముక్తి చప్పనయ్యె
చన్ను విడుచు వాడు సర్వదా యోగిరా , విశ్వ

పురుషుడు శిశువుగా ఉన్నప్పుడు ఒక స్త్రీ చన్ను తాగి పెరిగి పెద్దవాడై, శారీరక సుఖం

కోసం మరొక స్త్రీ చన్నును ఆశిస్తున్నాడు. అలా ఆశించడం వల్ల అతను ముక్తికి దూరమవుతున్నాడు. అందువల్ల చన్ను వదలిపెట్టిన వాడు అంటే స్త్రీలకు ఎల్లప్పుడు దూరంగా ఉన్నవాడు శాశ్వతంగా యోగి అవుతాడు.

ఇంతలేసి కన్నులింతేసి చన్నుల
యింతి గవయ కుండి యెసగు మహిమ
సరగ బాయకున్న సర్వదా యోగిరా , విశ్వ

విశాలమైన కళ్ళు, పెద్ద స్తనాలు ఉన్న స్త్రీని చూసి ఏమాత్రం చలించకుండా నిగ్రహం చూపిన వాడే నిజమైన శాశ్వతమైన యోగి.

పంకజాక్షి గన్న బంగారు పొడ గన్న
రిమ్మ బుట్టు యోగి నమ్మరాదు
మనసు నిలుపు వాడు మరి మహాయోగిరా , విశ్వ

అందమైన స్త్రీని, బంగారాన్ని ఆశించేవాడు యోగి కాదు. యోగిరూపంలో ఉన్న అలాంటి వాళ్లే నమ్మగూడదు. ఈరెండింటినీ ఆశించని వాడు గొప్పయోగి. కింది పద్యం గూడా ఇదే భావంతో చెప్పబడింది.

బంగారు పొడగన్న పణతుల పొడగన్న
చంచలింపకున్న చిత్తమందు
వాడె పరమ యోగి వర్ణింప జగమందు , విశ్వ
చదువులందు రాజపదవులందు పాడి
మొదవులందు స్త్రీల పెదవులందు
ఆశలు డిగిసట్టి అయ్యలు ముక్తులు , విశ్వ

గొప్ప చదువులు చదివిన వారికి గొప్ప పేరు వస్తుంది. గొప్ప పేరు వల్ల స్త్రీలు సులభంగా అందుబాటులోకి వస్తారు. గొప్ప పదవులున్న వారికి కూడా స్త్రీ సుఖం అందుబాటులో ఉంటుంది. సమృద్ధిగా పాడి ఉన్నవారికి పాలు పెరుగు వెన్న నెయ్యి అందుబాటులో ఉంటాయి. ఇవన్నీ కామాన్ని ఎక్కువ చేస్తాయి. అలాంటివాడు స్త్రీసుఖం కోసం పరితపిస్తాడు.



కాబట్టి పైవాటన్నింటినీ మీద, వాటితో పాటు స్త్రీల మీద ఆశ లేని వారు ముక్తిని పొందుతారు.

ఏసూత్ర మరసి చూచిన
స్త్రీ సూత్రంబదియు గాక సిద్ధము గానన్
నాసూత్రము స్త్రీ సూత్రము
నాసూత్రము తెలియు వాడు నాధుడు వేమా

ఏవిధంగా చూసినప్పటికీ స్త్రీలే అన్ని సమస్యలకు ప్రధానకారణం. అందువల్లనే వారిని తక్షణమే వదలివేయాలి. కాబట్టి తన సిద్ధాంతంలో ప్రధానమైనది స్త్రీపరిహరణ. తన ఈ సూత్రం తెలిసినవాడు నాధుడు అవుతాడని వేమన తన సిద్ధాంతాన్ని స్పష్టంగా చెప్పాడు. ఈవిధంగా వేమన స్త్రీజాతి గొప్ప పాపిష్టిదని నమ్మి వారిని తీవ్రంగా ద్వేషిస్తూ పద్యాలు చెప్పాడు.

యోగుల రెండవ లక్షణం సంసారసుఖాన్ని నిరసించడం. సంసారం సాగరం లాంటిదని, దానిలో అనేక కష్టాలు పడవలసి ఉంటుందని అందులో నుంచి బైట పడడం కష్టమని, అందువల్ల తెలివైన వారు సంసారసుఖాన్ని కలలో గూడా కోరగూడదని, అలా కోరుకోవడం మూర్ఖుల లక్షణమనేది యోగుల సిద్ధాంతం. ఈసిద్ధాంతానికి అనుగుణంగా వేమన పురుషుడు పెళ్ళి చేసుకొని సంతానాన్ని కని వారిని పోషించడం కోసం నానా కష్టాలు పడి చివరకు మోక్షానికి దూరమై చెడిపోతున్నాడని సంసారాన్ని నిందిస్తూ చాల పద్యాలు చెప్పాడు.

కడుపులోన మలము కండలు నెముకలు
నరసి చూడ పైని మురికి తోలు
యేటి కాపురంబు యేమిటి సౌఖ్యంబు , విశ్వ

మానవదేహం కడుపులో మలంతో కండలు ఎముకలతో, వీటిని కప్పివేసిన మురికి తోలుతో కూడుకొని ఉంది. ఇలాంటి అసహ్యమైన దేహంతో కూడిన స్త్రీపురుషులు కాపురం ఎలా చేస్తారు. ఏమి సుఖం పొందుతారు.

సతుల బడయరాదు సుతుల బడయరాదు
వెతల బడినవాడు పెర్రివాడు
నేలనున్న రాయి నెత్తి కెత్తినయట్లు , విశ్వ

స్త్రీలను పెళ్ళిచేసుకోవడం, సంతానాన్ని పొందడం ఆతర్వాత వారిని పోషించడానికి అనేక పాట్లుపడడం ఇదంతా పిచ్చితనం. అది పిచ్చివాడు ఊరక ఉండలేక నేల మీద ఉన్న రాయిని నెత్తి మీదకు ఎత్తుకోవడం లాంటిది.

భార్య తనదు పాలి భారపు సంకెల్
చిన్న చిన్న శిసువు జింజిరీలు
అరయగ చెరసాల యగును సంసారము , విశ్వ

భార్య పురుషుని పాలిట బరువైన సంకెల లాంటిది. పిల్లలు కాలిగొలుసుల వంటివారు. బరువైన సంకెళ్ళు, కాలిగొలుసు ఉన్నవాడు ఎక్కడకీ కదలలేడు. అందువల్ల వీటితో కూడుకున్న సంసారం చెరసాల లాంటిదని వేమన చెబుతున్నాడు. కింది పద్యం గూడా ఇలాంటిదే.

దార బందిగంబు, తనయులు సంకెలల్
బంధువర్గ మెల్ల ప్రహరిగోడ
మోహమెరుగ లేడు మొక్కలికాడయా , విశ్వ

పురుషునికి భార్య చెరసాల, సంతానం సంకెళ్ళు, మిగిలిన బంధువులందరూ ప్రహరి గోడ లాంటి వారనే విషయం తెలుసుకోకుండా మూర్ఖుడై మోహబంధంలో చిక్కుకొని చెడిపోతున్నాడు.

తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంత చుట్టుకొనిన నంత చేటు
పసిరికాయ పురుగు పద్ధతి గానరో , విశ్వ

పసిరికాయ అంటే పట్టుపురుగు. పట్టుపురుగు మొదట గొంగళి పురుగుగా ఉండి కడుపులో నుంచి దారాన్ని లాగి తన చుట్టూ తాను బంధించుకుంటూ గుండ్రంగా తయారై లోపల



ఇరుక్కొని పోతుంది. మానవుడు గూడా పట్టుపురుగు లాగానే భార్యా, సంతానం, ధనం, ధాన్యం, సంపద మొదలైన వాటి వలలో తగులుకుంటున్నాడని, ఆబంధాలు ఎంతగా తగులుకుంటే అంత ప్రమాదమని వేమన చెబుతున్నాడు.

పట్టి మమత జిక్కి వావి వరస జేసి
తిక్క యెత్తి నరుడు తిరుగు గాక
యెక్కడి తలిదండ్రు లేమియు దనకేల , విశ్వ

మానవుడు నాతల్లిదండ్రులు, నాభార్యాపిల్లలు అనే మమకారంలో తగులుకొని పిచ్చి పట్టి తిరుగుతున్నాడు. ఇవన్నీ మాయ. చనిపోయిన తర్వాత ఇవన్నీ ఎక్కడికి పోతాయో గదా. కాబట్టి ఇలాంటి మమకారాలకు లోను కావద్దని వేమన చెబుతున్నాడు.

దినము మూడు మార్లు దిని నిదిరించుచు
సొగసు చనుల వారి సొంపుతోడ
చేరుచుండి కడకు చెడి చావబోకుము , విశ్వ

రోజుకు మూడు సార్లు తిని నిద్రపోతూ అందమైన స్తనాలు కలిగిన స్త్రీలతో కూడి వాటినే పరమార్థంగా భావించి అన్ని రకాలుగా చెడిపోయి చివరకు చనిపోవద్దు అని వేమన ప్రజలకు హితబోధ చేశాడు. తిండి, నిద్ర, మైథునం ఇవి మూడు జంతువులు కూడా చేస్తాయి. అవి మూడు మాత్రమే చేసే మనుషులకు జంతువులకు తేడా లేదని వేమన చెబుతున్నాడు.

సతిని జూచి చూచి సౌఖ్యంబు తాగోరు
గతిని కానలేడు కర్మజీవి
గతులు సతుల వలన కానంగ లేరయా , విశ్వ

పురుషుడు భార్యను కూడి సుఖాన్ని పొందాలనుకుంటాడు. అయితే అలాంటి పురుషుడు చనిపోయిన తర్వాత ఎలాంటి ఉత్తమ లోకాలను పొందలేడు. అలా పొందలేక పోవడానికి కారణం స్త్రీలే.

సతుల చూడచూడ సంసారి కాగోరు
సుతులు పుట్ట పుట్ట వెతల బడును
గతులు చెడగ చెడగ కర్మమం చేడ్తురు , విశ్వ

పురుషులు స్త్రీలను చూసి వారివల్ల సుఖాలు పొందాలనుకొని వారిని పెళ్ళి చేసుకుంటారు. ఆయితే ఆతర్వాత సంతానం కలుగుతూ ఉంటే వారిని పెంచి పోషించలేక అనేక కష్టాలు పడతూ చివరకు మన కర్మ అనుకొని దుఃఖిస్తూ ఉంటారు.

సుతుల చేత పుణ్య సుఖము నొందుదునని
మనుజుడుండు కర్మమతము దగిలి
ఏనుగు పడియున్న ఎత్తునా మశకంబు , విశ్వ

పుత్రుని గురించి మన వారు "పున్నామ్నో నరకాత్రాయత ఇతి పుత్రః" అని చెప్పారు. పుం అనే పేరు గల నరకం నుంచి రక్షిస్తాడు కాబట్టి అతనికి పుత్రుడు అనే పేరు వచ్చింది. ఇది నిజమని నమ్మి మానవులు కుమారుల వల్ల తాము మరణించిన తర్వాత ఉత్తమలోకాలకు వెళ్తామని భావిస్తూ కుమారులు కావాలని కోరుకుంటూ ఉంటారు. దీన్ని వేమన ఖండిస్తూ ఏనుగు కిందపడిపోయి ఉంటే దోమ దాన్ని ఎత్తుతుందా? అని ప్రశ్నిస్తున్నాడు. ఎవరు చేసుకున్న పాపపుణ్యాలను బట్టి వారికి మరణానంతరం అధమ, ఉత్తమలోక ప్రాప్తి కలుగుతుంది. అంతేగానీ గొప్ప పాపం చేసిన వాడు కుమారుని కనడం వల్ల ఎలాంటి ఉత్తమలోకాలను పొందలేడు.

ఆలు బిడ్డలనుచు అతిమోహమున నున్న
ధనము మీద వాంఛ దగిలియున్న
అట్టి నరుల కెల్ల అవని ముక్తియె లేదు , విశ్వ

భార్యాపుత్రుల మీద ఎక్కువ మమకారం ఉన్నవారు, ధనం మీద కోరిక ఉన్నవారు ఎప్పటికీ ముక్తిని పొందలేరు.

తల్లిదండ్రి చావ తానాలితో గూడి
ఇల్లు గట్టుకొన్న ఇంపులెల్ల



కొరత మీద దొంగ కూడడగిన యట్లు , విశ్వ

పూర్వం గుదంలోకి పెద్దమేకు దించి మరణ శిక్ష అమలు చేసేవారు. దీన్నే కొరత వేయడం అంటారు. తల్లిదండ్రి చనిపోవడం చూసిన తర్వాత, కొడుకు తన సంసారం కోసం ఇల్లు కట్టుకోవడం అనేది కొరత వేయబడిన దొంగ ఆహారం అడగడం లాంటిదని వేమన చెబుతున్నాడు. కొరత వేయబడిన వాడు చెప్పలేనంత బాధతో మరణానికి సిద్ధంగా ఉంటాడు. అలాంటి వానికి ఆహారం అవసరం లేదు. అలాగే తనను కని పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులు చనిపోవడం చూచిన తర్వాత తాను కూడా చనిపోవడం తప్పదు అని భావించి, పురుషుడు అన్నీ త్యజించి యోగి అయి మోక్షకాంక్ష కలిగి ఉండాలి గానీ తాను శాశ్వతంగా భూమి మీద ఉంటున్నట్లుగా ఇల్లుకట్టుకోవడం కూడదని వేమన చెప్పాడు.

భవము సాగరంబు, భార్యయే మకరము
చేప జలగలగును శిశువులెల్ల
భవహరుం దలపక పార మందగలేరు , విశ్వ

సంసారం సాగరం లాంటిది. భార్య మొసలి, పిల్లలు చేపలు జలగల వంటి వారు. భవహరుడైన ఈశ్వరుని తలచకుండా సంసారసాగరాన్ని ఎవరూ దాటలేరు.

కాలధర్మ మెరిగి కపట వృత్తులు మాని
ఆలు పిల్లలందు ఆశ వదలి
మేలుగాను శివుని మేల్కొని చూడరా , విశ్వ

కాలధర్మాన్ని తెలుసుకొని మోసపు పనులు మానివేసి భార్యాపిల్లల యందు ఆశ వదలివేసి ముందుగానే మేల్కొని శివుని చూడాలి. అంటే సంసారాన్ని రోసి యోగిగా మారిపోయి ఎల్లప్పుడు భగవంతుని తలుస్తూ ముక్తిని పొందాలని వేమన చెబుతున్నాడు.

సతులు సుతులు మాయ సంసారములు మాయ
ధనము ఘనము మాయ తనువు మాయ
మాయ గెల్చువాడు మర్మజ్ఞుడగు యోగి , విశ్వ

భార్యాపిల్లలతో కూడుకున్న సంసారం, ధనం, దానివల్ల వచ్చిన గొప్పతనం, అందమైన శరీరం ఇవన్నీ మాయ. ఈమాయను జయించినవాడే మానవజన్మ రహస్యాన్ని తెలుసుకున్న నిజమైన యోగి.

జడలు దాల్చుటెల్ల జగము సీయనుటెల్ల
యొడలు విరుచుటెల్ల
ముక్తికాంత బట్టి ముద్దాడు కొరకురా , విశ్వ

సంసారాన్ని వదలిపెట్టి తన దేహాన్ని గురించి పట్టించుకోకుండా, శరీరశుభ్రతను వదలివేసి జడలు పెంచడం, ఈప్రపంచం మాయ అని గ్రహించి దాన్ని అసహ్యించుకోవడం చివరకు నశ్వరమైన శరీరాన్ని వదలివేడం ముక్తిని పొందడానికేనని వేమన చెప్పాడు.

ఈవిధంగా వేమన సంసారసుఖాన్ని నిరసిస్తూ అనేక పద్యాలను చెప్పాడు. మానవ జన్మకు మూలకారణం స్త్రీపురుషుల కలయిక. ఈకలయికకు మూలమైన వారి జననాంగాలు మూత్రంతో కూడుకున్నవి. అందువల్లనే వేమన మానవ జన్మ హేయమైన మూత్రంతో కూడుకున్నదని దాన్ని నిందించాడు. అలా నిందించడం గూడా యోగుల లక్షణమే.

అత్త మామ యుచ్చ నాలయి జన్మించె
నాలు మగని యుచ్చ నయ్యె సుతుడు
ఉచ్చ బ్రతుకు కింత యుత్సాహపడుదురు , విశ్వ

అత్త మామ మూత్రం కలిసి భార్యగా జన్మిస్తుంది. తన యొక్క తన భార్య యొక్క మూత్రం కలిసి కుమారుడుగా జన్మించాడు. అందువల్ల మానవజన్మ నీచమైన మూత్రం కారణంగా జరుగుతూ ఉంది. ఇంత నీచమైన మూత్రపు బ్రతుకు కోసం ఎందుకు ఇంత ఉత్సాహాన్ని చూపిస్తున్నారు?

ఉచ్చలోనె బుట్టి ఉచ్చలోనె పెరిగి
ఉచ్చకాశపడుట ఉచిత మగునె
ఉచ్చరోయు వాడె ఉత్తమయోగిరా , విశ్వ



నీచమైన మూత్రంలో పుట్టి మూత్రంలో పెరిగి, తిరిగి మూత్రంతో కూడుకున్న స్త్రీసంభోగం కోరుకోవడం ఉచితం కాదు. కాబట్టి స్త్రీ సంభోగాన్ని అసహ్యించుకునే వాడే ఉత్తమమైన యోగి.

ఈవిధంగా వేమన యోగి కావడం వల్లనే స్త్రీజాతిని నిందించాడు. సంసారసుఖాన్ని కూడా నిందించాడు. అంతేగాకుండా మానవజన్మ హేయమైనదని నిరసించాడు. ఇవన్నీ యోగి లక్షణాలు. అంటే వేమన ఒక సిద్ధాంతానికి కట్టుబడి స్త్రీనింద చేశాడు. సిద్ధాంతం కారణంగా వేమన చేసిన స్త్రీనిందను మనం పట్టించుకొనవలసిన అవసరం లేదు.

ఏవ్యక్తిలోనైనా జన్మతో వచ్చే లక్షణాలు ఒక్కసారిగా బైట పడవు. అవి వయసుతో పాటు దినదిన ప్రవర్ధమానమవుతూ ఉంటాయి. వేమనలో యోగిలక్షణాలు గానీ కవిత్వం చెప్పే గుణం కానీ యవ్వనానంతరం ఒక్కసారిగా వచ్చినవి కావు. బాల్యం నుంచి అతనిలో ఆలక్షణాలు ఉంటాయి. అయితే యవ్వనంలో శారీరకసంబంధమైన కోరికలు బలంగా ఉండడం చేత వాటికి లోబడి వేమన స్త్రీలతో సంబంధాలు పెట్టుకొని ఉంటాడు. అతను పెళ్ళి చేసుకున్నదీ లేనిదీ స్పష్టంగా తెలితదు. కానీ స్త్రీలతో ముఖ్యంగా వేశ్యలతో మాత్రం అతనికి సంబంధం ఉంది. వేశ్యలతో పరిచయం లేకుండా వేశ్యల గురించి, వారి ప్రవర్తన గురించి, వారి మనస్తత్వాన్ని గురించి ( వేమన వేశ్యలను గురించి చెప్పిన పద్యాలను చూడండి) అంత చక్కని పద్యాలను చెప్పలేడు. వేమన భోగిగా ఉన్నప్పటి నుంచి కవిత్వం చెప్పేవాడు. ఆసమయంలో అతనిలో సంప్రదాయమైన భావాలు ఉండి ఉంటాయి. ఆవయసులోనే పతివ్రతలను గురించి, విధవలను గురించి, గయ్యాళి భార్యలను గురించి, వేశ్యలను గురించి పద్యాలను చెప్పి ఉంటాడు. అలాగే తల్లిని గురించి చెప్పిన పద్యాలు గూడా వేమన యోగిగా మారక ముందు చెప్పి ఉంటాడు. వేశ్యల ప్రవర్తనను, వారి మనస్తత్వాన్ని గురించి చెప్పినట్లుగానే గయ్యాళి స్త్రీల ప్రవర్తనను, వారి మనస్తత్వాన్ని గురించి కూడా వేమన చక్కని పద్యాలను చెప్పాడు. వేమన పెళ్ళి చేసుకొని ఉంటే బహుశా అతని భార్య గయ్యాళి అయి ఉండాలి. స్వానుభవం ఉంటే తప్ప అంత చక్కగా గయ్యాళి స్త్రీల

ప్రవర్తనను వివరించలేరు. అందువల్లనే వేమన వ్యక్తిగత జీవితం స్పష్టంగా తెలిస్తేనే వేమన చేసిన స్త్రీ నిందకు గల కారణాలను స్పష్టంగా చెప్పగలం. అయినప్పటికీ తల్లిని గురించి, పతివ్రతలను గురించి, విధవలను గురించి, గయ్యాళి భార్యలను గురించి, వేశ్యలను గురించి వేమన చెప్పిన పద్యాలు అతడు యోగిగా మారక ముందు చెప్పి ఉంటాడు. అతనిలో మొదటి నుంచి యోగి లక్షణాలు ఉన్నాయి కాబట్టి వేమన వీటిలో స్త్రీవ్యతిరేకమైన, పురుషపక్షపాతంతో కూడిన భావాలను ప్రకటించాడు. స్త్రీజాతి మొత్తాన్ని నిందిస్తూ చెప్పిన పద్యాలు అతడు యోగి అయిన తర్వాత చెప్పి ఉంటాడు.

అయితే వేమన పై విధంగా స్త్రీలను, సంసారాన్ని, దాంపత్య జీవితాన్ని నిందించిన పద్యాలే కాకుండా వాటిని గొప్ప చేసి చెప్పిన పద్యాలు కూడా ఉన్నాయి. అయితే ఇవి తక్కువగా ఉన్నాయి.

పురుషు భాగ్యముననుబుణ్యవతి దొరుకు
పుణ్యవతికి నట్లు పురుషుడబ్బు
యిరువురి భాగ్యముననుహితులు సుపుత్రులు
యష్ట భోగములును అమరు వేమ

స్త్రీపురుషులు వారు వారు చేసుకున్న పుణ్యాన్ని బట్టి వారికి మంచి భార్యా భర్తలు లభిస్తారు. అంతేగాకుండా దంపతులు చేసుకున్న పుణ్యాన్ని బట్టి వారికి గుణవంతులైన పుత్రులు, మంచి మిత్రులు, భోగభాగ్యాలు లభిస్తాయి.

సుగుణ వంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటికయ్యు సంసారి కింకను

గుణవంతురాలైన భార్య, బుద్ధిమంతులైన కుమారులు ఉంటే సంసారికి వేరే స్వర్గం అక్కర లేదు. అతని ఇల్లే స్వర్గం లాగా ఉంటుంది.

సతికి పతికినైన సంపద సంపదే
పుత్ర సంపదలును భువిని మేలు



సరిగ ముదిసి బ్రతుకు సంపద సంపద , విశ్వ

దంపతులకు ధనధాన్యాలు, బంగారం లాంటి సంపద నిజమైన సంపద కాదు. వారికి పుత్రసంపదే నిజమైన సంపద. అంతేగాకుండా ఆదంపతులు నిండు నూరేళ్ళ వరకు బతికి మనుమలు, మునిమనుమలతో కలిసి జీవించడం గూడా సంపదే.

ఇచ్చి పుచ్చుకున్న హితమైన మనువులు
తగ్గులేక నర్లు తామర వలె
కాచి పూచి పండి కడు రమ్యమై యుండు , విశ్వ

ఇచ్చిపుచ్చుకున్న మంచి పెళ్ళిళ్ళు ఎలాంటి గొడవలు లేకుండా తామర పూవుల లాగా సుగంధ భరితమై కాచి పూచి రమ్యమైనవిగా ఉంటాయి.

వెలయ భూమి తల్లి విత్తనము తండ్రి
పంటలరయ సుతులు పాడి పరము
ధర్మము తన పాలిదైవము సిద్ధము , విశ్వ

ఈపద్యాన్ని వేమన అచ్చమైన వ్యవసాయదారుని లాగా చెప్పాడు. తల్లి భూమి లాంటిది. తండ్రి విత్తనం లాంటివాడు. పుత్రులు పంటల వంటి వారు. పాడి పరం లాంటిది. పరం అంటే బండి మీద వస్తువుల పెట్టడానికి వీలుగా ఉంచే చెక్కతో చేసే పెద్ద సాధనం. ధర్మం తన పాలిట దైవం.

భార్య మీద నాశ పరగు బురుషునకు
మగని మీద నాశ మగువ కుండు
శివుని మీద నాశ సిద్ధున కుండురా , విశ్వ

భార్య మీద భర్తకు, భర్త మీద భార్యకు ఆశ ఉంటుంది. అలాగే శివుని మీద సిద్ధునికి ఆశ ఉంటుంది.

పనస తొనల కన్న పంచదారల కన్న
జుంటి తేనె కన్న జున్ను కన్న
చెరకు రసము కన్న చెలి మాట తీపురా , విశ్వ

పనస తొనలు, పంచదార, జుంటితేనె, జున్ను, చెరకురసం మొదలైనవి చాల మధురమైన తినే వస్తువులు. వీటన్నింటి కంటె ప్రియునికి తన ప్రియురాలి మాటలు మరింత మధురంగా ఉంటాయి.

వెతలు దీర్చువాడు వేదాంత వేద్యుండు
రతుల నేలువాడు రసికు డగును
సతిని పెనగు వాడు సంసార యోగిరా , విశ్వ

ప్రజల దు:ఖాలను పోగొట్టేవాడు వేదాంతవేద్యుడైన దేవుడు. రతుల్లో మునిగి తేలేవాడు రసికుడు. ఏకపత్నీవ్రతంతో భార్య యందు మాత్రమే ప్రేమ కలిగి ఆమెతోనే సంసారజీవనం చేసేవాడు సంసారయోగి.

ఈవిధంగా వేమన సంసారజీవనాన్ని గురించి పొగడుతూ కొన్ని పద్యాలను చెప్పాడు. వీటిని అతడు యోగిగా మారక ముందు భోగిగా ఉన్నప్పుడు చెప్పి ఉంటాడు. లేకపోతే వీటిని వేమన పేరుతో ఇతరులు రాసి ఉండవచ్చు. ఇలాంటి పద్యాలు కొన్ని ఉన్నప్పటికీ వేమన స్త్రీనింద చేసిన పద్యాలే ఎక్కువగా ఉన్నాయి. ఈ స్త్రీ నింద పద్యాలు వేమన కీర్తికి కొంత మచ్చను కలిగిస్తూ ఉన్నాయి. అయితే లోకం చంద్రునిలో ఉన్న మచ్చను చూడకుండా చంద్రుడు ప్రసరింపజేసే వెన్నెలను హాయిగా ఆస్వాదిస్తున్నట్లుగా మహాకవి, ప్రజాకవి, ధీరకవి, యోగకవి, భావవిప్లవకవి, విశ్వకవి అయిన వేమన కులం, మతం, మూఢాచారాలు, పీడితులు మొదలైన విషయాల్లో ఎంతో విశాలమైన, ఉన్నతమైన, తర్కసమ్మతమైన, అభ్యుదయకరమైన, విప్లవాత్మకమైన భావాలను ప్రకటించడమే గాకుండా సార్వజనీనమైన సార్వకాలికమైన అనేక సుభాషితాలను, సూక్తులను, నిత్యసత్యాలను చెప్పినందువల్ల ఆయన చేసిన స్త్రీనిందను లోకం పరిగణించడం లేదు. లోకంతో పాటు మనం గూడా వేమన స్త్రీనిందను పరిగణించనవసరం లేదు.



## ఆధార గ్రంధాలు


1. జానపద నృత్యకళా గౌరవ సంప్రదాయం – డాక్టర్ బి. రామాచార్యులు- 1993
2. దుర్భాక రాజశేఖర శతావధాని – డాక్టర్ ఎం. జయదేవ్ , పద్మావతీ ప్రచురణలు, 1984
3. ప్రజాకవి వేమన – ఎస్ . గోపి, రామ్‌నగర్, హైదరాబాదు, 1992
4. నాథయోగి మన వేమన – ఆచార్య కొర్లపాటి శ్రీరామ మూర్తి, రమణ ప్రచురణ, విశాఖపట్నం,1987
5. పౌరాణిక రూపకాల్లో భావ విప్లవం – డాక్టర్ కె. సుదర్శన రాజు
6. మన వేమన – ఆరుద్ర, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1985
7. లోకకవి వేమనయోగి – మరుపూరు కోదండరామ రెడ్డి, భారతి ప్రింటర్స్, నెల్లూరు, 1983
8. విశ్వదాభిరామ వినురవేమ – త్రిపురనేని వెంకటేశ్వరరావు, వేమన వికాసకేంద్రం, మొగల్రాజ పురం, విజయవాడ, 1981
9. వేమన, మూలం- వి. ఆర్. నార్ల, అనువాదం- జి. లలిత, సాహిత్య అకాడమీ, రవీంద్ర భవన్, న్యూఢిల్లీ
10. వేమన – రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, ఆంధ్రవిశ్వకళాపరిషత్ విశాఖపట్నం,1945
11. వేమన కవితా సౌందర్యం–డాక్టర్ పి. హనుమంత రెడ్డి, 1995
12. వేమన జ్ఞానమార్గ పద్యములు – సి. పి. బ్రౌన్, ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూఢిల్లీ, 1986, 2005
13. వేమన చరిత్ర – బండారు తమ్మయ్య
14. వేమన పద్యరత్నాకరము – భాగవతుల సుబ్రహ్మణ్యం, బుగ్గల కోటరామమూర్తి, రహిమాన్ వీధి, అరండల్ పేట, విజయవాడ, 2004
15. వేమన పద్య రత్నాకరము – బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు, హైదరాబాదు, 2005

16.వేమన పద్యములు, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు,
1919

17.వేమన - పాశ్చాత్యులు, తెనుగుసేత- మరుపూరు కోదండరామ రెడ్డి,

18.వేమన యోగము - మేడపాటి వెంకట రెడ్డి,

19. Caste Tribes & Cultures of India, K.P. Bahadur, Vol- iv,
P- 23, Ess Publications, 1978

20.Vemana and Sarvajna – Dr. Gandham Appa rao,